



విడుదలై 50 సంవత్సరాలు
పూర్తయినా నేటికీ సజీవంగా
ఉన్న సంగీత సాహిత్యాలను
కలిగిన పాటలతో అలరారిన
వినోదా వారి 'దేవదాసు'
చిత్రంలోని కొన్ని దృశ్యాలు
పాఠకుల మధుర స్మృతి కోసం...

'హాసం'









'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# ఇవీ సంగతులు

# హాస్యం - సంగీతం











'సెంటర్ స్ప్రెడ్'లో
దొంగరాముడు అండ్ పార్టీ
నిన్నే ఇష్టపడ్డాను
సినిమా పాటల పుస్తకం
కలర్‌లో





ముఖచిత్రం: 'సింహాద్రి' లో
అంకిత

ఈ మధ్య బెంగుళూరు టౌన్‌హాలులో "ఘంటసాల" గారి పాటల కచేరి జరిగింది. రాత్రి 6-30గం॥ల నుండి 10-00గం॥ల వరకు "శ్రీఘంటసాల గీతాలు" "శృతిలయ" ఆర్కెస్ట్రా వారు గానం చేశారు. కచేరి మొత్తం ఘంటసాల గీతాలతో అటుతెలుగులోను, యిటుకన్నడం లోను వినసొంపుగా జరిగింది. పదిపాటలు తెలుగులోను, కన్నడంలో ఘంటసాల గానం చేసిన సత్యహరిశ్చంద్ర, రాజకోట రహస్యం, పెళ్ళి చేసి చూడు మొ॥గు గీతాల గానం చేశారు. చివరగా "పెళ్లిచేసుకుని- ఇల్లు చూసుకుని" పాటను, ఒక చరణం తెలుగులోను, మరో చరణం కన్నడంలోను పాడి అటు తెలుగు, యిటు కన్నడ శ్రోతల నుండి చప్పట్లతో అభినందనలు అందుకున్నారు. కార్యక్రమ నిర్వాహకులు రు॥50/- 100/- టిక్కట్లు పెట్టినా హట్ కేకుగా అమ్ముడయిపోయాయి ఆరోజు. దీనిని బట్టి అర్థంఅవుతుంది. బెంగుళూరులో "ఘంటసాల గీతాల"కు ఎంత క్రెజీ వుందో.

-కె.హరేరాము(వెంకటాచారి), బెంగుళూరు.

16-30 జూన్ 2003 నాటి 'హాసం',పక్షపత్రిక లో కె.వి.మహాదేవన్ వర్ధంతి సందర్భముగా ఆయన్ని ఫాలో అయ్యే వారు ఎవ్వరూలేరు..... నేను ఒక్కణ్ణే.. కీరవాణిగారి వ్యాసం సందర్భాను సారంగా చక్కగావుంది.

-డి.నాగేశ్వరరావు, వేకనూరు, కృష్ణాజిల్లా.

16-30 జూన్ 2003 'హాసం' సంచికలో 'స్వర చక్రవర్తి శ్రీసి.అర్.సుబ్బరామన్‌కు నివాళిగా ఎం.ఎల్.వసంతకుమారి గారి వాస్యం బాగుండి ఆసాంతం ఆపకుండా చదివిచింది.

-టి.శేషుబాబు, నాగాయలంక.

నాకిష్టమైన గాయనీమణుల్లో లతా మంగేష్కర్‌గారు ఒకరు. వారి గురించి పి.బి.శ్రీనివాస్ గారిచే ప్రారంభమైన "సప్త స్వర సుందరి- లతామంగేష్కర్" సీరియల్ ప్రచురిస్తు న్నందుకు కృతజ్ఞతలు. అలాగే అర్థం చేసుకుందాం-అస్వాదిద్దాంలో జూన్1-15 సంచికలో వడిక్కాదవేదై (తమిళం), ఆత్మబంధువు(తెలుగు)లోని "అనగనగా ఒక రాజు...." పాటవివరణ బాగుంది. పి.ఎస్. గోపాలకృష్ణగారికి కృతజ్ఞతలు. ఈశీర్షిక ఇంకా వెలుగొందాలని నాఆశ.

-కె.విజయరాఘవన్, వరంగల్.

16-30జూన్ 'హాసం'లో నచ్చిన కొన్ని విషయాలు

1. సుబ్బరామన్ గారు కారు హారన్ స్వరం చెబుతారనీ.

2.మహదేవన్, చక్రవర్తి, ఇళయరాజాల నుండి సంగీత పాఠాలే కాదు జీవితపాఠాలు కూడా విశ్లేషించిన తీరు కీరవాణి గారి కలం ద్వారానే

3.రసాలూరి గారి ఎన్నో పాటలు ప్రక్కన వారి ఖాతాలో జమ అవ్వడం




'బాపు విశ్వరూపం' అంటూ స్టాంపు సైజు బొమ్మలు వేయడం బాగాలేదు. బాపు బొమ్మలకు వ్యాఖ్యానం అవసరమా? ఆ బొమ్మలను అలాగే చూసి ఎంజాయ్ చేసేటట్లు పెద్దగా వేయవచ్చు కదా!

**మూర్తి, హైదరాబాద్**

(బాపు విశ్వరూపం అన్నాం గానీ బాపు బొమ్మల విశ్వరూపం అనలేదు. బాపు బొమ్మలు అలంకరించని తెలుగుపత్రిక గాని, తెలుగిల్లు గాని లేదు. బాపు బొమ్మలు అందంగా ఉంటాయని వ్యాఖ్యానించి ఊరుకునేవారే ఎక్కువ. అందంగా బొమ్మలు వేసేవారందరూ 'బాపు'లు ఎందుకు కాలేకపోతున్నారో చెప్పే ప్రయత్నమే ఇది. బాపు బహుముఖప్రజ్ఞ, పరిశీలనాశక్తి, విద్వత్తు, అధ్యయనశీలత, నిత్యాన్వేషణ - వీటన్నిటినీ చూపే శీర్షిక ఇది. ఒక్కోసారి ఒక్కో పార్శ్వాన్ని చూపే ప్రయత్నం జరుగుతోంది. ఆయా బొమ్మల ఒరిజినల్స్ అందరూ చూసినవే, భద్రపరచుకున్నవే! అంతస్సూత్రంగా ఉన్న అంశాన్ని ఎత్తిచూపి, గుర్తుకుతేవడానికి గాను ఆయా బొమ్మలు వేయడం జరుగుతోంది.

ఇక వ్యాఖ్యానాల గురించి - 'హాసం' లక్ష్యమే అది కదా, పాట విని ఆనందించేవారున్నా, ఆ పాట విశేషతను గురించి వివరించి మరింత ఆసక్తి రగిలిస్తున్నాం కదా! అదేవిధంగా ఈ వ్యాఖ్యానాలను చదివినవారు బాపు బొమ్మల అందం చూసి అక్కడే ఆగిపోకుండా, కాస్తంత లోతుగా విశ్లేషించుకుంటూ చూసి మరింత 'ఎప్రీషియేట్' చేస్తారని మా ఆశ. ప్రబంధాల ముఖచిత్రాల సంగతే చూడండి. ఎంతమందికి వాటి సబ్జక్ట్ గురించి తెలుసంటారు?

విశ్వరూపం గురించి ప్రస్తావించారు కాబట్టి - దేవుడి విశ్వరూపం పటం చూడండి. ఒక విరాట్‌మూర్తికే అక్కడ ప్రాముఖ్యత. సూర్యుడైనా, చంద్రుడైనా, బ్రహ్మైనా, శివుడైనా, పర్వతాలుగు లోకాలైనా - అవన్నీ చిన్న చిన్నగానే కనబడతాయి. ఇక్కడ బాపుగారి ఉపజ్ఞ, మేధయే హైలైట్ అవుతున్నాయి. బొమ్మలు కావు.

-ఎడిటర్)

4.మందార.. మకరంద సాహిత్య, సంగీత, సం॥దర్శకుని, గాయకుని, శ్రోతని ఇన్ని కోణాల నుండి ప్రతిభని తెలియచెప్పిన విషయం నిర్భుంగా 'ఆపాత మధురం'

5.సూర్యకుమారి, భక్తపోతన ఆడియోరిలీజు లోకల్ షాపులకు 'హాసం' చూపించి ఆర్డర్ చేయవలసి వస్తోంది. ఇది ఒక రకంగా బాధ, ఒక రకంగా సంతోషం.

'హాసం' డైలీనో, వీక్లీనో అయితే ఎంత బాగుండు.

ఇన్ని చక్కని విషయాలతో వస్తుంది కనుకే 'హాసం' పాఠకులకి ఎప్పుడూ హృదయ విహారం.

-వి.రాగసుధ, ఖమ్మం

1-15 జూన్ సంచికలో శ్రీరంగం శ్రీనివాసరావుగారి జీవిత విశేషాలు, వివరాలు ఇచ్చినందుకు 'హాసం' పత్రికకు, వ్యాసం అందించిన పాలకోడేటి గార్కి నాకృతజ్ఞాభి వందనాలు.

-ముత్యాల భాస్కరరావు, మల్కిపురం

ఆనాటి రచయితల, సంగీత దర్శకులను గురించి వేటూరి గారు రాస్తున్న వ్యాసాలు చాలా ప్రయోజన కరంగా ఉన్నాయి. అలనాటిస్థాయిని అన్ని విధాలా కోల్పోతున్న నేటి సినిమా జీవులకు ఈ వ్యాసాలు కనువిప్పు కాగలవని నమ్ము తున్నాను. ఈ తరం వారికి తెలియనివి ఎన్నో విశేషాలు, సంఘటనలు కళ్లకి కట్టినట్టు తెలియజేస్తున్న 'హాసం' పత్రిక నిజంగా 'మా కోసం' అనక తప్పదు.

-ఎన్. లక్ష్మీ పుష్పలత, హైదరాబాద్

'హాసం' కొరకు మా కుటుంబం అంతా ఎదురుచూస్తూ ఉంటాం. వారపత్రికగా ప్రచురిస్తే బాగుంటుంది. ఈ పత్రికలో శ్రీశ్రీ గారి గురించి రాస్తూ వారి పాటలు ప్రచురించారు. చాలా ఆనందించాం.

- చెరుకూరి సర్వేశ్వరరావు, బూరుగుపూడి

నారీనారీ నడుమ నందమూరి బాలకృష్ణ ముఖచిత్రంతో వెలువడిన 'హాసం' ఎంతో ముచ్చటగా ఉంది. ప్రముఖులతో ఇంటర్వ్యూలు చాలా కొత్తగా ఉంటున్నాయి. కిషోర్ మధుర స్మృతుల నుండి తేరుకోక ముందే మరో అద్భుత గాయని-గాన కోకిల లతా జీవిత చరిత్ర పి.బి.శ్రీనివాస్ గారి కలం నుండి జాలువారటం చాలా సంతోషాన్ని కల్గిస్తోంది.

-బి.శ్రీనివాసాచారి, హైదరాబాద్

జూన్ 1-15 'హాసం' సంచికలో మీరు చేయించిన ఇంటర్వ్యూలన్నీ బాగున్నాయి. ముఖ్యంగా వేటూరి గారు ఇళయరాజా- బాలు గార్ల గురించి చెప్పిన మాటలన్నీ హృదయా నందాన్ని కల్గించాయి. చక్రి గారి గురించి భాస్కరభట్ల ఇంటర్వ్యూ వెరైటీగా ఆకట్టుకుంది.

-యన్.కె.నాగేశ్వరరావు, పెనుగొండ

The one and only Magazine devoted to Humour & Music




# హాసం

## హాస్య-సంగీత పత్రిక


43

సంపుటి : 2 సంచిక:19

1-15 జులై 2003

పేజీలు: 68 + 8

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $400

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా|| కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
K.I.Varaprasad Reddy
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-23541713

Printed at: Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

Published at: 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

Editor: RAJA

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82


**హా**స్య, సంగీత కళాకారులను తలచుకోవడానికి, వారి కృషి గురించిముచ్చటించుకోవడానికి వారి పుట్టినరోజులనో, సందర్భపడినచోట్ల వర్ధంతులనో 'హాసం' ఉపయోగించుకుంటోందని అందరూ గమనించిన విషయమే! ప్రముఖుల పుట్టినరోజున వారితో పత్రికల వారు ఇంటర్వ్యూ ప్రచురించడం ఒక పద్ధతి. వారి గురించి మరొక ప్రసిద్ధవ్యక్తిచేత వ్యాసం వ్రాయించడం మరొక పద్ధతి.

ఈ రెండూ కాకుండా ఆ రంగానికి చెందిన మరొక ప్రసిద్ధవ్యక్తిచే ఇంటర్వ్యూ చేయించి ఆ విశేషాలు పాఠకులకు తెలియపరచడం జరిగింది జూన్ తొలి సంచికలో. ఈసారి 'హాసం' మరొక విభిన్న ప్రయత్నం చేస్తున్నది - బర్త్‌డే బేబీ గురించి 'హాసం' అదే రంగానికి సంబంధించిన మరొక విశిష్టవ్యక్తితో ముచ్చటించి ఆ వివరాలు అందిస్తున్నది.

మనలో చాలామందికి - ఇంచుమించు అందరికీ అనవచ్చు - విమర్శలు తెలిపినంత త్వరగా ప్రశంస తెలుపం. 'బాగుంది' అనడానికి ఛట్టున నోరు రాదు కానీ 'బాగాలేదు' అన్నది మాత్రం ముందు చెబుతాం. ముఖ్యంగా మనిషి ఎదుట పొగడడం మనకు అదోలా ఉంటుంది.

ముఖం మీద మెచ్చుకుంటే పిల్లవాడు పొగరుబట్టిపోతాడన్న భయంతో చిన్నప్పుడు తల్లిదండ్రులు మెచ్చుకోకుండా జాగ్రత్తపడతారు. సాధ్యమైనంతవరకూ తిట్లద్వారానే తమ ప్రేమ తెలుపుతారు. మరీ మెచ్చుకోవాల్సిన ఘనకార్యం పిల్లవాడు చేసినప్పుడు 'సర్లే, సర్లే' అంటారు. 'వచ్చేఏడాది కూడా ఇలా మార్కులు రాకపోతే తాట వలుస్తాను' అని అనేసి ఆ 'మెప్పు' ను కూడా కాంపెన్సేట్ చేస్తారు.

ఇలా పెరిగిన కుర్రవాడికి ఇంకోళ్లని మెచ్చుకోవడం ఎక్కడనుండి నేర్చుకుంటాడు? ఎదిగి, పెళ్లాడాక భార్య బాగా వంట చేసినా 'బాగుంది' అనే ప్రశంస అనలేడు. ఉప్పు తక్కువైనా, మాడిపోయినా మాత్రం క్షణం ఆలస్యం కాకుండా ఆ వైనం తెలియబరుస్తాడు. ఎవరైనా ఇంటికి పిలిచి ఆతిథ్యం ఇచ్చినా 'శ్రమ పడ్డారు పాపం' అంటాడేమో కానీ, 'మీ ఇల్లు బాగుంది, విందు బాగుంది' అనడు. లోకం మెప్పు పొందాలంటే మనిషికి చచ్చి సాధించాల్సిందే! బ్రతికుండగా పట్టించుకోనివాడు కూడా అవేళ ఘనమైన నివాళి చచ్చినట్టు అర్పించి తీరతాడు!

ఇలాటి వాతావరణంలో ఒకవేళ ఎవరైనా ప్రశంసించినా అనుమానస్పదంగా చూసే పరిస్థితి ఏర్పడింది. మనసుకు నచ్చి మెచ్చుకుంటే ముఖస్తుతి అనుకుంటాడేమో, 'నా వల్ల ఏమైనా పనుందా బాబూ?' అని అడిగేస్తాడేమో అన్న భయంతో సాధ్యమైనంత వరకు ప్రశంసల జోలికి పోము.

మామూలు ప్రపంచమే ఇలా ఉంటే, కళాప్రపంచంలో ఇవి మరికాస్త ఎక్కువనిపిస్తుంది. గుమ్మడి గారు ఒకసారి రాశారు - ఆయనా, ఎస్వీరంగారావు గారు కలిసి విదేశాలకు వెళ్లినప్పుడు 'రంగారావు గారు తెలుగువాళ్లలో పుట్టడం ఆయన దురదృష్టం. లేకపోతే అంతర్జాతీయ నటుడయ్యేవారు' అని సభాముఖంగా అన్నారట గుమ్మడి. దానికి రంగారావు గారు ముగ్ధులయిపోయి, సభ అయిపోయిన తర్వాత 'నిజంగా నీవలా ఫీలవుతున్నావా, బ్రదర్' అని ఎంతో సంతోషించారట.

అంటే దీనర్థం ఏమిటి? గుమ్మడిగారు రంగారావు గురించి తన మనస్సులో ఉన్న ఎడ్మిరేషన్‌ను రంగారావుగారికి ప్రత్యక్షంగా అంతవరకు తెలియపరచలేదన్నమాట. సందర్భం రాలేదన్న కారణం గానీ, చెబితే అదోలా ఉంటుందన్న సంకోచం గానీ ఏదో ఒక కారణం ఉండిఉండవచ్చు. కానీ ఆనాడు ఆ విధంగా అది వెలువడడం వల్ల వారిద్దరి మధ్య పరస్పరాభిమానాలు మరింత పెరిగివుండవచ్చు. దానివల్ల కళారంగానికి, సినిమా ప్రేక్షకులకు మరింత మేలే జరుగుతుందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

'హాసం' ఈనాడు ఇటువంటి ప్రయోగమే చేసింది. సుప్రసిద్ధ సంగీతదర్శకుడు మణిశర్మ గురించి ఆర్.పి.పట్నాయక్ తో ముచ్చటించింది. ఆయన అభిప్రాయాలు సేకరించింది. ఇది మణిశర్మ సముఖంలో జరగలేదు కాబట్టి 'ముఖస్తుతి' అనడానికి లేదు. ఒక సంగీతదర్శకుడు 'హాసం' వంటి సంగీతపత్రికతో మరొక సంగీతదర్శకుడి ప్రతిభాపాటవాల గురించి చర్చించడం దీనిలో విశేషం.

అదేవిధంగా కీరవాణి గురించి వారి సోదరుడు, సంగీతదర్శకుడు కళ్యాణ్‌మాలిక్ ముచ్చటించడం. ఇవన్నీ సంగీతరంగానికి మేలు చేసే ప్రక్రియలేనని 'హాసం' భావిస్తోంది.



# "నమో నమః"

(నాటిక)

- దివాకరబాబు

ప్రముఖ సినీ రచయిత



**జరిగిన కథ**

హైదరాబాదునుండి ముంబాయికి వెళ్లే ఓ విమానం కుప్పకూలుతుంది. పారాచూట్ సహాయంతో తప్పించుకున్న ధనవంతుడు నరసింహం, కవి అయిన కళాకారుడు, మేధావి అయిన సైంటిస్టు, మిస్ యూనివర్స్‌పోటీకి వెళుతున్న ప్రజ అనే అందమైన అమ్మాయి - ఓ అడవిలో తారసిల్లుతారు. నరసింహం వద్ద సూట్‌కేసులో డబ్బుంటుంది. అందరూ తలోదారిని వెళ్లి దగ్గర్లో ఊరు ఎక్కడుందో కనిపెడదామని అనుకుంటారు.

(ఇక చదవండి)



ఇందులో 4 పురుష పాత్రలు, 1 స్త్రీ పాత్ర వున్నాయి. పురుష పాత్రల వయసు 25 సంవత్సరాలు, స్త్రీ పాత్ర వయసు 19 సంవత్సరాలు... 25 సంవత్సరాలు పైబడిన వయసు వాళ్ళయినా పురుష పాత్రల్ని పోషించవచ్చు. కానీ స్త్రీ పాత్ర మాత్రం ఖచ్చితంగా 19 సంవత్సరాలే..

**-దివాకరబాబు**

సైంటి : ..ఇది...

ప్రజ, నరసింహం సీరియస్‌గా చూసారు

సైంటి : ...బాగున్నట్టే వుంది...

ప్రజ : ..కదా! అయితే పదా!

అందరూ బయల్దేరారు.

కళా : ఆగండి...

ఆగారు

కళా : అందరూ కర్చీఫ్‌లు తీయండి.

నర : ఎందుకు?

కళా : తీయండి చెప్తా

ప్రజ : నా దగ్గర కర్చీఫ్ లేదు.

నర : నా దగ్గర వుందిగా తీసుకో

ఇచ్చాడు.

కళా : (రుమాలు చింపుతూ) కర్చీఫ్‌ని సన్న పీలికలు చేయండి.

సైంటి : ఆ పీలికలతో తాడుపేని ఉరేసుకు చద్దామా?

కళా : ముందు చెప్పిన పని చేయండి.

చేసారు.

కళా : (పీలికలను చెట్టుకి కడుతూ) మనం వెలుతూ చెట్లకి ఇలా కట్టుకుంటూ వెళితే... తిరిగి వచ్చేటప్పుడు దారి మర్చిపోకుండా వుంటాం...

నర : భలే టెక్నిక్ కనిపెట్టావే...

మేధా : నేనొప్పుకోను... నేనొప్పుకోను... కనిపెట్టాల్సింది నేను.

ప్రజ : ఎవరో ఒకళ్ళు కనిపెట్టారు కదా... పదండి... (ఆగి) నరసింహా... నీ కర్చీఫ్ నాకిచ్చేసావు కదా..మరి నీకు...

నర : నేను ఇక్కడ్నుంచి కదల్నుగా,నేనిక్కడ కూర్చొని వుంటాను మీ ముగ్గురూ వెళ్ళి దారి తెల్సుకురండి. దారి కనిపెట్టి నన్ను క్షేమంగా వూరికి చేర్చిన వారికి కోటి రూపాయలు ఇస్తాను...యస్ వన్ క్రోర్

ప్రజ : అయితే ఆ కోటి నాకే

అంటూ వెళ్ళింది

కళా : ..కాదు నాకే...

వెళ్ళాడు

సైంటి : మీ ఇద్దరికీ కాదు నాకు.
దారి కనిపెడతా
కోటి చేపడతా.

వెళ్ళాడు.

నర : (నవ్వుకుని) డబ్బుంటే కొండమీద కోతి వస్తుంది. అడవిలోంచి దారి వస్తుంది. అందుకే నేను పెళ్ళాం చేయి వదిలేసి సూట్‌కేస్ పట్టుకుంది.

కూర్చుని సిగరెట్ వెలిగించాడు.

ప్రజ పరిగెత్తుకుంటూ వచ్చింది.

నర : ఏంటి అప్పుడే వచ్చేసావ్... ఏదైనా వూరు కనిపించిందా?

ప్రజ : వూరు కాదు ఏనుగుల గుంపు కనిపించింది. భయమేసి వచ్చేసాను... వాళ్ళిద్దరి కన్నా ఏదైనా వూరు కనిపిస్తే బావుండు.

నరసింహం ఇంతసేపూ ప్రజ వంక రెప్పార్పకుండా చూస్తున్నాడు. అది గమనించి

ప్రజ : ఏంటలా చూస్తున్నావ్...?

నర : చూపు తిప్పుకోలేని నీ అందాన్ని. ఎన్నో దేశాలు తిరిగాను కానీ నీ లాంటి బ్యూటీని ఎక్కడా చూడ్లేదు.... యూ ఆర్ బ్యూటిఫుల్!

ప్రజ : థాంక్స్.. ఈ ప్లేన్ యాక్సిడెంటు జరక్కుండా వుంటే ఈ విషయం ప్రపంచం మొత్తానికి తెల్సేది.

నర : అంటే...

ప్రజ : మిస్ యూనివర్స్ కిరీటం జస్ట్ మిస్ అయిపోయింది.

నర : నా మిసెస్ మిస్ అయిపోయినా నీ లాంటి మిస్ యూనివర్స్‌ని కల్సినందుకు ఐ యామ్ రియల్లీ హేపీ

ప్రజ : థాంక్యూ

నర :వెల్‌కమ్... బై ది వే నేను నిన్ను పెళ్ళి చేసుకోవాలి అనుకుంటున్నాను.

ప్రజ : ..పార్డన్!

నర : నువ్వు సరిగ్గానే విన్నావు... నేను నిన్ను పెళ్ళి చేసుకుందాం అనుకుంటున్నాను.

ప్రజ : నో.. నో..దటీజ్ ఇంపాజిబుల్

నర : నో.. నువ్వు నన్ను పెళ్ళి చేసుకోవాలి. ఐ వాంట్ యూ ఎట్ ఏనీ కాస్ట్!

ప్రజ : నో.

నర : వై.?

ప్రజ : ప్రపంచ సుందరినయి ఎన్నో యాడ్స్‌లో నటించి, తర్వాత సినిమాల్లో నటించి ఎంతో సంపాదించి, ఎన్నో అనుభవిద్దామనుకున్నాను. అలాంటిది నీతో ముడిపడి మూల కూర్చోవడమా - నెవర్!

నర : అంటే.... నీక్కావల్సింది...

ప్రజ : డబ్బు... హోదా... దర్జా...

నర : అవన్నీ నేనిస్తాను. కోట్లు ఖరీదు చేసే నా ఎస్టేట్ నీ పేరుతో రాసిస్తాను. నోట్లు పరిచి నిన్ను దాని మీద నడిపిస్తాను. ఓట్లు కొని నిన్ను ఈ స్టేటుకి సి.ఎం.ని చేస్తాను.



మిస్ యూనివర్స్ కిరీటం మిస్ అయినందుకు బాధపడుతున్నావ్ కదూ.

ప్రజ : అవును.

నర : నీకు రావాల్సిన కిరీటాన్ని దక్కించుకున్న ఆ మిస్ యూనివర్స్‌ని నీ యింట్లో దాసిని చేస్తాను.

ప్రజ : రియల్లీ

నర : అంతేకాదు,.. ఎనీథింగ్ అండర్ ది స్కై, జస్ట్ ఆస్క్..ఐ విల్ ప్రొవైడ్..

ప్రజ : ఓ థ్యాంక్యూ... థ్యాంక్యూ వెరీ మచ్.....

నాక్కావల్సింది అదే. నేను నిన్ను పెళ్ళి చేసుకుంటాను.

నర : థ్యాంక్యూ....

అంటుండగా కళాకారుడు వచ్చాడు.

నర : ఏంటి అప్పుడే వచ్చేశావ్?

కళా : నే వెళ్ళిన వైపు లోయ వుంది. అందుకే వెనక్కి వచ్చేశాను. ఇంకా ముందే వచ్చేసేవాడ్నే.... కానీ అక్కడ రత్నాలు, వజ్రాలు, పగడాలు వున్నాయి.... ఆ రంగురాళ్ళ అందాలు చూస్తూ... నన్ను నేనే మైమరచిపోయాను.

నర : ఏవీ?

కళా : ఏంటీ?

నర : ఆ వజ్రాలు అవీ....

కళా : నాకెందుకూ.. అయినా ఈ అడవిలో ఏం చేసుకుంటాం? అందుకని తేలేదు.

నర : అవంటూ వుంటే ఏవన్నా చేసుకోవచ్చు....

కళా : అయితే నువ్వే తెచ్చుకో!

నర : ఇటేగా నువ్వెళ్ళింది!

అంటూ వెళ్ళాడు.....

కళా : (నరసింహం వెళ్ళినవైపు చూస్తూ.....)పూర్ ఫెలో

ప్రజ : అదేంటి అలా అంటావ్.... అతను చాలా రిచ్ కదా....

కళా : ఎంత రిచ్ అయితే మాత్రం ఏం లాభం.. అక్కడ వజ్రాలు, రత్నాలు వున్నాయని చెప్పేసరికి వాటికోసం పరిగెత్తాడు. తృప్తి లేనివాడే ప్రపంచంలో అందరికన్నా పేదవాడు.

ప్రజ : అంటే రిచ్ కావాలన్న ఆశ నీకు లేదా....?

కళా : ఆశ అనేది వున్నంత వరకూ ఎంత వున్నా పూర్ కింద లెఖ్ఖ.

ప్రజ : నువ్వు నరసింహం కన్నా గొప్పవాడివా...?

కళా : (ఆరాధనగా చూస్తూ)ఈ క్షణంలో అతని కన్నా ఎన్నోవేల రెట్లు గొప్పవాడిని...

ప్రజ : ఎందుకని...

కళా : అతను వజ్రాలు, వైఢూర్యాలు, రత్నాలు, మాణిక్యాలు చూడడం కోసం వెళ్ళాడు... నేను అంతకన్నా విలువైన నీ సౌందర్యాన్ని చూస్తున్నాను కనుక....

ప్రజ : (మురిసిపోతూ) నేను అంత అందంగా వున్నానా?

కళా : సాధారణమైన అందం అయితే నిన్ను వర్ణిస్తూ కవిత్వం చెప్పేవాడ్ని.... ప్రబంధాలు రచించేవాడ్ని...

ప్రజ : ఆహా:...

కళా : మాటల్లో చెప్పలేని, కవిత్వంలో కుదించలేని అందం నీది...

ప్రజ : అంటే నేను గొప్పా... నా అందం గొప్పా.....

కళా : చాలా చిక్కు ప్రశ్న వేసావ్.... గంట గొప్పదా.. నాదం గొప్పదా... పుష్పం గొప్పదా పరిమళం గొప్పదా అంటే ఏం చెప్పగలను?

ప్రజ : నీ మాటలు విన్నకొద్దీ ఇంకా వినాలనిపిస్తోంది...

కళా : నిన్ను చూస్తున్నకొద్దీ ఇంకా మాట్లాడాలనిపిస్తోంది.

ప్రజ : మాట్లాడు. నీ మాటలు వింటుంటే తనువు, మనసు పులకించిపోతున్నాయి.

కళా : ఆ అనుభూతిని డబ్బుతో కొనగలమా?

ప్రజ : ఖచ్చితంగా కొనలేం...

కళా : మరి నేను నరసింహం కన్నా గొప్పవాడ్ని అని వొప్పుకుంటావా?

ప్రజ : వొప్పుకుంటాను....

కళా : ప్రజా....

ప్రజ : నా సౌందర్యాన్ని ఆరాధించే నువ్వు నాకు కావాలి...

కళా : అయితే నన్ను పెళ్ళి చేసుకుంటావా?

ప్రజ : ఆ మాట నేనే నిన్ను ఆడుగుదాం అనుకుంటున్నాను. నువ్వే అడిగావ్...

కళా : నువ్వు ప్రకృతివి- నేను పురుషుడ్ని... ఈ ప్రజ - కళాకారుడి కలయిక ప్రపంచంలో అందరికీ ఆదర్శవంతం కావాలి...

నరసింహం అరుపు వినిపించింది-

కళా : ఇప్పుడే వస్తా...

ప్రజ : ఎక్కడికి?

కళా : ఆ పిచ్చివెధవతో వజ్రాలు, రత్నాలు వున్నాయని అబద్ధం చెప్పాను.. ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో పిలుచుకొస్తా.

ప్రజ : అబద్ధం చెప్పావా... ఎందుకు?

కళా : నీతో ఏకాంతంగా మాట్లాడాలని... అతన్ని పంపించాను... వస్తా...

వెళ్ళాడు....

ప్రజ : (స్వగతం) నాకు డబ్బు, దర్జా, హోదాలతోపాటు పొగడ్తలూ కావాలి... ఆర్టిస్టూ నాకు నువ్వూ కావాలి...

కళాకారుడు వెళ్ళిన వైపు చూస్తూ అంది.

సైంటిస్టు మరో పక్క నుంచి నీరసంగా నడుస్తూ వచ్చాడు.

ప్రజ : వాట్ మిస్టర్ సైంటిస్ట్...! వూరికి దారి కనిపెట్టావా?

సైంటి :కనిపెడితే ఇంత నీరసంగా ఎందుకుంటాను?

ప్రజ : కానీ నువ్వు లేనప్పుడు నేను రెండు విషయాల్ని కనిపెట్టా...

సైంటి :అదే నాకు మండేది... అందరూ అన్నీ కనిపెట్టేస్తే ఇంక నేనెందుకు... సర్లే ఇంతకీ ఏం కనిపెట్టావ్?

ప్రజ : మనిషికి కావాల్సింది రెండే రెండు...

ఒకటి డబ్బు...

రెండు అందం...

సైంటిస్టు పకపకా నవ్వాడు...

ప్రజ : ఎందుకు నవ్వుతున్నావ్...?

సైంటి :అందుకే ఎవరు చేసే పని వాళ్ళే చేయాలి. గాడిద



పని గాడిద, కుక్కపని కుక్క చేయాలి. సైంటిస్టు పని సైంటిస్టే చేయాలి.

ప్రజ : ఏంటి నువ్వనేది?

సైంటి : ఖర్చుపెడితే డబ్బు ఎంతయినా అయిపోతుంది... వయసు మీదపడితే ఎంత అందమయినా తరిగిపోతుంది...
అందగత్తెను అనుకుంటున్న నీ జుట్టు నెరిసిపోతుంది... నీ చర్మం ముడతలు పడిపోతుంది. నీ పళ్ళు వూడిపోతాయి. నీ నడుం వొంగిపోతుంది...

ప్రజ : (భయంతో) నో... అలా జరక్కూడదు.
అలా జరక్కూడదు. అందం లేని వికార రూపాన్ని నేను వూహించను కూడా వూహించలేను... నా అందం శాశ్వతంగా ఇలాగే వుండాలి... ఇలాగే వుండాలి....

సైంటి : ఓ... యురేకా... యురేకా.... ఇన్నాళ్ళు నేను ఏం కనిపెట్టాలా అని కన్ఫ్యూజన్‌లో పడిపోయాను.. ఇప్పుడర్థమైంది ఏం కనిపెట్టాలో...

ప్రజ : ఏం కనిపెడతావ్?

సైంటి : ఇంతవరకూ ఎవరూ కనిపెట్టనిది... అదేంటో ఇంత గొప్ప ఐడియా వచ్చింది. నాకు నోబుల్ ప్రైజ్ ఖాయం.

ప్రజ : అబ్బబ్బ ఏం కనిపెడదాం అనుకుంటున్నావో చెప్పు...

సైంటి : నీ అందం ఇలా పర్మినెంట్‌గా వుండిపోయే మందు కనిబెడతా...

ప్రజ : ఓ... గ్రేట్... గ్రేట్... గ్రేట్
ఆ మందు నా ఒక్క దానికే ఇవ్వాలి...

సైంటి : ఇస్తే నాకేంటి లాభం..?.

ప్రజ : నేను నీదాన్ని అవుతాను...

సైంటి : థాంక్యూ... మనిద్దరం పెళ్లి చేసుకుంటే నా తెలివితేటలతో, నీ అందంతో పిల్లలు పుడతారు.

ప్రజ : అయ్యయ్యో...
ఒకవేళ నీ అందంతో, నా తెలివితేటల్తో పుడితే-?

సైంటి : అందుకే ఓ అరడజను మందిని కనిపడేద్దాం. ఎవరో ఒకళ్లకి నీ అందం, నా తెలివి తేటలు వస్తాయ్... చూసావా ఎలా కనిపెట్టేసానో... సో... సిటీకి వెళ్ళగానే మనం పెళ్ళి చేసుకుంటున్నాం..

నర, కళా వచ్చారు.

నర : ఏంటి సైంటిస్ట్..? పెళ్ళంటున్నావ్...

సైంటి : హియరీజే గుడ్ న్యూస్ టు బోత్ ఆఫ్ యూ...
నేను, ప్రజా పెళ్ళి చేసుకోబోతున్నాం...

నర, కళా : వాట్...

సైంటి : యస్... ప్రజ నాకు ప్రామిస్ చేసింది..

కళ : నో నో... నాకు ప్రామిస్ చేసింది...

సైంటి : ప్రజ నాక్కావాలి...

కళ : ప్రజ నాక్కావాలి..

నర : ప్రజ నాక్కావాలి..

రిపీట్ చేస్తూ

ప్రజ చుట్టూ తిరుగుతున్నారు

ప్రజ : స్టాప్.. నాకు ముగ్గురూ కావాలి

ముగ్గురూ ఫ్రీజ్ అయ్యారు

ప్రజ : ఏంటలా చూస్తున్నారు... నాకు ముగ్గురూ కావాలి.
నరసింహం, డబ్బున్న నువ్వు కావాలి.
సైంటిస్టూ, నా అందాన్ని శాశ్వతం చేసే నువ్వు కావాలి.
ఆర్టిస్టూ, నన్ను పొగడ్తలతో ముంచెత్తే నువ్వూ కావాలి.

నర : అంటే ముగ్గుర్ని పెళ్ళి చేసుకుంటావా...!?

ప్రజ : యస్

ముగ్గురూ ఒకేసారి-

నర : నో

సైంటి : కుదరదు

కళా : ఇంపాజిబుల్

ప్రజ : మీకు నేను కావాలా వద్దా?

ముగ్గురు : కావాలి...

ప్రజ : అయితే ఒప్పుకోండి.

నర : (క్షణం ఆలోచించి) నేను ఒప్పుకుంటాను.

సైంటి : చట్టం వొప్పుకోవద్దూ..

నర : చట్టం డబ్బున్నవాడికి చుట్టం. చట్టాన్ని కొంటాను... మార్పిస్తాను...

కళా : అరసంలా, విరసంలా 'సరసం' అనే సంస్థని పెడతాను. ఒక స్త్రీ ముగ్గుర్ని పెళ్ళి చేసుకోవడం కరక్టే అని కళాకారుల చేత దిక్కులు పిక్కటిల్లేలా అరిపిస్తాను.

సైంటి : (సీరియస్‌గా) ఒక స్త్రీ ముగ్గుర్ని పెళ్ళాడితే ( కూల్‌గా)ఆ నలుగురి ఆయుషు పెరుగుతుందని సైంటిఫికల్‌గా ప్రజల్ని నమ్మిస్తాను.

ముగ్గురు : మేం తలచుకుంటే ఏమైనా చేస్తాం.

నర : ఆల్‌రైట్! అందరం ఒకటయ్యాం. కాబట్టి ఒకే వైపుకి వెళ్దాం పదండి.

ప్రజ వెనక ముగ్గురూ నడుస్తున్నారు. సైంటిస్టు నవ్వాడు.

నర : ఎందుకలా నవ్వుతున్నావ్?

సైంటి : నాకు చాలా డబ్బుంది అని ఫోజులు కొట్టి ఇప్పుడు ప్రజ వెనకాల నడుస్తున్నావ్ కదా!

నర : నువ్వు మాత్రం నేను కనిపెడతా...కనిపెడతా అన్నావ్... నువ్వు నడవటం లేదూ...

కళా : అవును కరక్టే!

సైంటి : నువ్వేంటమ్మా! నేను కళాకారుడ్ని, చింపేస్తాను, చింపేస్తాను అన్నావ్! నువ్వు నడవటంలా...

ప్రజ : ఆపుతారా!ఈ ప్రజతో మీకు అవసరం వుంది కాబట్టి నా వెనక నడుస్తున్నారు. అవసరం లేకపోతే నడుస్తారా..! పదండి.

అందరూ అవుట్(Exit) అయ్యారు

లైట్స్ ఆఫ్

-(ఇంకావుంది)



# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## నటనమాడవే మయూరి

నటన మాడవే మయూరి
నటన మాడవే

1. కటియిటునటు కదలియాడ
చిరుపదాలు చిందులాడ
వంపుల మెడ సొంపులొలుక
ఇంపుగ గళమెత్తి పాడి ॥నటన॥

2. ఆకసంపు టంచు దాటి
పైకిపైకిప్రాకి వచ్చు
నీలి మబ్బు దుప్పటాన
తేలియాడు కలలలోన ॥నటన॥

3. ఉరుముల సడి మెరుపుల వడి
చినుకుల జడి తాళముగా
సరస నీసఖుడు పురివిడి
వన్నెల కన్నుల చూడగ ॥నటన॥



మయూర నృత్యం వర్షారంభానికి సూచనగా వర్ణిస్తారు. ఆకసాన మబ్బులు కమ్ముకొని ఉరుములు మెరుపులతో చిరుజల్లులు ఆరంభం కాగానే నెమళ్ళు ఆనందంతో పురి విప్పుకొని ఆడుతాయి. అందమైన పురి - ఉండేది మగ నెమలికే. "సరస నీసఖుడుపురివిడి వన్నెల కన్నుల చూడగ" ఆనందంతో నీవు కూడా నృత్యం చేయమని మయూరి (ఆడనెమలి)ని ఉద్బోధిస్తున్నారు కవి రజని గారు. వర్ష ఋతువును సూచించే చక్కని యీ గేయానికి కాపి, మోహన రాగాలను ఉపయోగించి మనోహరమైన బాణీని కూర్చి సుమారు 50 సంవత్సరాల క్రితం ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో శ్రీమతి పేరిందేవిగారు గానంచేశారు. ఉర్దూ భాషలో ఎక్కువగా కార్యక్రమాలు ఉండే ఆనాటి హైదరాబాదు కేంద్రంలో తెలుగు కార్యక్రమాలు చాలా తక్కువగా వుంటూండేవి. ఆ కార్యక్రమాలలో పాల్గొంటూ వుండే కొద్దిమంది తెలుగు సంగీత కళాకారులలో పేరిందేవిగారు కూడా ఒకరు.

| | |
|---|---|
| రచన | : డా॥బాలాంత్రపు రజనీకాంతరావు |
| గానం, సంగీతం | : శ్రీమతి మహాభాష్యం పేరిందేవి |
| రాగమాలిక | : కాపి, మోహనరాగాలు |
| కాపిరాగం | : పీలు (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : స రి మ ప ని స, |
| అవరోహణ | : స ని ప మ గ రి స |
| తాళం | : త్రిశ్రగతి (కర్ణాటక సం॥) |
| | - దాద్రా (హిందుస్తాని సం॥) |

-షడ్జము, చతుశృతి రిషభం, శుద్ధమధ్యమం, పంచమం, కాకలినిషాదం ఆరోహణలోను, కైశికినిషాదం, పంచమం, శుద్ధ మధ్యమం, సాధారణ గాంధారం, చతుశృతి రిషభం, షడ్జము అవరోహణలోను వుండే స్వరాలు. ఇవేకాక యీ రాగంలో అంతరగాంధారం, శుద్ధ దైవతం, చతుశృతి దైవతం కూడా ఉపయోగించబడతాయి.

| | |
|---|---|
| మోహనరాగం | : భూప్ (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : స రి గ ప ద స అవరోహణ : స ద ప గ రి స |

- షడ్జము, చతుశృతి రిషభం, అంతర గాంధారం, పంచమం, చతుశృతి దైవతం యీ రాగంలోని స్వరాలు.






## శ్రీమతి మహాభాష్యం పేరిందేవి

మచిలీపట్టణం సమీపాన వున్న మద్దిపట్ల అనే కుగ్రామంలో 1922లో కిడాంబి రాఘవాచార్యులు, వెంకటలక్ష్మి గారలకు జన్మించిన శ్రీమతి పేరిందేవి మా అమ్మగారు. 4,5 సంవత్సరాల పసివయసు నుండే ఆమె పాటలు పాడనారంభించారు. ఆమె తల్లిగారి వంశస్థుల నుండి సంక్రమించిన సంగీతకళ ఆ కుటుంబంలో బలంగా వేళ్ళూనుకుంది. చిన్నతనంలోనే తన మేనమామ వరదాచార్యులు గారి వద్ద సంగీతం అభ్యసించారు. ఆయన హార్మోనియం వాయిస్తూ పాడడం అలవాటు గావించారు ఆమెకు. తల్లిగారి వద్ద కూడా ఎన్నో సంప్రదాయ కీర్తనలు, స్తోత్రాలు, పెళ్ళిపాటలు నేర్చుకున్న ఆమెకు, అనతి కాలంలోనే



సంగీతంలో ప్రావీణ్యత చేకూరింది. అనేక వర్ణాలు, కీర్తనలు, జావళీలు పాడుతూ మరో పక్క నాటక రంగంలో ప్రముఖులైన కపిలవాయి, అద్దంకి మొ॥వారి పద్యాలు, పాటలు విని పాడుతుండేవారు. 1930వ దశకంలో గ్రామఫోను కంపెనీలు ప్రారంభమైన తొలి రోజులలో గ్రామఫోను రికార్డులో పాట వినపడటం చాలా వింతగాను, ఆశ్చర్యంగాను వుండేది పల్లెటూళ్ళలో ప్రజలకు. అప్పటి రికార్డులలో బి.ఎస్.రాజయ్యంగార్, కిట్టప్ప, బెంగుళూరు నాగరత్నమ్మ మున్నగువారు పాడిన త్యాగరాజకృతులు, నాటకరంగంలోని ప్రముఖ పద్యాలు, పాటలు చుట్టు పక్కల వారి యిళ్ళలో విని నేర్చుకునేవారు ఆమె. 1936లో వివాహానంతరం ఆమె హైదరాబాదులో స్థిరపడటం, 1938లో తొలి సంతానంగా నేను జన్మించడం జరిగింది. నా తరువాత పుట్టిన మా చెల్లెళ్ళు, తమ్ముళ్ళు అందరము సంగీతంలో

అమ్మకు వారసులము కాగలిగాము. మాది సంగీత కుటుంబం. ఆమెకు మనుమలు, మునిమనుమలు కూడా పాడగలిగినవారు కావడం భగవాదానుగ్రహమే అనాలి. 1948 నుండి అప్పటి 'దక్కన్ రేడియో'గా వుండిన హైదరాబాద్ కేంద్రంలో కర్ణాటక సంగీతము, లలిత సంగీతము పాడుతూండేవారు అమ్మ. నైజాం పరిపాలన కారణంగా ఉర్దూ భాషకే ఎక్కువ ప్రాముఖ్యత వుండేది ఆ కాలంలో. ఆ తరువాత 1955లో ఆడిషన్ టెస్టులో ఉత్తీర్ణురాలై ఆకాశవాణిలో కొన్ని దశాబ్దాల పాటు కార్యక్రమాలలో పాల్గొంటూండేవారు. ప్రణయ, భక్తి, దేశభక్తి గీతాలకు మధురమైన బాణీలు కూర్చి ఆమె పాడడమే కాక ఇతరుల చేత కూడా పాడించేవారు. ప్రసిద్ధ కవులు ఇంద్రగంటి, కృష్ణశాస్త్రి, బాపిరాజు, సి.నా.రె., దాశరథి వంటి వారి పాటలను ఆకాశవాణిలో ఆమె పాడేవారు. 'నాపాటతో జగము నాట్యమాడేనా', 'చక్కని చుక్కల సఖ్యము మరగిన', 'కన్నయ్య జన్మించె విన్నారటే' మొ॥ పాటలు ఆమె స్వరపరచిన వాటిలో మచ్చుకు కొన్ని. ఎన్నో సంగీత రూపకాలకు ఆమె స్వరరచన చేశారు. 1959లో మా నాన్నగారు రంగాచారి గారు రేడియో ఇంజనీరుగా ఢిల్లీ కేంద్రానికి బదిలీ కాగా ఆమె ఢిల్లీ నుండి కూడా ఎన్నో పాటలు పాడేవారు. రాష్ట్రపతి రాధాకృష్ణన్ గారి సమక్షంలో కచేరీ చేశారు. హైదరాబాదులో ఆంధ్రబాలానంద సంఘం, ఆంధ్ర యువతీ మండలిలో ముఖ్య సభ్యురాలుగా సంగీత సేవలందించారు. ఆకాశవాణిలో 'భక్తిరంజని' కార్యక్రమంలో ఆమె పాడిన సంప్రదాయ కీర్తనలు నేటికీ ప్రసారమవుతూనే 'స్తోత్ర రత్నావళి'లను చాలా రాగాలలో స్వరపరచి నొటేషన్‌తో గ్రంథాలుగా ప్రచురించారు. పలు సన్మానాలు, బిరుదులు పొందారు. హృషీకేశ్‌లోని స్వామి శివానంద అమ్మ పాట విని "సంగీత సుధాకర" బిరుదు నొసగి ఆశీర్వదించారు. వయసు పైబడినా, ఆరోగ్యం సహకరించకపోయినా ఓపిక కూడగట్టుకుని శిష్యులకు సంగీతం నేర్పడం, పాడడం ఆమె దినచర్య, యీనాడు కూడా. సంగీతంపై ఆమెకున్న అపారమైన మక్కువ, శ్రద్ధ మా అందరికీ ఎంతో స్ఫూర్తినిస్తుంది. నేటి తరం వారికి యిది ఆదర్శవంతమైనది.

**'హాసం' 16-31 మార్చి 2002 సంచికలో మోహనరాగం ఆధారంగాను, 'హాసం' 16-30 ఏప్రిల్ 2002 సంచికలోను, 16-28 ఫిబ్రవరి 2003 సంచికలోను కాపి, పీలు రాగాల ఆధారంగాను కొన్ని చిత్ర గీతాలను పేర్కొనడం జరిగింది.**

## మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్లు




**విడుదల:బ్లిస్**
**వెల: రూ॥30/-**




**విడుదల:హెచ్.ఎం.వి**
**వెల: రూ॥40/-**




**విడుదల:హెచ్.ఎం.వి**
**వెల: రూ॥40/-**



చదువులావు
సత్యమూర్తి
ఏం కాలేజీయో ఏంటో, ఎవడెళ్తాడూ?
హిస్టరీ బోర్ బోర్... ఎకనామిక్స్ అర్థం కాదు... క్లాస్ బోర్ బోర్
సైన్సు... మేథ్స్... అబ్బ... అర్థంకానివన్నీ చెప్తుంటారు
జయశ్రీ... ఔనౌను జయశ్రీ సంగతే మర్చిపోయాను
అయితే త్వరగా తెమిలి కాలేజీకెళ్ళాలి
అమ్మా — నన్నెందుకు త్వరగా లేపలేదు. ఈవేళ కాలేజీ ఉందిగా

వీరత్వంలోనే కాదు, దాతృత్వం, కళాప్రియత్వంలో గూడా బొబ్బిలి ప్రసిద్ధి చెందిందే!

1757లో బొబ్బిలి యుద్ధం జరిగాక... అల్లకల్లోలమై పోయిన బొబ్బిలి సంస్థానం... 1802లో రాజా రాయుడప్పారావు - రాజా శ్వేతాచలపతి రంగారావు గార్ల... నేతృత్వంలో కొచ్చే వరకూ కుదుట పళ్లేదు...

వీళ్లే బొబ్బిలిలో శ్రీ వేణుగోపాలస్వామి ఆలయ నిర్మాణ సారథులు... ఆ తర్వాత బొబ్బిలి సంస్థానంలో సంగీత - సాహిత్యాలు ఉచ్ఛస్థితికి చేరాయి... ముఖ్యంగా వైణిక సాంప్రదాయానికి ఆద్యులు బొబ్బిలి సంస్థానాధిపతులు....




దాదాపు 300 సంవత్సరాల క్రితం ఒకప్పుడు బొబ్బిలి రాజా వారు మైసూరు వెళ్లడం తటస్థించింది. మైసూర్ రాజా వారి దర్బార్‌లో వీణ కచేరి విన్న బొబ్బిలి రాజా వారు వీణ తయారు చేసే విధానాన్ని తెలుసుకుని... తన సంస్థానంలో పనిచేస్తున్న ఇద్దరు వడ్రంగుల్ని వీణ తయారు చెయ్యడం నేర్చుకోవడం కోసం- మైసూరు పంపించారు. అప్పటి నుంచే బొబ్బిలిలో వీణలు తయారు చెయ్యడం ఆరంభమైంది!

ఒకరోజు ఒక సన్యాసి...తంబుర మీటుకుంటూ...వేణుగోపాలస్వామి ఆలయం అరుగుమీద కూర్చుని పాడుకుంటున్నాడు...

ఈ లోగా వెంకన్న వచ్చి! తంబుర పట్టుకుని పరుగెత్తి పోయాడు మామిడి తోటలోకి!..

పట్టుకెళ్లిన వాడి చెయ్యి ఊరుకుంటుందా?

మెల్లిగా...తమాషాగా వాయించడం మొదలెట్టాడు...

ఎంత చెడ్డా!...జన్మసంస్కారం ఎక్కడికెళ్తుంది!!

తంబుర...శృతిలోనే పలుకుతోంది!..

ఆ శృతికి గొంతు కలిపాడు!!

మామిడి తోట.... పళ్లన్నీ బుగ్గలు నొక్కుకున్నాయ్

చిగుళ్లన్నీ చిత్రంగా చూసాయ్...

కోకిలలు...కిక్కురుమంటే ఒట్టు...

మరి అదేం చిత్రమో...తంబుర మీటుతూ తన్మయుడై కళ్లు మూసుకుని ఏవో లోకాల్లో విహరిస్తున్న వెంకన్న నెత్తిమీద చల్లగా ఓ చెయ్యిపడింది!

కళ్లు తెరిచి చూస్తే 'సన్యాసి' మెత్తగా నవ్వుతూ...

వెంకన్న కళ్లలో భీతి లేదు!!....ఆర్తి తప్ప...

అంతే!!

నాతోరా...అంటూ వెంకన్నని ప్రముఖ సంగీత విద్వాంసుడు.... గుమ్మలూరి వెంకటశాస్త్రి దగ్గరకి తీసుకెళ్లి!!



# వీణాచార్య నందిగానం వెంకన్న

పనస, సంపెంగ చెక్కలతో వీణ చేస్తారు... మైసూరు, తంజావూరు వీణలు అప్పట్లో మూడు ముక్కలు కలిపి తయారు చేసేవారు- కానీ బొబ్బిలి వడ్రంగులు ఏకాండీ ముక్కతోనే (ఒకే చెక్కముక్క) తో వీణ తయారు చేయడంలో సఫలీకృతులయ్యారు..

ఇప్పటికీ భారతదేశంలో బొబ్బిలి వీణకున్న పేరు -మరో ప్రాంతపు వీణలకు లేదు...

ఇదీ బొబ్బిలి వీణ కథ..

ఇక వీణాచార్య-నందిగానం వెంకన్న కమామీషు..

అవ్వడానికి సంగీత కుటుంబమే అయినా వెంకన్నకి వీణ అబ్బలేదు....అబ్బలేదు సరికదా చివరకు...సంగీతం అంటే డోకు...

తెల్లారి లేచిన లగాయితూ సంగీతం వినిపించే కొంపలో ఉన్న వెంకన్నకే.....సంగీతం అంటే విసుగ్గా ఉండేది...

అంచేత తోటి పిల్లల్తో చేరి....పుట్టలమ్మటా...చెట్లమ్మటా తిరుగుతూ తెగ అల్లరి చేసేవాడు!!

అల్లరంటే అంతా ఇంతా కాదు..

మామిడి తోట కెళ్లి...పచ్చికాయల్ని దొంగతనంగా కోసుకుని వేణుగోపాలస్వామి గుడి వెనక్కెళ్లీ...ఉప్పు-కారం అద్దుకు తినడం.

చెరువులోకి దిగి...చేపపిల్లల్ని పట్టి వాటిని దండగుచ్చి అమ్మెయ్యడం...ఉండేలు బద్దతో.... పిచుకల్ని...పిట్టల్ని కొట్టడం...

ఒక విధమైన రాక్షసకృత్యాలు కావు!!

వీడు తంబుర పడితే తుంబురుడు - అన్నాడు సన్యాసి!

అయితే వీణ పట్టించి నారదుణ్ణి చేస్తా అన్నాడు శాస్త్రి!!

అల్లరంతా అణిగిపోయింది!

'అరిద్యానం అంత స్థిమిర మిహర ద్వీప నగరీ' అన్నారు శంకరాచార్యుల వారు సౌందర్యలహరిలో

అవిద్యంతా పోయింది వెంకన్నకి...వీణ తీగలు మీటుతోంటే సంగీతద్వారం తెరుచుకుంటున్న అనుభూతి...రసధారల్ని గ్రోల్తోన్న అనుభూతి...

ఇంతకాలం ఎంతో వృథా చేసుకున్నానే అంటూ గోర్వెచ్చని కన్నీరు కారుస్తూ...అచిర కాలంలోనే...'వీణాపాణి' అయిపోయాడు!!

1893లో విజయనగరం సంస్థానాధీశుల్తో చదరంగం ఆడే వెలదిండి జోగారావు పరిచయమయ్యాడు...ఆయన వెంకన్న వీణాగానానికి ముగ్ధుడయ్యాడు.

వెంటనే రాజావారి దర్శనం...ఆ వెంటనే ఆస్థానంలో కచేరీ ఏర్పాటు చకచక జరిగిపోయాయ్!!

ఆనంద గజపతులు వారు సామాన్యులు కాదు...అవులిస్తే తీగలు లెక్కెట్టేయగల సమర్థులు...తేడా వస్తే డొక్కచించి'డోలు' కట్టించగల తిక్కమనిషీ!! మెప్పించటం అంత ఆషామాషీ కాదు!!

కార్యక్రమం ప్రారంభమైంది!! వేణుగోపాలుణ్ణి మనసులో తల్చుకునీ!... వీణ మీటాడు వెంకన్న...

'నాదార్చన' ఆరంభమయింది!...

నీరసంగా కూర్చున్న ఆనంద గజపతుల వారు... సర్దుకుని నిటారుగా కూర్చోడం...తర్వాత ఆసక్తిగా ముందుకు వంగడం. కాళ్లు లయబద్ధంగా వేయడం...మధ్యమధ్య తన్మయత్వంలో కళ్లు మూసుకోవడం..!

ఒక రోజు కాదు...రెండ్రోజులు కాదు...ఏకంగా ఆరురోజులు... ఆపకుండా వీణాగానం...ఏడో రోజున ముగ్ధుడైపోయిన రాజావారు -ఆరు-నూటపదహార్లు, పచ్చల పతకం...కాశ్మీరు శాలువతో సత్కరించి విజయనగరం ఆస్థాన విద్వాంసుడిగా ప్రకటించారు!!

వెంకన్నకి -వీణలోనూ, గాత్రంలోనూ సమాన ప్రతిభ...అసమాన ప్రతిభ ఉండేది... రెండూ కలిస్తే తేడా తెలియని స్థితి! ఒక్క రాగాన్ని మూడేసి రోజులపాటు పునరుక్తి లేకుండా ప్రస్తారం చెయ్యగల నేర్పు!

వీణ వాయిస్తే సాక్షాత్తూ రుద్రవీణే!!



నాభి స్థానం నించి నాదాన్ని పూరించి పాడ్డం!!

1898 వెంకన్నను కశింకోట జమీందారు ఆస్థాన విద్వాంసుడిగా రమ్మని కబురుచేసారు!! కొన్నాళ్లు అక్కడ...!

కొన్నాళ్లు పీఠాపురం ఆస్థాన విద్వాంసునిగా!!

ఒకరోజు బరంపురంలో ఒక జడ్జిగారింట్లో 'సావేరి' రాగాన్ని...ఆ రోజు ఉషోదయం లగాయితూ మర్నాడు తెల్లవారే వరకూ పాడి - వీణ వాయించి నందుకు ఆ రోజుల్లో 500 రూ.ల ఖరీదు చేసే వజ్రపుటుంగరాన్ని బహుకరించారట!!

ఆరంభంలో అల్లరి చిల్లరిగా ఉన్నా...అనంతరం వీణమీద పట్టు సాధించి... సంస్థానాలన్నింటినీ మంత్ర ముగ్ధులను చేసిన నందిగానం వెంకన్న చరిత్రలో 'వీణాచార్యుడి'గా మిగిలిపోయాడు.

-తనికెళ్ళ భరణి

(డా॥ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు-సంగీతవాఙ్మయం' చదివి, స్పందించి)

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయదలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**
**కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,**
**మోతీనగర్, హైదరాబాదు - 500 018**
**అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.**

# ఘంటసాల క్విజ్

**మొదటి బహుమతి : రూ. 250/-**
**రెండవ బహుమతి : రూ. 200/-**
**మూడవ బహుమతి : రూ. 150/-**
**మరియు ఘంటసాల కలర్ ఫోటో**

క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ
డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ ట్రస్ట్,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



## క్విజ్‌నెం-5

1. ఘంటసాల , భానుమతి కలిసి పాడిన ఆఖరి చిత్రం...?
జ: ..........................
2. అక్కినేనికి ఘంటసాల, పి.బి.శ్రీనివాస్ పాడిన అంజలిపిక్చర్స్ వారి చిత్రం?
జ: ..........................
3. ఘంటసాల రచించి పాడిన మొదటి గీతం?
జ: ..........................
4. ఘంటసాల పాడిన 'అందమే ఆనందం' పాట రచయిత?
జ: ..........................
5. ఘంటసాల స్వరపరిచి, పాడిన 'భలే మంచిరోజు' పాటకు అభినయించిన నటుడు?
జ: ..........................

పంపినవారి పేరు : ______________________

చిరునామా : ______________________

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'ఘంటసాల క్విజ్' అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు 15-7-2003 లోగా చేరాలి**

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**
'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.




"పనికి ఆహార పథకం అంటే ఏమిటో తెలుసా?"

"తెలీదు,ఏమిటది?"

"లంచం!"



"ఏమిటేమిటీ...మీ బద్ధకం వల్లే మీకిన్ని సినిమాల్లో హీరోయిన్‌గా ఛాన్సులొచ్చాయా, ఎలా?" అడిగాడు విలేఖరి విస్తుపోతూ.

"అవునండి...నాకు బట్టలు ధరించడమంటే చాలా బద్ధకమండి!" అంది హీరోయిన్



"ఏవండి...ఇలా భర్తకి సేవలు చేస్తున్న పుణ్యస్త్రీలు బహు కొద్దిమందే వుంటారు కదండీ!" పేపర్ చూస్తున్న భర్తకి టీ కప్పుని అందిస్తూ అడిగిందో భార్య.

"అసలెంతమంది వుంటారని నీ అంచనా!" అడిగాడు భర్తగారు పేపర్లోంచి తలెత్తి

"లెఖ్ఖలెందుకులెండి!"

"అందులోంచి ఒకదాన్ని తగ్గించుకో...టీ ఇవ్వడం పతిసేవలోకి రాదులే!" అంటూ మళ్లీ పేపర్లోకి మునిగిపోతూ చెప్పాడా భర్త!



ఈ జోకులను పంపించిన వారు ఎల్.ఎన్.మూర్తి, కాకినాడ



"ఏమయ్యా మీ పేరన్నెవరో ఆస్తి రాసిస్తాడని ప్రతిరోజూ వాళ్లింటికెళ్లి వాళ్ల కుక్కకి బిస్కెట్లు వేసేవాడివి...వ్రాశాడా?"

"ఆ... కుక్కని రాసాడు?"



"సర్వర్! ఒక దోశ, నాలుగు చపాతీలు, ఓ బాదంహల్వా, ఓ బాదంపాలు, నాలుగుకేకులు తీసుకురా"

"ఆ చేత్తోనో ఐస్‌క్రీం కూడా తెమ్మంటారా?"

"అమ్మో వద్దు లావయిపోతాను అనవసరంగా"

"ఏమోయ్ రవీ మొన్న మీ నాన్నగారు పోయారటగా?"

"అవునండీ...పాము కరిచి...."

"ఎక్కడ కరిచింది?"

"సరిగ్గా కుడికంటి కిందండీ"

"పోనీలే...కన్నుమీద కాటేసుంటే అనవసరంగా గుడ్డి బతుకు బతకాల్సొచ్చేది"





"ఎడిసన్ బల్బు కనిపెట్టకపోయుంటే మనకి చాలా కష్టమయ్యేది ఒదినా"

"అవునా...!?, ఎంచేతంటావ్?"

"ఎంచేతేంటి....ఆయనేగనక బల్బుని కనిపెట్టక పోయుంటే మనం టీ.వి.ని కొవ్వొత్తి పెట్టుకుని చూడాల్సి వచ్చేది తెల్సా?"



"పెళ్లి అయిన తర్వాత మీరు ఇదివరకటిలా నన్ను ప్రేమించట్లేదు."

"పెళ్లి అయిన వాళ్లని ప్రేమించటం మా ఇంటా-వంటా లేదు"



ఇల్లు ఇంత చక్కగా సర్దినందుకు మీ ఆవిడని అభినందించాలోయ్..ఏది ఒక్కసారిపిలువ్"

"దాని మొహం... సర్దింది నేనే"

"అయితే నీ చేత ఇంత చక్కగా సర్దించినందుకైనా ఆవిణ్ణి అభినందించి తీరాలి పిలుపిలుపిలు"

రోగి : "డాక్టరు గారూ ఈ ఆపరేషన్ తర్వాత ఇంకేమైనా చేయాల్సింది ఉందంటారా?"

డాక్టర్ :"బహుశా ఉండొచ్చు"

పేషంట్: "ఏంటది?"

డాక్టర్: "పోస్ట్ మార్టమ్"



ఈ జోకులను పంపించిన వారు బి.అరుణ, మంగళగిరి

## హ్యూమర్ బాక్స్

చలేసి దుప్పటి కప్పుకోడానికి అవస్థపడుతున్న భర్తతో
"ఏవండీ...నేను 'కప్ప'నా?"
"కాదు, మనిషివే."



ఇంటర్వ్యూలో సెలెక్ట్ అయినట్లు వచ్చిన ఈ -మెయిల్ చూసి ప్రసాద్ ఇలా రిప్లై ఇచ్చాడు.
"మీరు చేసిన ఈ-మేలు మర్చిపోలేను.





"ప్రొద్దున్నే ఏడవకుండా లేచే పిల్లలు బుద్ధిమంతులు"
"ముందు నువ్వు ఆరింటికి లేచి చూడు మమ్మీ...ఆ తర్వాత ఏడవకుండా మమ్మల్ని లేపుదువుగాని"

"మీరు లలిత సంగీతం వినరెందుకు?"
"మా ఆవిడ చాలాఘోరంగా పాడుతుంది"
"దానికి దీనికి సంబంధం ఏమిటి?"
"మా ఆవిడ పేరు లలిత"



ఈ జోకులను పంపించిన వారు చాగంటి శంభుప్రసాద్, ముంబాయి



"మహామంత్రీ పొరుగుదేశంపై యుద్ధం ప్రకటించాం. వెంటనే తూర్పు వైపు ఏనుగులను పంపండి. ఉత్తరం వైపు గుర్రాలను పంపండి పడమర వైపు సైన్యాన్ని పంపండి"
"మరి దక్షిణం వైపు ఏం పంపమంటారు ప్రభు!?"
"ఆ దిక్కు ఖాళీగా ఉంచండి - ఎందుకంటే అట్నుంచి మన సైన్యం శవాలు రావాలి కదా!"

ఓ కవిగార్ని ఘోరంగా విమర్శిస్తూ అప్పారావు ఉత్తరం రాశాడు.
వెంటనే కవిగారు రెండు పేజీల ఉత్తరంతో బదులిచ్చారు.
ఈ సారి మూడు అరఠావుల ఉత్తరం రాశాడు అప్పారావు.
వారం తర్వాత ఆ కవిగారి నుండి పోస్టల్‌వ్యాన్‌లో ఒక పెద్ద బండిల్ వచ్చింది. దాని మీద ఇలా రాసి ఉంది.
"వద్దు -నాతో పెట్టుకోకు"




ఈ జోకులను పంపించిన వారు ఐ.యు.మణి, గుమ్మలక్ష్మీపురం



"రాత్రైనా దీపం పెట్టలేదేం"
"నా భార్య చదువుకుందిలే!"
"అయితే"
"ఇల్లాలి చదువు ఇంటికి వెలుగని గవర్నమెంట్ వారు చెప్పారుగా!"



"లాండ్రీ ఓనరు కూతురికి లవ్ లెటర్ ఇచ్చావే ఏమైంది?"
"ఉతికేసారు"



"పూర్వం హాస్య నాటికలు తెగ వ్రాసేవారు... ఇటీవల అస్సలు రాయటం లేదేంటి?"
"ఈ మధ్య నాకు పెళ్లైందిలెండి"

పై జోక్‌లను పంపినవారు ఎం.శిరీష చిత్తూరు.

# డైలీ సీరియల్

- తమిరశ జానకి

"లక్షలు లక్షలు డబ్బుంది నాకు. ఉన్న ఇద్దరు కొడుకులూ వాళ్ళ వాళ్ల భార్యా పిల్లల్తో అమెరికాలో ఉన్నారు.... ఉన్న ఊళ్ళో ఈ లంకంత కొంపలో లింగూ లిటుకూమంటూ మిగిలింది నేనూ మా ఆవిడే కాదా! నేనా.... ఇంక బతికినన్నాళ్ళూ ఇంక బతకను. మహాఅయితే ఇంకో ముప్ఫయేళ్ళో నలభై ఏళ్ళో.... అంతే కదా? బతికేది నేను.... ఓర్నీ! ఆశ చాలా తక్కువే పాపం. ఇప్పుడరవై అయిదేళ్ళ వయసు. ఇంకో ముప్ఫయ్యేళ్ళో నలభై ఏళ్ళో ఆయుర్దాయంట, అది కూడా తక్కువే అన్నట్టు.... అంత కదాట?....."

అచ్చం మొగసూర్యకాంతంలా ముట ముటలాడిపోతూ గడగడ గొణుక్కున్నాడు కొదండ రామయ్య.

"ఆ....ఏంటంటావ్? ..." కన్నుమన్నాడు వీరభద్రయ్య మొగఛాయాదేవిలా కళ్ళూ మూతీ తిప్పుతూ.

"అబ్బే! నేనేవన్నానూ?"

ఇద్దరూ పుట్టినప్పటినించీ ఆ ఊళ్ళో ఒకే వీధిలో ఇరుగుపొరుగున మర్రిచెట్టు ఊడల్లా పాతుకుపోయిన పరమవీర భయంకర మిత్రులు. సొంత ఊళ్ళో... సొంత ఇళ్ళల్లో ఉంటూ ఎవరి పొలాలు వాళ్ళు సేద్యం చేయించుకుంటూ ఎవరి సొంత కాలుమీద వాళ్ళ సొంతకాలేసుకుని దర్జాగా బతికేస్తున్నారు. కాలంతోపాటూ వొచ్చే మార్పులు వాళ్ళ ఇళ్ళల్లోనూ కనపడతాయి. పాత ఇళ్ళని పాత ఇళ్ళల్లాగే ఉంచుకోకుండా మార్పులు చేర్పులు చేసి కొత్తకొత్తగా కట్టుకున్నారు. నున్నగా జారే ఫ్లోరింగులూ, డైనింగ్ టేబిల్‌సెట్లూ, ఫ్రిజ్‌లూ, వాషింగ్ మెషిన్లూ ఇంకా అవీ ఇవీ ఎన్నో కాకుండా... మోకాళ్ళ నెప్పులు తగలడ్డాక ముక్కడానికి బెడ్‌రూమ్‌కి ఎటాచ్డ్‌గా అబ్రహాం లింకన్లా కూచునేవీ కట్టించేసుకున్నారు.

"ఇంతకీ అసలు సంగతేంటంటే... నేను బతికినన్నాళ్ళూ వొచ్చేలా ఓ డైలీ సీరియల్‌కి ప్రొడ్యూసర్ని అవుదావనుకుంటున్నా..." మననులో ఆలోచన బయటపెట్టాడు వీరభద్రయ్య.

"అంటే... అంటే.. డైలీ సీరియల్ తీస్తావా?"

"తీయిస్తాను ఓ డైరెక్టర్ని పెట్టి".

"ఈ చిన్న ఊళ్ళో కూచుని పొలాలు పంటలూ చూసుకోడం తప్ప నాటకాలు తియ్యడాలూ సినిమాలు తియ్యడాలూలాంటివి మనకేం తెల్సూ?"

"అదంతా డైరెక్టరే చూసుకుంటాడుగా! డబ్బుంది నా దగ్గర, ఎంత ఖర్చయినా బ్యాక్‌పుట్ వెయ్యను"

నీ ఇంగ్లీషు దొంగలెత్తుకెళ్ళా....



"అదిగో! మళ్ళీ ఏదో సణుగుతున్నావు..."

"నీముందు సణిగి నేను సాధించేదేవుంది చెప్పు"

"చెప్పూలేదు బూటూలేదుగానీ... నేనూ నువ్వూ బతికున్నన్నాళ్ళూ గేరంటీగా డైలీ నీ ఇంటో నువ్వూ, నా ఇంటో నేనూ సీరియల్ చూసుకోవచ్చు"

"అయితే మంచి డైరెక్టర్ని వెతుక్కుంటా వన్నమాట"

"ఎతుక్కునేదేవుంది నీ పిచ్చిగానీ..... మనూళ్ళో జీళ్ళుచేసే ఎగస్పర్టు చిట్టిబాబు లేడూ?"

"ఉన్నాడనే అనుకుంటున్నాను... పోయాడా ఏవిటి కొంపతీసి? వాడిచేతి జీళ్ళు తినేయోగం లేదా మనకింక?"

"శుభవార్త చెప్తుంటే నా డైరెక్టర్ని చంపుతావేంటి? పి.పి.లా అడ్డుపడకు"

"సరే సరే... పి.పి. అంటే ఏవిటో?"

"పానకంలో పుడక అని... జీళ్లపాకం అంతబాగా సాగదియ్యగల్గిన చిట్టిబాబు డైలీ సీరియల్ సాగదియ్యలేడా?"

"అదీ పాయింటే... అయితే మనూరి చిట్టిబాబు బతుకుపండినట్టే. ఆంధ్రరాష్ట్రంలో ఓ వెలుగు వెలిగిపోతాడు."

"ఆంధ్రరాష్ట్రం ఒక్కటే ఏం ఖర్మ... కొద్దిరోజులు పోగానే దాన్ని హిందీలోనూ, అరవంలోనూ కూడా మొదలెట్టించేయ్యనూ చిట్టిబాబుచేత!"

"మరి వాడికా భాషలు తెలియదు కదా?"

"నువ్వు మరీనూ? ఆ భాషల్లో వాడువండితుడై పోవాలా ఏంటి? మధ్యాన్నవప్పుడు రేడియోలో హిందీ పాటలు పెడుతూనే ఉంటాడుగా వాడికొట్లో"

"ఔను..."

"మరింకనేం? అరవం సంగతంటావా? గట్టిగా అరుస్తూ డైరెక్షన్ చేసేస్తే చచ్చినట్టు అర్థమైపోతుందాళ్ళకి. అరవం అరవం అంటూనే అరుస్తారు కదా మరాళ్ళు..."

బట్టతల తడువుకుంటూ తలూపాడు కోదండరామయ్య.



ఇంటికెళ్ళగానే భార్యకి చెప్పాడీ వార్త. చేటంత మొహం చేనుకుని... కళ్ళు విప్పార్చుకుని... కప్పుకుని ఉన్న పవిట చెంగు తీసి వెనక్కి విసిరేసి హొయలు ఒలక బోస్తూ ఓరగా చూసింది, "నా వంట పండింది"అంది.

"వీరభద్రయ్య టి.వి. సీరియల్ తీస్తానంటే మధ్యన నీ పంట పండటవేవిటే?"

తల ఓ పక్కకి వొంచుకుని... సోఫాచేతిమీద కుడిచేతి చూపుడు వేలితో రాస్తూ ముద్దు ముద్దుగా అంది అనసూయమ్మ "నాకు ఓ రోలిమ్మని అడుగుతాను."

"ఆ.. ఆ.... ఇస్తాడిస్తాడు రుబ్బురోలు..."

"అదేమరి... అందుకే అంటాను... ఏ విషయంలోనూ నాకు రిపోర్టు ఇవ్వకపోగా సణుగుతారు..."

"రిపోర్టు కాదే బాబూ సపోర్టు. ఈ మాట వాడాల్సినచోట ఆ మాటా, ఆ మాటా వాడాల్సిన చోట ఈ మాటా వాడుతూ ఎప్పుడూ కన్ఫ్యూజ్ అయిపోతావుకదే..."

"మిమ్మల్ని చేసుకున్న రోజే మొదలైంది లేండి ఆ కర్ఫ్యూ ఏదో నా బతుకులో"

"కర్ఫ్యూ కాదే బాబూ!"

"ఏదో ఓటిలెండి... అసలు ప్రతిమొగాడి విజయం వెనకాల ఓ ఆడది ఉంటుం దంటారు... మరటాంటప్పుడు ఆడదానికి రిపోర్టుగా మొగాడుండొద్దా?"

"నీకు నేనేం సపోర్టు ఇవ్వగలనే? నీ వెయిట్ ఎనభై అయిదు కిలోలు నా వెయిట్ నలభై అయిదు కిలోలు...."

"చాల్లెండి.... ఎప్పుడు చూసినా నన్ను దిష్టి కొట్టటవే మీ పని"

ఫోన్ రింగవడంతో మరింకేమీ మాట్లాడకుండా ఫోనందుకున్నాడు కోదండరామయ్య.

"ఆ.... నువ్వా అమ్మాయ్ పార్వతీ!..." ఇంకా ఆయన వాక్యం పూర్తి కానేలేదు. చటుక్కున వొచ్చి లటుక్కున ఆయన చేతిలోంచి రిసీవర్ లాక్కుంది అనసూయమ్మ.

"ఇదుగో... మరే... అమ్మాయ్.... నేను నాల్రోజుల్లో బయల్దేరి మీ హైద్రాబాద్ వొచ్చి మీ ఇంట్లో కొన్నాళ్ళుండిపోతానే..."

కంగారు పడిపోతూ అట్నించి పార్వతి అరిచి నంతపనిచేసింది.

"ఏవిటే అమ్మా... మళ్ళీ నాన్నగారితో దెబ్బలాడావా? ఇలా అస్తమానం దెబ్బలాడు కుంటూ ఎన్నాళ్ళు కాపురం చేస్తావే? ఏకంగా విడాకులిచ్చేసి వొచ్చేయ్యవే. అప్పుడింక మాటిమాటికీ నిన్ను రిసీవ్ చేసుకోడానికి, మళ్ళీ తిరుగుప్రయాణం అప్పుడు రైలెక్కించడానికి స్టేషన్‌కి రావక్కర్లేదు నేను. అసలే పెట్రోల్ ధర మళ్ళీ పెరిగింది. ఆటోవాళ్ళకి పోసేడబ్బుల్తో మేడలు కట్టచ్చని వినుక్కుంటారు మీ అల్లుడుగారు"

"ఓసినీ అసాధ్యపుమాటలూ నువ్వూనూ... నీ ఇంటికొస్తానన్నందుకు నా నలభై అయిదేళ్ళ కాపురంలో చిచ్చుపెడతావుటే? ఇంతకీ నేను చెప్పేది వింటావా అసలు? వీరభద్రం మావయ్య డైలీసీరియల్ తీస్తున్నారు..."

"నిజవా?" పార్వతిగొంతులో సంబరం.

"యాక్టర్లు ఎవరెవరు?"

"ఏవండీ... యాక్టర్లెవరని అడుగుతోందండీ అమ్మాయి...."

లబలలబలాడుతూ నెత్తికొట్టుకున్నాడు కోదండరామయ్య.

"చెప్పట్లేదే అమ్మాయ్! మీనాన్నకన్నీ రహస్యాలేగా? ఈ నలభై అయిదేళ్ళ కాపరంలో ఏవన్నా చెప్పారు గనకనా? దాపుడుమనిషి. పొట్టకోసి చూస్తే.... ఇన్నేళ్ళుగా నాతో చెప్పకుండా ఆయన దాచుకున్న రహస్యాలెన్నో పుచ్చిపోయి ఉంటాయి ఆ పొట్టనిండా. అందుకోసవేగా రోజూ వాముూ ఉప్పూ నవలడాలూ... సొంఠి పొడి కారప్పొడీ..."

"అమ్మా! ఫోను బిల్లు పెరిగిపోతోందే నీ సొంఠిపొడీ కారప్పొడుల్తో అసలు నేనెందుకు ఫోన్ చేశానో మర్చిపోయేలా చేశావు..."

"పోన్లే... నువ్వెందుకు చేశావో ఏమోగానీ నేను చెప్పేది విను. వీరభద్రం మావయ్య డైలీసీరియల్



హైద్రాబాద్‌లోనే తియ్యాలికదా అందుకని నేను నాల్రోజుల్లో బయల్దేరి మీ ఇంటికొస్తానన్నాను."

"ఆయన సీరియల్ తీస్తే నువ్వెందుకూ బయల్దేరడం? నాకర్థంకాలా?"

"మరీ చోద్యంగా మాట్లాడుతున్నావు కదే! రోజూ వెళ్ళి షూటింగ్ చూడద్దూ? షూటింగ్ చూడాలని ఎప్పటినించో కోరిక నాకు"

రోజూ ఇంట్లో స్వయంగా ఫైరింగ్ చూస్తుంటావు కదే... షూటింగ్ కొత్తేవిటి నాకు?... వెనకనించి మొగసూర్యకాంతం మూలిగింది.

"పైగా... సీరియల్ తీసేది మనవాళ్ళే కాబట్టి... నటించాలని ఎప్పటినించో నాకున్న కోరిక తీరేమార్గం ఇదే అనుకుంటున్నాను. అడిగితే నాకేదన్నా రోలివ్వకపోతారా?"

"రుబ్బురోలు కూడా ఇవ్వలేరు. మిక్సీలొచ్చేశాయమ్మా"

"చాల్లే! నువ్వూ మీ నాన్నలాగే మాటాడుతున్నావు" టక్కున ఫోన్ పెట్టేసి లోపలికెళ్ళి పోయింది అనసూయమ్మ.

"అసలదెందుకు ఫోన్‌చేసిందో చెప్పనిచ్చావు కాదు. నీ గొడవే నీది కానీ" కోదండ రామయ్య మాటలు గాల్లో కల్సిపోయాయి.

*****

వీరభద్రయ్య కబురు చెయ్యగానే కాకిలావొచ్చి వాలాడు చిట్టిబాబు.

"ఏరా వొచ్చావా?"

"ఆయ్!"

"కూచో"

"ఆయ్! వొద్దులెండయ్యా" చేతులు కట్టుకున్నాడు.

"అరే! కూచోమంటే!"

ఆ అరుపుకి టక్కున నిల్చున్నచోటే కూలబడ్డాడు.

"అక్కడకాదురా! ఇక్కడ కూచో" కుర్చీ చూపించాడు.

"వొద్దులెండయ్యా"

"ఎర్రిబాగులోడివి. నీ గొప్పతనం నీకు తెలీదు. సరేగానీ... సినిమాలు చూస్తుంటావా?"

"ఆయ్!"

"టి.వి. చూస్తుంటావా?"

"ఎప్పుడైనానండీ...."

"జీళ్ళు చెయ్యడంలో నువ్వు ఎగస్పర్టువి కదా! జీళ్లపాకం నీకు బాగాతెల్సు. అందుకని నీ చేత.. ఓ డైలీ సీరియల్ నే బతికున్నన్నాళ్ళూ... వొచ్చేలా తీయిద్దామనుకుంటున్నాను"

"మీరింకెన్నాళ్ళు బతుకుతార్లెండి. మునలాళ్ళయిపోలా?" చిట్టిబాబు కళ్ళు ఆశ్చర్యంగా చూస్తూ మూగగా అడిగాయి.

నోరుమాత్రం. "అయ్యబాబో నాకాడంత డబ్బెక్కడుంది?" అంటూ దీర్ఘం తీసింది.

"నువ్వూరికే కంగార్పైపోకు. డబ్బు నాది, సాగుడు పాకం నీది. సరేనా?"

"అయితే రేపట్నించీ జీళ్ళ కొట్లో ఎవుర్ని కూచోపెట్టాలో?" ఆలోచిస్తున్నట్టుగా బుర్ర గోక్కున్నాడు.

"నన్ను కూచోపెట్టు" చివ్వున లేచాడు వీరభద్రయ్య.

"లేకపోతే ఏంటంట? ఇంక ఆ జీళ్ళ కొట్టు మూసెయ్యవా డైలీ సీరియల్ తీస్తున్నపుడు."

"ఔనయ్యా! తప్పయిపోయింది.... మరి... మరి... సీరియల్‌కి కద కావాలి కదయ్యా! మీరు సెప్తారా కద?"

"కథకూడా నేచెప్పాలా? ఇంక నువ్వు తీసేదేంటి? తెల్లారిలేచిందగ్గర్నుంచీ పడుకునేదాకా ఇరుగమ్మకీ పొరుగమ్మకీ ఊరూవాడా కహానీలు చెప్తాఉంటుందిగా మీయావిడ. ఓ కహానీ నువ్వూ చెప్పించుకో."

"ఆయ్! సిత్తం.... మరయ్యా... మరి.. మా సిన్నమ్మాయి సినేమా పాటలకి టెప్పులేసి బాగా ఆడుతుందయ్యా.... దాన్ని హీరోయిన్‌గా పెడదావయ్యా!"

"ఎన్నేళ్ళుదానికి?"




"పన్నెండేనయ్యా..."

మరీ చిన్నపిల్ల కదా! వొద్దులే.... ఎవరినన్నా కొత్తోళ్ళని బొంబాయి నించి తీసుకొద్దాం".

"అమ్మో! బొంబాయి పేరు సెప్తే బాంబులు కనపడతాయ్! అడికి పోయే దమ్ములు నాకులేవయ్యా"

"నువ్వు పోనక్కర్లేదు. నేనే పోయి ఏ పిల్లనైనా బొంబాయి నించి తీసుకొస్తా"

సరిగ్గా అప్పుడే చేతిలో గరిటతో రంగప్రవేశం చేసింది సావిత్రమ్మ.

"సిగ్గులేకపోతేసరి..."

భార్యమాటలకి తెల్లబోయి చూశాడు వీరభద్రయ్య.

"ఇన్నేళ్ళొచ్చి... బొంబాయెళ్ళి పిల్లని తెచ్చుకుంటారా పిల్లని... అవ్వ... ఈ వయసులో..."

"నీకేవీ తెలియదూరుకో... అనుమానప్పక్షీ... నువ్వు లోపలికెళ్ళు..."

"అదిగో... పెళ్ళయినప్పట్నించీ ఇలా అంటూనే.. నన్ను వంటింట్లోకి నెట్టేసి... నా వెనకెన్ని గ్రంథాలు నడిపారోఏమో!"

"అంత భాగ్యంకూడానా ఈ బతుక్కి... పనిమనిషొచ్చి పన్చేసి వెళ్ళేదాకా నా కళ్ళజోడు నా మొహాన్ని పెట్టవు కదా? నేను అగ్గినిప్పునంటే నమ్మవు. పొలానికెళ్ళినప్పుడల్లా ఎవడో ఓ బొట్టికాయిని నాకూడా పంపుతావు."

ఫోన్ మోగడంతో వంటింట్లో కెళ్ళిపోయింది సావిత్రమ్మ స్టవ్‌మీద పెట్టిన కూరగుర్తొచ్చి.

"నాన్నా! బావున్నారా?" ఫోన్లో అట్నుంచి కొడుకుగొంతు విని-

"బావున్నాం" అంటూ జవాబిచ్చి పక్కకి తిరిగి చిట్టిబాబువైపు చూశాడు వీరభద్రయ్య. "మా పెద్దబ్బాయి.. అమెరికానించి...."

అమెరికా అయితే నాకేవిటి అమలాపురం అయితే నాకేవిటి అన్నట్టుగా చూశాడు చిట్టిబాబు నిర్వికారంగా.

"ఆ....ఆ... ఏవిటేవిటి... పర్మనెంటుగా ఇండియా కొచ్చేస్తున్నారా? ఇంక అమెరికా వెళ్ళరా? ఎందుకూ?... మీ ఇద్దరి ఉద్యోగాలూ ఊడిపోయి ఆర్నెల్లయిందా? మళ్ళీ ఇంకో ఉద్యోగం నీకూ దొరకలేదు తమ్ముడికీ దొరకలేదా? అక్కడా ఉద్యోగాలకి కష్టంగానే ఉందంటావా? సరే సరే! వొచ్చెయ్యండి... తప్పుతుందా? ఆ.... ఏంటి? ఆస్తిపంపకాలు చెయ్యాలా?"

ఫోన్ పెట్టేసి నీరసంగా సోఫాలో వెనక్కివాలాడు వీరభద్రయ్య.

ఎదురుగా చిట్టిబాబు.

"ఏంటి చిట్టిబాబూ? ఏంటిలా వొచ్చావ్!"

"ఆయ్! మీరేకదయ్యా డైలీ సీరియల్..." నసిగాడు.

"ఇంకేం డైలీ సీరియలూ? సుపుత్రా కొంప పీకరా అనీ... కొడుకులిద్దరూ కొంపమీద కొస్తున్నారు... మా ఇల్లే ఓ డైలీ సీరియల్ అవుతుందింక... ఇంటికెళ్ళి నీపన్చూసుకో..."

వీరభద్రయ్య కళ్ళముందు రియల్ సీరియలే కనపడుతోంది.

అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల

## మూలాలు - మూల్యాలు

మనలో చాలా మందికి ఏదో వినికిడి జ్ఞానమే కానీ చదివి సంపాదించిన ప్రత్యక్ష జ్ఞానం గానీ, గురు ముఖతః అభ్యసించి నిగ్గు తేల్చుకున్న జ్ఞానం గానీ ఉండదు. దీనికి కారణం మన అశ్రద్ధ లేదా నిర్లక్ష్యం. కొద్దిమందికి తెలుసుకోవాలని, నేర్చుకోవాలని వుంటుంది కానీ సరిగ్గా చెప్పేవాళ్లు దొరకరు. మరికొంత మందికి చెప్పేవాళ్లు దొరికినా నేర్చుకోటానికి తీరిక దొరకదు. ఏది ఏమైనా మిడిమిడి జ్ఞానంతోనే లోకవ్యవహారం మాత్రం నడిచిపోతూ వుంటుంది.

లోక వ్యవహారంలో ప్రసిద్ధికెక్కిన "ధర్మో రక్షతి రక్షితః", "సత్యమేవ జయతే", "ధన మూల మిదం జగత్" వంటి రత్నాల్లాంటి సంస్కృత వాక్యాలు ఎక్కడివో, వాటి అర్థాలేమిటో, వాటి పూర్తి పాఠాలేమిటో చాలా మందికి తెలియదు. తెలియకుండానే తెలిసున్న వాక్యాలతో పబ్బం గడిపేసుకుంటూ వుంటారు. ఇటువంటి వాక్యాలు తీసుకువచ్చి వాటిని గూర్చి కొంతమంది జిజ్ఞాసువులు నన్నడిగారు. అటువంటి వారికోసం ఈ వ్యాసాన్ని నిర్దేశిస్తూ, కొన్ని శ్లోకాల్ని పరిచయం చేస్తాను.




"ధర్మో రక్షతి రక్షితః"- 'మనుస్మృతి' అనే ధర్మశాస్త్ర శ్లోకపాదం.

ధర్మ ఏవ హతో హంతి- ధర్మో రక్షతి రక్షితః
తస్మా ధర్మోన హంతవ్యో - మానో ధర్మోహతో౽వధీత్!!

మనం ధర్మాన్ని ధ్వంసం చేస్తే అది మనల్ని ధ్వంసం చేస్తుంది; రక్షిస్తే రక్షిస్తుంది. కాబట్టి, ధర్మాన్ని నాశనం చేయకూడదు. ఎవరికి వారు తమకు తామే నశించాలని కోరుకోరుగదా! అని దీని భావం.

"సత్యమేవ జయతే" అనే వాక్యం ముండకోపనిషత్తు లోని ఒక మంత్రానికి సంబంధించింది.

సత్యమేవ జయతే నా౽నృతం
సత్యేన పంథా వితతో దేవయానః
యే నా౽క్రమం తృషయో హ్యాప్తకామా
యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్!!

సత్యమే జయిస్తుంది. అసత్యం కాదు. సత్యం వల్లనే దేవతల మార్గం విస్తరించి వుంది. సత్యం వల్లనే మహర్షులు ఆప్తకాములై పరమేశ్వరుని పొందుతున్నారు. ఈశ్వరుడు సత్యస్వరూపుడు- అని యీ మంత్రార్థం.

ఇలాగే అహింసను గూర్చి:-

అహింసా పరమో ధర్మః - తథా౽హింసా పరం తపః
అహింసా పరమం జ్ఞానం - అహింసా పరమార్జనం!!

అంటే- అహింసయే పరమ ధర్మం, తపస్సు, జ్ఞానం, ఋజుత్వం అని భావం. ఋజుత్వమంటే నిజాయితీ అని అర్థం. మనిషిలో నిజాయితీ వుంటే లోకంలో హింసా ప్రవృత్తి వుండదని యీ శ్లోకం బోధిస్తూ వుంది.

"ధన మూల మిదం జగత్" అని అందరూ అంటూ వుంటారు. అది వాల్మీకి రామాయణం లో శ్రీరామునితో లక్ష్మణుడు అనిన మాట.

**ధనమార్జయ కాకుత్స - ధన మూల మిదం జగత్**

**అంతరం నాభి జానామి - నిర్ధనస్య మృతస్య చ!!**

ఓ కాకుత్థ్స వంశ తిలకా! రామా! ఈ లోకానికి ధనమే ప్రధానం కాబట్టి ధనాన్ని బాగా సంపాదించు! డబ్బులేని వాడు చచ్చిన వానితో సమానం. వీరిద్దరికి తేడా లేదని శ్లోక భావం. లక్ష్మణుడీ మాటను లంకలో రావణ మరణానంతరం అన్నాడు. దానికి శ్రీరాముడు చాలా గంభీరంగా యుగయుగాలకు సరిపడా-

**అపి స్వర్ణమయి లంకా - న మే రోచతి లక్ష్మణ**

**జననీ జన్మభూమిశ్చ - స్వర్గాదపి గరీయసీ!!**

అని సమాధానం చెప్పాడు. ఆ ప్రబోధం మానవ శిరోరత్నం కదా! 'లక్ష్మణా! లంక బంగారమే కావచ్చు కానీ నాకు యిష్టం లేదు. జనని, జన్మభూమి స్వర్గం కంటె గొప్పవి సుమా!' అని యీ శ్లోకభావం.

చాలామంది "కృషితో నాస్తి దుర్భిక్షం" అంటారు. "కృషి ఉంటే మనుషులు ఋషులవుతారు, మహాపురుషులవుతారు" అని కూడా పాడుకుంటూ వుంటారు. కృషి అంటే సేద్యం. కృషీవలుడంటే రైతు. కృషి చేయటమంటే కష్టపడి పనిచేయటమనే అర్థం కూడా వ్యవహారంలో వుంది. ఇంతకీ ఆ శ్లోకమిది:-

**కృషితో నాస్తి దుర్భిక్షం - జపతో నాస్తి పాతకం**

**మౌనేన కలహో నాస్తి - నాస్తి జాగరతో భయం!!**

అంటే- కృషి వల్ల కరువుకాటకం, జపం వల్ల పాపం, మౌనంగా వుండటం వల్ల కలహం, మెలకువగా వుండటం వల్ల భయం ఉండవని

రాజుని బట్టి ప్రజలని చెప్పటానికి చాలామంది "యథా రాజా తథా ప్రజా:" అని వాడుతూ వుంటారు. ఈ వాక్యం భోజ చరిత్ర మనే కావ్యంలోని ఒక శ్లోక పాదం. ఆ శ్లోకం చూడండి:-

**రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠాః - పాపే పాప పరాః సదా**

**రాజాన మనువర్తంతే - యథా రాజా తథా ప్రజాః!!**

రాజు ధర్మపరుడైతే ధర్మాన్ని, పాపాత్ముడైతే పాపాన్ని ప్రజలు అనుసరిస్తారు. రాజు ఎలావుంటే ప్రజలు అలా వుంటారు. ఇప్పుడైతే రాజు స్థానంలో మనం నాయకుల్ని, మంత్రుల్ని, అధికారుల్ని, గురువుల్ని, ప్రభుత్వాల్ని - ఊహించుకో వలసి వుంది. ఎప్పుడైనా సరే, ఎక్కడైనా సరే దోషాన్ని పెద్దవాళ్ల దగ్గర నుండి చిన్నవాళ్ళు గ్రహిస్తారే కానీ చిన్నవాళ్ల నుండి పెద్దలు నేర్చుకోరు. కాబట్టి, పెద్దలే బుద్ధి కలిగి వుండాలని యీ శ్లోకం హెచ్చరిస్తూ వుంది.

మగాడి జీవిత విజయం మూడిటి మీద ప్రధానంగా ఆధారపడి వుంది. పుస్తకం, వనిత, విత్తం. అంటే చదువు, సంపద, ఆడది. ఈ మూడు చేయిజారి పరాయివై పోతే ఆ బ్రతుక్కి రాణింపు వుండదు. చూడండి:-

**పుస్తకం వనితా విత్తం పరహస్తం గతం గతం**

**అథవా పునరాయాతి - జీర్ణం భ్రష్టాచ ఖండశః!!**

పుస్తకం, వనిత, విత్తం- ఇతరుల చేతుల్లో పడితే తిరిగిరావు. ఒక వేళ వస్తే పుస్తకం చిరిగిపోయి వస్తుంది. వనిత భ్రష్టురాలై వస్తుంది. విత్తం (డబ్బు) మొత్తంగా కాకుండా కొద్ది కొద్దిగా వస్తుంది కాబట్టి యీ మూడిటి విషయంలో చాలా జాగ్రత్తగా వుండాలని శ్లోకం హెచ్చరిస్తూ వుంది.

పండితుడంటే ఎవరు? అంటే "శత శ్లోకేన పండితః" అంటారు. అంటే ఓ వంద శ్లోకాలు గానీ, పద్యాలు గానీ నోటికి వచ్చినవాడు పండితుడుగా చెలామణీ కావచ్చు. చూడండి:-

**శత నిష్కో ధనాఢ్యశ్చ - శత గ్రామేణ భూపతిః**

**శతాశ్వః క్షత్రియో రాజా - శత శ్లోకేన పండితః!!**

అంటే- నూరు నిష్కాలు (నాణేలు) గలవాడు ధనవంతుడని, నూరుగ్రామాలు తన ఏలుబడిలో వున్నవాడు అధికారి అని, నూరు గుర్రాలు గల క్షత్రియుడు రాజని, నూరు శ్లోకాలు వచ్చినవాడు పండితుడని యీ శ్లోక తాత్పర్యం. నూరేళ్ల జీవితం కాబట్టి నూరు ప్రమాణ మయ్యిందిక్కడ. 'శతమానం భవతి' కదా!

పండితుణ్ని విద్వాంసుడంటారు. విద్వత్తు అంటే పాండిత్యం. విద్వత్తు గలవాడు విద్వాంసుడు. విద్వాంసు డెక్కడైనా పూజింపబడతాడని "విద్వాన్ సర్వత్ర పూజ్యతే" అంటారు. చాణక్య శతకంలోని ఆ శ్లోకం చూడండి:-

**విద్వత్త్వం చ నృపత్వం చ - నైవ తుల్యం కదా చ న**

**స్వదేశే పూజ్యతే రాజా - విద్వాన్ సర్వత్ర పూజ్యతే!!**

పాండిత్యం రాచరికం - వీటిని పోల్చటానికే వీలులేదు. రాజు స్వదేశంలో పూజనీయుడైతే విద్వాంసు డెక్కడైనా లోకంలో పూజింపబడతాడని భావం. ఇలాగే మూర్ఖుడు తనింటిలోను, అధికారి తన గ్రామంలోను, రాజు తన దేశంలోను, విద్వాంసుడు ఎక్కడైనా పూజింపడతారని మరో శ్లోకం:-

**స్వగృహే పూజ్యతే మూర్ఖః - స్వగ్రామే పూజ్యతే ప్రభుః**

**స్వదేశే పూజ్యతే రాజా- విద్వాన్ సర్వత్ర పూజ్యతే!!**

అంటూ తెలియజేస్తూవుంది.

సంస్కృత భాషా పరిచయం ఉన్న పెద్దలు భోజనం చేయటానికి "శతం విహాయ భోక్తవ్యం" అంటూ వుంటారు నవ్వుతూ. ఆర్య ధర్మానికి సంబంధించిన ఆ మహత్తర శ్లోకం చూడండి:-

**శతం విహాయ భోక్తవ్యం - సహస్రం స్నాన మాచరేత్**

**లక్షం విహాయ ధాతవ్యం - కోటిం త్యక్త్వా హరిం భజేత్!!**

తన కోసం వేచివున్న వందిమందినైనా విడిచిపెట్టి సమయానికి భోజనం చేయాలి. అలాగే వేయిమందిని విడిచివెళ్ళి స్నానం చేయాలి. లక్ష మందిని విడిచి వెళ్లి దానం చేయాలి. కోటిమందిని విడిచిపెట్టి ఈశ్వర ధ్యానం చేయాలి. అంటే అన్నిటి కంటె భోజనం, స్నానం, దానం, దైవప్రార్థన ముఖ్యమైనవని శ్లోక భావం. ఈ శ్లోకంలో చాలామంది మొదటి పాదమే ఇష్టపడతారు కానీ చివరి పాదం కోసమీ శ్లోకం చెప్పబడిందని గుర్తిస్తే మంచిది.

"అతి సర్వత్ర వర్జయేత్" అంటారు పెద్దలు. 'అతి'గా తినటం, తిరగటం, మాట్లాడటం, చేయటం, వంటి వెప్పుడూ మంచివి కావు. అతి గారాబం వల్ల పిల్లలు కూడా చెడిపోతూ వుంటారు. ఆ శ్లోకం చూడండి:-

**అతి దానాత్ హతః కర్ణః - అతి లోభాత్ సుయోధనః**

**అతి కామాత్ దశగ్రీవో - అతి సర్వత్ర వర్జయేత్!!**

అతిగా దానం చేసి కర్ణుడు, అతి లోభత్వం తో దుర్యోధనుడు, అతి కామం వల్ల రావణుడు నశించారు. కాబట్టి, అతి దేనికీ పనికి రాదని చాణక్యుని నీతి. ఈ 'అతి'



అనేదెక్కడా పనికిరాదు. "అతి పరిచయా దవజ్ఞా - సంతత గమనా దనాదరో భవతి" అన్నారు. అంటే- అతి పరిచయం వల్ల చులకన భావం ఏర్పడుతుంది. తరచూ వచ్చిపోతూ వుంటే అనాదరణ కలుగుతుంది, లెక్కపెట్టరు, గౌరవించరు కాబట్టి హద్దుమీరి ప్రవర్తించటం ఎవ్వరికీ మంచిది కాదు.

కర్మని బట్టి బుద్ధి ఉంటుందని "బుద్ధిః కర్మానుసారిణీ" అంటూ వుంటారు. ఆ పూర్తి శ్లోకం ఇలా వుంటుంది. చూడండి:

**సత్యానుసారిణీ లక్ష్మీః - కీర్తిః త్యాగనుసారిణీ**

**అభ్యాసానుసారిణీ విద్యా - బుద్ధిః కర్మానుసారిణీ!!**

సత్యాన్ని అనుసరించి సంపద, త్యాగాన్ని బట్టి కీర్తి, అభ్యాసం వల్ల విద్య, కర్మానుసారం బుద్ధి అంటే ఆలోచన కలుగుతాయని తాత్పర్యం. ఈ బుద్ధికి సంబంధించిందే మరో గొప్ప వాక్యం- "వినాశకాలే విపరీత బుద్ధిః" - లోకంలో చాలా ప్రచారంలో ఉంది. ఇదొక తిట్టులా, శాపంలా వున్నమాట. ఇది శ్రీరాముని పరంగా ఉండటం పరమాశ్చర్యకరమైన విశేషం.

**న నిర్మితోవై నచ దృష్ట పూర్వో**

**న శ్రూయతే హేమమయం కురంగః**

**తథాపి తృష్ణా రఘునందనస్య**

**వినాశ కాలే విపరీత బుద్ధిః!!**

బంగారు లేడి నంతవరకూ ఎవ్వరూ నిర్మించినట్లుగాని, చూచినట్లు గానీ, వినినట్లుగానీ లేదు. అయినా రాముడు దానియందు ఆశపడ్డాడంటే- కష్టాలు అనుభవించవలసి వచ్చినపుడు విపరీత బుద్ధులే పుడతాయి కదా! అని శ్లోక భావం. ఇక్కడ రాముడు కాబట్టి వినాశకాలమంటే కష్టకాలమని చెప్పుకోవాలి, అదే ఇతరులకైతే పోయేకాలమే అవుతుంది.

స్త్రీలను గురించిన మూడు వాక్యాలు లోకంలో చాలా ప్రసిద్ధంగా వినబడుతూ వుంటాయి. "భార్యా రూపవతీ శత్రుః" అని, "స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః" అని, "వృద్ధనారీ పతివ్రతాః" అని. ఆయా మాటలు ఏఏ శ్లోకాల్లోవో, ఏఏ సందర్భాల్లో వాడారో తెలుసుకోవాలి. చూడండి:-

**ఋణ కర్తా పితా శత్రుః - మాతా చ వ్యభిచారిణీ**

**భార్యా రూపవతీ శత్రుః - పుత్ర శ్శత్రు రపండితః!!**

అప్పులు చేసిన తండ్రి, వ్యభిచారిణియైన తల్లి, అందగత్తెయైన భార్య, చదువుకోకుండా శుంఠలా తిరుగుతున్న కొడుకు శత్రువుల్లా దుఃఖాన్ని కలిగిస్తారని భావం.

**ఆత్మ బుద్ధి స్సుఖం చైవ - గురు బుద్ధి ర్విశేషతః**

**పరబుద్ధి ర్వినాశాయ - స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః!!**

ఇది నీతి శాస్త్ర శ్లోకం. తన ఆలోచన వల్ల సుఖంగాను, పెద్దల ఆలోచన మరింత క్షేమకరం గాను. ఇతరుల ఆలోచన నష్టదాయకంగాను, దుష్ట స్త్రీ ఆలోచన ప్రళయాంతకం గాను ఉంటుందని భావం. శాస్త్ర విషయంలో ఎవరూ ఆవేశపడటానికి లేదు. ఎందుకంటె శాస్త్రమెప్పుడూ బాధ్యతాయుతంగా, నిష్పక్షపాతంగా, నిక్కచ్చిగానే చెబుతుంది. అ చెప్పిందేదో అది జీవిత సత్యమే అయివుంటుంది. కాబట్టి దానికి స్వార్థ ప్రయోజనాన్ని అంటగట్టటానికి వీలులేదు. ఇక యీ శ్లోకం చూడండి:-

**అసమర్థస్య సాధూనాం - నిర్ధనస్య జితేంద్రియః**

**వార్ధక్యే దేవతా భక్తిః - వృద్ధనారీ పతివ్రతాః!!**

అసమర్థుడు సాధువుగాను, డబ్బులేనివాడు జితేంద్రియుడు గాను, వృద్ధుడు భక్తుడు గాను, వృద్ధనారి పతివ్రత గాను చెలామణీ అవుతూ వుంటారని భావం. ఇటువంటివి అంతటా వర్తించకపోయినా పాక్షిక సత్యాలుగా నైనా గుర్తించవలసి వుంది. లేకపోతే ఆ మాటలకంత గిరాకీ రాదు కదా!

కొంతమంది తమ లాభాలకోసం స్వప్రయోజనాల కోసం అతి వినయాన్ని ప్రదర్శిస్తూ వుంటారు. అది ధూర్త లక్షణం. అటువంటి ధూర్తులెలా వుంటారో పంచతంత్ర కావ్యం ఇలా చెబుతూ వుంది.

**ముఖం పద్మదళాకారం - వచ శ్చందన శీతలం**

**హృదయం కర్తరీ తుల్యం - అతి వినయం ధూర్త లక్షణమ్!!**

పద్మం లాంటి ముఖం, చల్లని చందనం లాంటి మెత్తని మాటలు, కత్తెర లాంటి హృదయం, అతి వినయం- ధూర్తుని లక్షణాలని అలాంటి వాడి పట్ల చాలా జాగ్రత్తగా వుండాలని భావం.

లోకంలో "ఆలస్య మమృతం విషం" అనేది చాలా ప్రసిద్ధికెక్కిన మాట. అదొక శ్లోక పాదం. చూడండి:-

**సిద్ధ మన్నం ఫలం పక్వం - నారీ ప్రథమ యౌవనం**

**కాలక్షేపం న కర్తవ్యం - ఆలస్య మమృతం విషం!!**

సిద్ధాన్నాన్ని, పండిన పండుని, స్త్రీ ప్రథమ యౌవనాన్ని కాలక్షేపం చేయకుండా వెంటనే అనుభవించాలి. ఆలస్యం చేస్తే అమృతమే విషమై పోతుందని శ్లోక తాత్పర్యం. ఈ మూడు విషయాల్లోనే కాదు ఏ విషయంలోనైనా అనుకున్న పని వెంటనే చెయ్యటం వల్ల త్వరగా ఫలితం చేతికందుతుంది కదా! ఆలస్యంగా చెప్పిన న్యాయం కూడా అన్యాయమే అవుతోంది కదా! కాబట్టి మనిషికి కర్తవ్యనిష్ఠ చాలా ముఖ్యమని గ్రహించాలి.

ఇంక చివరగా "దండం దశగుణం భవేత్" ఏమిటో చెప్పి యీ వ్యాసాన్ని ముగిస్తాను. చాలా మంది దండమంటే నమస్కరించట మనుకుంటారు. కానీ అదికాదు. దండమంటే చేతి కర్ర. అది పది విధాలుగా పనికొస్తుందని తెలిపే ఈ శ్లోకం చూడండి.

**విశ్వామిత్రాహి పశుషు । కర్దమేషు జలేషు చ ।**

**అంధే తమసి వార్ధక్యే । దండం దశగుణం భవేత్!!**

వి + శ్వా + అమిత్ర + అహి +పశు + కర్దమ+ జల + అంధ + తమస్సు + వార్ధక్యం. అంటే- పక్షులు, కుక్కలు, అమిత్రులు, పాములు, పశువులు- వీటిని పారద్రోలటానికీ, బురదలో, నీటిలో, చీకటిలో, గ్రుడ్డితనంలో, ముసలితనంలో ఆధారంగా ఉండటానికి చేతికర్ర పనికి వస్తుంది కాబట్టి. చేతికర్ర వల్ల పది ప్రయోజనాలు కలుగుతాయని శ్లోక తాత్పర్యం. ఇక్కడ దశ గుణాలంటే దశవిధ ప్రయోజనాలని అర్థం.

పూర్తి పాఠాలు ఏమిటో తెలుసుకోవటం వల్ల పరిపుష్టత ఏర్పడుతుంది. మూలాలు - మూల్యాలు గుర్తించటం వల్ల లోక వ్యవహార చాతుర్యం కూడా పాండిత్యంతో ద్విగుణీకృత శక్తి మంతమవుతుంది. తెలుసుకోవాలనుకునే వారికి ఒక్క సంస్కృత సాహిత్యమే కాదు ఏ భాషా సాహిత్యమైనా రత్నాల ఖని లాగే ఉంటుంది. శోధించి ఆ రత్నకాంతుల్ని సాధించాలి. వచ్చింది చాలనుకునే వాడుగానీ, అక్కర్లేదనుకునేవాడుగానీ అతి వినయంగానే ఉంటాడు గదా!



జిందగీ భర్ నహీఁ భూలేగీ వో బర్సాత్ కీ రాత్
ఏక్ అన్‌జాన్ హసీనా సే ములాకాత్ కీ రాత్ ॥జిందగీ భర్॥

హాయ్ వో రేష్‌మీ జుల్ఫోఁ సే బర్‌సతా పానీ
ఫూల్ సే గాలోఁ పే రుక్‌నే కో తరస్‌తా పానీ
దిల్ మేఁ తూఫాన్ ఉఠాతే హుయే
దిల్ మేఁ తూఫాన్ ఉఠాతే హుయే హాలాత్ కీ రాత్ ॥జిందగీ భర్॥

డర్‌కే బిజ్‌లీ సే అచానక్ వో లిపట్‌నా ఉస్‌కా
ఔర్ ఫిర్ షర్మ్ సే బల్‌ఖాకే సిమట్‌నా ఉస్‌కా
కభీ దేఖీ న సునీ ఐసీ హో
కభీ దేఖీ న సునీ ఐసీ తిలిస్మాత్ కీ రాత్ ॥జిందగీ భర్॥

సుర్ఖ్ ఆంచల్ కో దబాకర్ జో నిచోడా ఉస్‌నే
దిల్ పే జల్‌తా హువా ఏక్ తీర్‌సా ఛోడా ఉస్‌నే
ఆగ్ పానీ మేఁ లగాతే హుయే
ఆగ్ పానీ మేఁ లగాతే హుయే జజ్బాత్ కీ రాత్ ॥జిందగీ భర్॥

మేరే నగ్మోఁ మేఁ జో బస్‌తీ హై వో తస్వీర్ థీ వో
నౌజవానీ కే హసీఁ ఖ్వాబ్ కీ తాబీర్ థీ వో
ఆస్మానోఁ సే ఉతర్ ఆయీ థీ జో రాత్ కీ రాత్ ॥జిందగీ భర్॥





# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



| | | |
|---|---|---|
| చిత్రం | : | బర్సాత్ కీ రాత్ |
| సంగీతం | : | రోషన్ |
| రచన | : | సాహిర్ లుధియాన్వి |
| గానం | : | మహమ్మద్ రఫీ |
| అభినయం | : | భరత్ భూషణ్, మధుబాల |





సుందరాంగులను వర్ణిస్తూ ఎన్నో పాటలు వచ్చాయి. వాటిలో 'ఎక్ లడ్‌కీ భీగీ భాగీసీ' వంటి అల్లరి పాటలు. 'యే చాంద్ సా రోషన్ చెహరా' లాంటి హుషారైన పాటలు. 'చౌదవీఁ కా చాంద్ హో' వంటి సున్నితమైన పాటలు, 'ఏక్ లడ్‌కీ కో దేఖా తో ఐసా లగా' వంటి నేటి తరం పాటలు ఉన్నాయి. 'జిందగీ భర్ నహీఁ భూలేగీ' పాటలకు వాటిలో ప్రత్యేకమైన స్థానం ఉంది. ఓ అమ్మాయి సౌకుమార్యాన్ని ఆమె చేసే చిన్న చిన్న చేష్టల ద్వారా తెలపటం ఇందులోని విశిష్టత. సున్నితమైన భావాలను తెలియబరిచేటపుడు మంద్ర స్థాయిలో, ఉద్వేగాన్ని తెలిపేటపుడు పై స్థాయిలో సాగి మనసును ఆకట్టుకుంటుంది ఈ పాట. రచయిత సాహిర్, స్వరకర్త రోషన్‌ల 'పాట'వం అంతా ఒదిగిన పాట ఇది.

గాయకుడైన కథానాయకుడు ఒక వర్షపు రాత్రి నాయికతో కలిగిన పరిచయాన్ని పాటగా మలచి రేడియోలో పాడుతుండగా నాయిక వింటూ మురిసిపోయే పాట ఇది. నాయికా నాయకులుగా మధుబాల, భరత్ భూషణ్ నటించారు. నాయిక అప్రయత్నంగా, అలవోకగా చేసిన చేష్టలను అతను పాటలో వర్ణిస్తుంటే ఆమె సిగ్గుపడుతూ వినటం- ఎంత అందమైన చిత్రీకరణ. మహమ్మద్ రఫీ ఈ పాటలోని వివిధ భావాలకు అనుగుణంగా పాడారని చెప్పటం చర్విత చర్వణమే అవుతుంది.

'జిందగీ భర్' అంటే జీవితాంతం. భూల్‌నా అంటే మరవటం. బర్సాత్ అంటే వర్షం. అన్‌జాన్ అంటే అజ్ఞాతం. హసీనా అంటే సుందరి. ములాకాత్ అంటే పరిచయం, కలయిక.

'జీవితాంతం మరపు రాదు ఆ వర్షపు రేయి
ఒక అజ్ఞాత సుందరిని కలుసుకున్న రేయి'

ఆమెను కలుసుకున్న ఆ వర్షపు రేయి అతనితో ఎన్నో మధురానుభూతులను నింపింది. మరపురాని ఆ అనుభూతులను తలచుకుంటున్నాడతను.

రేషమ్ అంటే పట్టు. జుల్ఫ్ అంటే కురులు. గాల్ అంటే చెక్కిలి. తరస్‌నా అంటే తపించటం. హాలాత్ అంటే పరిస్థితులు.

'పట్టులాంటి కురుల నుంచి కురిసిన ఆ నీరు
పువ్వు లాంటి చెక్కిలిపై నిలిచేందుకు తపించిన నీరు
మదిలో తుఫాన్ రేపిన ఈ రేయి
జీవితాంతం మరపు రాదు'

వర్షంలో తడిసిన ఆమె కురుల నుంచి జారిన నీరు ఆమె అందాన్ని ఇనుమడింప జేసింది. అలా జారిన నీరు పువ్వులాంటి ఆమె చెక్కిలిపై ఆగేందుకు తహతహలాడిందట. ఎంత అందమైన భావం! ఆ పరిస్థితులు అతని మదిలో అలజడి రేపాయి.

డర్ అంటే భయం. బిజ్‌లీ అంటే ఉరుము, మెరుపు. అచానక్ అంటే అకస్మాత్తుగా. లిపట్‌నా అంటే వాటేసుకోవటం. షర్మ్ అంటే సిగ్గు. బల్‌ఖానా అంటే ఊగటం. ఇక్కడ వణకటం అనుకోవచ్చు. సిమట్‌నా అంటే ఒదగటం. 'దేఖీ న సునీ' అంటే కనీ వినీ ఎరుగనిది. తిలిస్మాత్ అంటే మాయ, ఇంద్రజాలం.

'ఉరుముకు బెదిరి ఒక్కసారిగా ఆమె వాటేసుకోవటం
మరల బిడియపడి వణుకుతూ ఒదిగిపోవటం
కనీ వినీ ఎరుగని మాయ చేసిన రేయి
జీవితాంతం మరపు రాదు'

ఉరుములకు భయపడి అనాలోచితంగా ఆమె అతన్ని వాటేసుకోవటం, తర్వాత తన చేష్టకు సిగ్గుపడుతూ దూరంగా జరిగి వణుకుతూ తనలో తాను ఒదిగిపోవటం- ఇవన్నీ అతనిపై ఏదో మాయ చేశాయి. అలాంటి మాయ అంతకు ముందు ఎరుగడు. కనీసం విననైనా లేదు. ఆ మాయ మరువటం ఎవరి తరం?

సుర్ఖ్ అంటే ఎర్రనిది. ఆంచల్ అంటే పైట. నిచోడ్‌నా అంటే పిండటం. 'జల్‌తా హువా తీర్' అంటే మండుతున్న బాణం. ఆగ్ అంటే అగ్ని. జజ్‌బాత్ అంటే భావోద్వేగాలు.

'ఎర్రటి పైటను చేతబట్టి ఆమె పిండినంతనే
గుండె పై మండే బాణమొకటి వేసినట్టాయెనే
నీటిలోనైనా అగ్గి పుట్టించే భావాలు రేపిన రేయి
జీవితాంతం మరపు రాదు.'

తడిసిన తన ఎర్రటి చీర పైటను ఆమె చేతబట్టి పిండుతుంటే అతని గుండెపై మండుతున్న బాణమొకటి వేసినట్టనిపించింది అతనికి. ఆ వర్షపు రేయిలో కూడా అగ్ని పుట్టించే భావాలు అతనిలో రేగాయి.

నగ్మా అంటే గీతం. తస్వీర్ అంటే చిత్తరువు, రూపం. నౌజవానీ అంటే నవయవ్వనం. ఖ్వాబ్ అంటే కల. తాబీర్ అంటే ఒక దృష్టికోణం నుంచి చూసే రూపం, ఇంటర్‌ప్రెటేషన్. ఆస్మాన్ అంటే ఆకాశం. రాత్ కీ రాత్ అంటే రాత్రికే రాత్రి. అద్భుతమైన రాత్రి అనుకోవచ్చు.

'నా పాటలలో గూడు కట్టుకున్న రూపం ఆమె
నవయవ్వనపు అందమైన కలకు రూపం ఆమె
నింగి నుండి దిగి వచ్చిన ఈ అపురూపమైన రేయి
జీవితాంతం మరపు రాదు.

అతని పాటలకే రూపం వస్తే ఆమెలా ఉంటుందట. అందమైన కల నిజమైతే ఆమెలా ఉంటుందట. నింగి నుంచి వరంలా దిగి వచ్చిన ఆ రేయిని అతను జీవితాంతం మరచిపోలేనంటున్నాడు.



చరణాలలోని మొదటి రెండు లైన్లు సున్నితంగా స్వరపరిచి ఆమె అందాన్ని ఎంతో అందంగా ఆవిష్కరించారు. మూడో లైన్లో తుఫాన్, మాయ, అగ్ని వంటి ఉద్వేగ భరిత భావాలకు పైస్థాయి స్వరాలు కూర్చి మూడ్‌ని నిలబెట్టారు రోషన్. నాలుగో చరణంలో స్వరాలు 'నింగి నుంచి దిగినట్టే' పైనుంచి కిందికొస్తాయి. సందర్భపరంగా, చిత్రీకరణ పరంగా ఈ పాటను పోలిన పాట తర్వాత వచ్చిన 'అనురోధ్' చిత్రంలో ఉంది. అది కిశోర్ కుమార్ పాడగా రాజేశ్ ఖన్నాపై చిత్రీకరించారు. 'ఆతే జాతే ఖూబ్ సూరత్ ఆవారా సడ్‌కోఁ పే'. నాయకుడు రేడియోలో పాడుతుంటే నాయిక వింటూ ఉంటుంది.

---

జిందగీ భర్ నహీఁ భూలేగీ -2
గానం : లతా మంగేష్కర్, మహమ్మద్ రఫీ
అభినయం : మధుబాల, భరత్‌భూషణ్

ఆ: జిందగీ భర్ నహీఁ భూలేగీ వో బర్‌సాత్ కీ రాత్
ఏక్ అన్‌జాన్ ముసాఫిర్ సే ములాకత్ కీ రాత్ ॥జిందగీ భర్॥
హాయ్ జిస్ రాత్ మేరే దిల్ నే ధడక్‌నా సీఖా
షోఖ్ జజ్‌బాత్ నే దిల్ మేఁ భడక్‌నా సీఖా
మేరీ తక్‌దీర్ సే నికలీ వహీ సద్‌మాత్ కీ రాత్ ॥జిందగీ భర్॥
దిల్ నే జబ్ ప్యార్ కే రంగీన్ ఫసానే ఛేడే
ఆంఖోఁ ఆంఖోఁ మే వఫావోఁ కీ తరానే ఛేడే
సోగ్‌మేఁ డూబ్ గయీ ఆజ్ వో నగ్‌మాత్ కీ రాత్ ॥జిందగీ భర్॥
అ: రూఠ్‌నే వాలీ మేరీ బాత్ సే మాయూస్ నా హో
బహకే బహకే సే ఖయాలాత్ సే మాయూస్ నా హో
ఖత్మ్ హోగీ న కభీ తేరే మేరే సాథ్ కీ రాత్ ॥జిందగీ భర్॥



నాయికా నాయకుల మధ్యకలహం వచ్చినప్పుడు, అతని మాటలకు ఆమె బాధపడినప్పుడు వచ్చే పాట ఇది. తాము మొదటిసారి కలుసుకున్న వర్షపు రాత్రిని తలుచుకుంటూ ఆ రాత్రికి, ఈ రాత్రికి ఎంత తేడా అని ఆమె వాపోతుంది. ట్యూన్ మొదటిపాట లాగే ఉన్నా ఆర్కెస్ట్రాలో తేడాతో విషాదాన్ని పలికించారు రోషన్.

ముసాఫిర్ అంటే బాటసారి. షోఖ్ అంటే ఉల్లాసమైనది, మధురమైనది. భడక్‌నా అంటే చెలరేగటం. తక్‌దీర్ అంటే భాగ్యం. సద్‌మా అంటే తట్టుకోలేనిది. సద్‌మాత్ అంటే సద్‌మాకి బహువచనం.

'జీవితాంతం మరుపురాదు ఆ వర్షపు రేయి
ఒక అజ్ఞాత బాటసారిని కలిసిన రేయి
నా గుండె సవ్వడి చేయటం నేర్చుకున్న రేయి
మధుర భావాలు మదిలో చెలరేగటం నేర్చుకున్న రేయి
నా భాగ్యమేమొ మరల వచ్చిందా గుండెపిండే రేయి'

అతన్ని కలిసిన ఆ వర్షపు రేయిలో ఆమెలో కొత్త భావాలు కలిగాయి. మధురమైన బాధను కలిగించాయి ఆ భావాలు. ఇప్పుడు బాధ మిగిలింది, మాధుర్యం లేదు. అందుకు తన భాగ్యాన్ని నిందించుకుంటుంది.

రంగీన్ అంటే రంగులు కలది. ఫసానా అంటే కథ. తరానా అంటే పాట. సోగ్ అంటే శోకం. నగ్మా అంటే గీతం.

'మదిలో రంగుల ప్రేమకథలు మెదిలిన రేయి
చూపుల్లోనే ప్రేమగీతాలు పలికిన రేయి
శోకంలో మునిగింది నేడు ఆ సరిగమల రేయి'

ఆనాడు తొలిచూపులోనే ప్రేమ చిగురించింది. మదిలో ఆశలు వెల్లివిరిసాయి. ఆనాటి ప్రేమగీతం నేడు విషాదగీతంగా మిగిలింది. ఆనాడు తొలిప్రేమ నుంచి పుట్టిన ఆ పాట ఈనాడు విషాదగీతంగా మారింది. ఆ విషాదగీతం విని ఆమెను బాధ పెట్టినందుకు పశ్చాత్తాపపడుతూ అతను ఆమెను ఓదార్చాడు.

రూఠ్‌నా అంటే అలగటం. మాయూస్ అంటే దిగులుపడటం. బహక్‌నా అంటే ఆవేశపడటం. ఖయాలాత్ అంటే ఆలోచనలు. ఖత్‌హోనా అంటే ముగియటం.

**అలిగిన చాన, నామాటలకు దిగులుపడకు**
**ఆవేశపడే ఆలోచనలకు దిగులుపడకు**
**ముగియదు ఏనాడూ మనం తోడుండే రేయి'**

తన మాటలు పట్టించుకోవద్దని, ఆవేశంలో తాను అన్న మాటలకు ప్రాముఖ్యం ఇవ్వవద్దని అతను అంటున్నాడు. తామెప్పుడూ కలిసే ఉంటామని హామీ ఇస్తున్నాడు.

## 'జో వాదా కియా'



**చిత్రం : తాజ్‌మహల్**
**సంగీతం : రోషన్**
**రచన : సాహిర్ లుధియాన్వి**
**గానం : మహమ్మద్ రఫీ, లతా మంగేష్కర్**
**అభినయం : ప్రదీప్‌కుమార్, బీనారాయ్**

అ: జో వాదా కియా వో నిభానా పడేగా
కోకే జమానా చాహే రోకే ఖుదాయా తుమ్‌కో ఆనా పడేగా
॥జో వాదా॥

తరస్‌తీ నిగాహోఀ నే ఆవాజ్ దీ హై
ముహబ్బత్ కీ రాహోఀనే ఆవాజ్ దీ హై
జాన్-ఎ-హయా, జాన్-ఎ-అదా ఛోడో తర్‌సానా, తుమ్‌కో ఆనా పడేగా
॥జో వాదా॥

ఆ: యే మానా హమే జాఀసే జానా పడేగా
పర్ యే సమఝ్‌లో తుమ్‌నే జబ్ భీ పుకారా హమ్‌కో ఆనా పడేగా
॥జో వాదా॥

హమ్ అప్‌నీ వఫా పే నా ఇల్‌జామ్ లేంగే
తుమ్హే దిల్ దియా హై తుమ్హే జాఀ భీ దేంగే
జబ్ ఇష్క్ కా సౌదా కియా ఫిర్ క్యా ఘబ్‌రానా, తుమ్‌కో ఆనా పడేగా
॥జో వాదా॥

ఇ: చమక్‌తే హైఀ జబ్ తక్ యే చాంద్ ఔర్ తారే
న టూటేంగే అబ్ ఎహదో పైమాఀ హమారే
ఇక్ దూస్‌రా జబ్ దే సదా హోకే దీవానా హమ్‌కో ఆనా పడేగా
॥జో వాదా॥

హిందీలో చారిత్రాత్మక చిత్రాలలో 'ముఘల్ - ఎ - ఆజమ్' లోని 'ప్యార్ కియాతో డర్నా క్యా' తర్వాత 'తాజ్‌మహల్' లోని 'జో వాదా కియా' నే చెప్పుకోవాలి. జన్మజన్మలకు తమ ప్రేమను అమరం చేసుకోవటానికి షాజహాన్ నిర్మించిన తాజ్‌మహల్ ఎంత అందమయినదో, షాజహాన్, ముంతాజ్‌మహల్‌ల ప్రేమ అంత గొప్పది. ఆ ప్రేమకు అక్షరరూపం ఇచ్చి, స్వరపరచి చక్కని ప్రేమగీతాన్ని రూపొందించారు సాహిర్, రోషన్.

ఎన్నో చారిత్రాత్మక చిత్రాలలో, జానపద చిత్రాలలో రాజకుమారుడి పాత్ర పోషించి తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకున్న ప్రదీప్‌కుమార్ ఈ చిత్రంలో షాజహాన్‌గా నటించారు. బీనారాయ్ ముంతాజ్ మహల్ గా నటించారు. ముంతాజ్ కోసం ఎదురుచూస్తున్న షాజహాన్ ఏ అవాంతరాలొచ్చినా ప్రేమ కోసం రాకతప్పదని ప్రేయసికి పిలుపునివ్వటంతో మొదలయ్యే పాట వారి కలయికతో, వారి ప్రేమ శాశ్వతత్వాన్ని చాటటంతో ముగుస్తుంది.

వాదా అంటే మాట, బాస. నిభానా అంటే నిలుపుకోవటం. జమానా అంటే లోకం. ఖుదాయీ అంటే దైవత్వం.

**'చేసిన బాస నిలుపుకోవాలి**
**లోకమే ఆపినా, దైవమే ఆపినా నీవు రావాలి'**

ప్రేయసి కోసం ఎదురుచూస్తూ ఇచ్చిన మాట నిలుపుకొని ఏమి అడ్డు వచ్చినా అధిగమించి రావాలని ప్రేమతో శాసిస్తున్నాడు.

తరస్‌నా అంటే తపించటం, ఎదురుచూడటం. తర్‌సానా అంటే ఊరించటం. నిగాహేఀ అంటే చూపులు. ఆవాజ్ అంటే పిలుపు. ముహబ్బత్ కీ రాహ్ అంటే ప్రేమ బాట. హయా అంటే సిగ్గు. అదా అంటే వయ్యారం.

వేచిన చూపులు పిలిచాయి
ప్రేమ బాటలు పిలిచాయి
సిగ్గొలించే వయ్యారీ ఇక ఊరించకు, నీవు రావాలి'

ఆర్తిగా ఎదురుచూసే అతని చూపులు ఆమెను పిలిచాయి. ప్రేమ ప్రయాణం సాగించాలని పిలుపునిచ్చాడు. తనని ఊరించటం మాని ఆమె రావాలని, ఆమె సాంగత్యం కోసం పరితపిస్తున్నానని అంటున్నాడు. ఇంతలో ఆమె వచ్చింది. అతని పిలుపు విని తన మనసులోని మాట చెబుతోంది.

జాన్ అంటే ప్రాణం. పుకార్ అంటే పిలుపు

నేను ప్రాణాలొడ్డాలని తెలుసు
అయినా నీవు పిలిచిన వేళల నేను రావాలి'

ప్రేమ నిలుపుకోవటానికి ఒక్కోసారి ప్రాణాలు కూడా త్యాగం చేయాల్సి రావచ్చు. అయినా భయపడి వెనకడుగు వేసేది లేదని, అతను పిలిచినప్పుడు తాను వస్తానని ఆమె అంటోంది.

వఫా అంటే విశ్వాసం. ప్రేమ అని కూడా అనుకోవచ్చు. ఇల్‌జామ్ అంటే నింద. సౌదా అంటే ఇచ్చిపుచ్చుకోవటం. ఘబ్‌రానా అంటే భయపడటం.

నేను నా ప్రేమపై నింద రానీయను
నీకు మనసిచ్చాను, ప్రాణం కూడా ఇస్తాను
ప్రేమ ఇచ్చిపుచ్చుకున్నాక భయమేంటి, నీవు రావాలి'

తాను తన ప్రేమని నిలుపుకోలేదనే నింద రానీయనని, అవసరమైతే ప్రేమకోసం ప్రాణం కూడా ఇస్తానని ఆమె అంటోంది. ప్రేమించిన తర్వాత దేనికీ భయపడకూడదని ఆమె నమ్మకం. ఇక్కడ 'ప్యార్ కియా తో డర్‌నా క్యా' పాట గుర్తుకు వస్తుంది.

చమక్‌నా అంటే మెరవటం. చాంద్ అంటే చంద్రుడు. తారే అంటే తారలు. సదా అంటే పిలుపు. దీవానా అంటే ప్రేమ పిచ్చివాడు, ప్రేమలో అన్నీ మరచినవాడు.

'చంద్రుడు, తారలు మెరుస్తూ ఉన్నంతవరకు
మనం చేసుకున్న బాసలు చెరిగిపోవు
ఒకరు పిలిస్తే అన్నీ మరచి ఒకరు రావాలి'

చంద్రుడు, తారలు ఉన్నంతవరకు మన ప్రేమ నిలిచిపోవాలని వారిద్దరూ కోరుకుంటున్నారు. ఒకరు పిలిస్తే మరొకరు అన్నీ మరచి రావాలని బాసలు చేసుకుంటున్నారు.

రోషన్ కుమారులైన రాకేష్ రోషన్, రాజేష్ రోషన్ కూడా పరిశ్రమలో పేరు సంపాదించుకున్నారు. రాజేష్ రోషన్ సంగీత దర్శకుడిగా తన స్థానాన్ని పదిలం చేసుకున్నారు. 'కువాఁరా బాప్', 'జూలీ' మొదలుకొని 'కహోనా ప్యార్ హై' వరకు ఎన్నో హిట్లు ఇచ్చారు. రాకేష్ రోషన్ నిర్మాతగా, దర్శకుడిగా ఎన్నో విజయాలు సాధించారు. రోషన్ కుటుంబంలో మూడో తరానికి చెందిన హృతిక్ రోషన్ హీరోగా అగ్రస్థానంలో ఉన్నారు. రాకేష్ రోషన్ దర్శకత్వంలో, రాజేష్ రోషన్ సంగీతంలో హృతిక్ రోషన్ నటించిన 'కోయీ మిల్ గయా' చిత్రం త్వరలో విడుదల కానుంది.



## 'జో వాదా కియా'-2

**చిత్రం : తాజ్‌మహల్**
**సంగీతం : రోషన్**
**గానం : మహమ్మద్ రఫీ, లతా మంగేష్కర్**
**అభినయం : ప్రదీప్‌కుమార్, బీనారాయ్**

అ: జో వాదా కియా వో నిభానా పడేగా
రోకో జమానా చాహే రోకే ఖుదాయీ తుమ్‌కో ఆనా పడేగా ॥జో వాదాకియా॥

సభీ ఎహల్-ఎ-దునియా యేకెహతే హైఁ హమ్‌సే
కి ఆతా నహీ కోయీ ముల్క్-ఎ-అదమ్ సే
ఆజ్ జరా షాన్-ఎ-వఫా దేఖే జమానా, తుమ్‌కో ఆనా పడేగా ॥జో వాదాకియా॥

ఆ: యే మానా హమే జాఁసే జానా పడేగా
పర్ యే సమఝ్‌లో తుమ్‌నే జబ్ భీ పుకారా హమ్‌కో ఆనా పడేగా ॥జో వాదాకియా॥

హమ్ ఆతే రహే హైఁ, హమ్ ఆతే రహేంగే
ముహబ్బత్ కీ రస్మేఁ నిభాతే రహేంగే
జానేవఫా, తుమ్ దో సదా ఫిర్ క్యా లికానా, హమ్‌కో ఆనా పడేగా ॥జే వాదా కియా॥

ముంతాజ్‌మహల్ మరణించిన తర్వాత ఆమెను తలుచుకుంటూ షాజహాన్ పాడే పాట ఇది. తన పిలుపును విని ఆమె దివి నుండి దిగి వచ్చినట్టు ఊహించుకునే పాట.

ఎహల్ అంటే జనులు. ఎహల్-ఎ-దునియా అంటే లోకంలో ఉండే జనులు. ముల్క్ అంటే దేశం లేదా లోకం. అదమ్ అంటే భిన్నమైనది. ముల్క్-ఎ-అదమ్ అంటే మరో లోకం. షాన్-ఎ-వఫా అంటే ప్రేమ గొప్పదనం.

లోకులంతా అంటారు
మరోలోకం నుండి ఎవరూ మరలిరారని
నేడు ప్రేమ మహిమ లోకం చూడాలి, నీవు రావాలి'

ఈ లోకం విడిచి వెళ్లిన వారు మళ్లీ రారని అంటారు అందరూ. కానీ మన ప్రేమ ఔన్నత్యం ఏమిటో అందరికీ తెలిసేలా నీవు రావాలి అని అతడు కోరుతున్నాడు. ఈ పిలుపు విని ఆమె చందమామ నుంచి దిగి వచ్చింది.

రస్మ్ అంటే సంప్రదాయం. నిభానా అంటే నిలబెట్టుకోవటం. శికానా అంటే నెలవు.

'నేను మరలి వచ్చాను, వస్తూనే ఉంటాను
నా ప్రేమను నిలబెట్టుకుంటాను
ప్రియా, నీవు పిలిస్తే నిలిచేది లేదిక,నేను రావాలి'

దివి నుంచి దిగి వచ్చిన ఆమె ప్రేమ కోసం అతను పిలిచినప్పుడల్లా వస్తూనే ఉంటానని నమ్మబలికింది.

తాజ్‌మహల్ చిత్రానికి 1963వ సంవత్సరపు ఉత్తమసంగీతం ఫిలింఫేర్ అవార్డు రోషన్‌కి దక్కింది.

**-పి.వి.సత్యనారాయణ రాజు**

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

## 1956

విశ్వభారతి మూవీస్, డైరెక్టరు రాజా నవాథే 'బసంత్ బహార్' తలపెట్టినప్పుడు సంగీత దర్శకునిగా వారి ఫస్ట్ ఛాయిస్ 'బైజూ బావరా' ఫేమ్ నౌషాద్. కానీ డిస్ట్రిబ్యూటర్ల ఒత్తిడి వల్ల కమర్షియల్ సంగీతం మాత్రమే ఇవ్వగలరనుకున్న శంకర్-జైకిషన్‌లు విమర్శకులు సైతం ఆశ్చర్యపోయేలా అత్యద్భుతమైన సంగీతాన్ని ఈ చిత్రానికి ఇవ్వగలిగారు. శాస్త్రీయ సంగీతానికి అధిక ప్రాధాన్యమున్న ఈ చిత్రంలోని 'నైన్ మిలే చైన్ కహాఁ', 'సుర్ నా సజే', 'బడీ దేర్ భయీ', 'దునియా న భాయే మోహే' పాటలు సూపర్ హిట్ అవటమే కాదు, మన్నాదే, శంకర్-జైకిషన్‌ల కాంబినేషన్ వరుసగా రెండో సంవత్సరం కూడా హిట్ కాంబినేషన్‌గా నిలిచింది.


**నౌషాద్**

'కేతకి గులాబ్ జుహి' అనే సంగీత భరిత చిత్రం కోసం పండిట్ భీమ్‌సేన్ జోషి కి మన్నాదే సహాయం అందించారు.

శంకర్-జైకిషన్‌లకు ఈ సంవత్సరంకూడా మరిన్ని హిట్‌లు వచ్చాయి.


**'న్యూ ఢిల్లీ' చిత్రంలో ఓ సన్నివేశం**

'న్యూ ఢిల్లీ' చిత్రం కోసం కిశోర్ పాడిన ' అరే భాయ్ నికల్ కే ఆ ఘర్ సే', 'నకరే వాలీ' లతో పాటు లతా పాడిన ' తుమ్ సంగ్ ప్రీత్ లగాయి రసియా' పాటలు మంచి హిట్ అయ్యాయి.


**ఎస్.డి.బర్మన్**

'పట్‌రాణీ'(చంద్రమా మద్‌భరా), రాజ్‌హాథ్(యే వాదా కరో చాంద్ కే సామ్‌నే)- ఈ పాట ముకేశ్ ప్రోద్బలంతో హస్రత్ జైపురి వెన్నెల్లో కూచుని రాశాడట-హాలాకు(ఆజాకే ఇంతజార్‌మేఁ)

ఎస్.డి.బర్మన్ నవకేతన్ సంస్థ నిర్మించిన 'ఫంటూష్' చిత్రంతో మళ్లీ హిట్ కొట్టారు. 'యే మేరీ టోపీ పలట్ కే ఆ', 'దు:ఖీ మన్ మేరా', 'దేనే వాలా జబ్ భీ దేతా' పాటలు సూపర్ హిట్ అయ్యాయి. సలిల్ చౌధురి స్వరపరిచిన 'పరివార్' చిత్రంలోని 'క్యా మైఁ కుద్ కే', 'జా తో సే నహీఁ బూలూఁ', 'ఝిర్ ఝిర్ భర్ సే' , సి.రామచంద్ర స్వరపరిచిన 'దేవతా' చిత్రంలోని 'యే చాంద్ కల్ జో ఆనా', 'కైసే ఆవుఁ జమునా కే తీర్' పాటలు ఈ సంవత్సరం హిట్ అయిన కొన్ని గీతాలు.

## 1957

చిన్న సంగీత దర్శకులకు పెద్ద గుర్తింపు తీసుకువచ్చిన సంవత్సరం ఇది. క్లాసికల్ మ్యూజిక్‌లో నిష్ణాతుడైన ఎస్.ఎన్.త్రిపాఠి స్వరపరిచిన 'జనమ్ జనమ్ కే ఫేరే' అద్భుతమైన హిట్ సాధించింది. ఆ చిత్రంలో రఫీ, లతా పాడిన 'జరా సామ్నే తో ఆవో ఛలియే', రఫీ గానం చేసిన టైటిల్ గీతానికి చక్కటి పేరు వచ్చింది.

వి. శాంతారాం చిత్రం 'దో ఆంఖేఁ బారా హాత్' కోసం వసంత్ దేశాయ్ స్వరపరచగా లతా గానం చేసిన 'యే మాలిక్ తేరే బందే హమ్'( ఇదే ట్యూన్‌ను 1999లో రాజశ్రీ సంస్థ నిర్మించిన 'హమ్ సాథ్ సాథ్ హైఁ కోసం రామ్-లక్ష్మణ్‌లు 'యే తో సచ్ హై కే భగవాన్ హై' పాట కోసం ఉపయోగించారు), 'సైయ్యా ఝూఠోం కా బడా', కోరస్ గీతం 'హో ఉమడ్ గుమడ్ కర్ ఆయే రే ఘటా' పాటలు హిట్ అయ్యాయి.


**వి. శాంతారాం**

'ఛంఘీజ్‌ఖాన్'చిత్రం కోసం రఫీ గానం చేసిన 'మొహబ్బత్ జిందారెహతీ హై', అలాగే 'మిస్ బాంబే' కోసం పాడిన 'జిందగీ భర్ గమ్' పాటలతో హన్స్‌రాజ్ బెహల్ శాశ్వతమైన కీర్తిని సంపాదించారు.

-(వచ్చే సంచికలో మరికొంత)






నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది

# నవ్వించగల సెన్సార్థం

చాలా ఏళ్లక్రితం "శంకర్స్‌వీక్లీ"లో ఓ కార్టూన్ పడింది. ఫిలిమ్ సెన్సార్ ఆఫీసులో, ఆఫీసరు చేతిలో ఫిలిమ్ రీలు పెట్టుకుని, కళ్లు విశాలం చేసుకుని, వెర్రి ఆనందంతో చూస్తూవుంటాడు. వెనకాల వున్న గుమస్తా - "సార్! ఈ సినిమా ప్రొడ్యూసర్లు నిరీక్షిస్తున్నారు. కట్స్ చెబితే వెళ్లిపోతారట" అంటాడు. "ఉండవయ్యా! ఈత దుస్తుల్లో వున్న ఈ అమ్మాయిని కాస్సేపుచూసి, కట్స్ చెప్తా" అంటాడు ఆఫీసరు.



"అందుకేనేమో చాలామంది సెన్సార్ బోర్డు మెంబర్లు కావాలని ప్రయత్నిస్తూ వుంటారు. అన్ సెన్సార్డ్ సినిమాలు చూసేవాళ్లు వాళ్లే కదా!" అన్నారు సరదాగా పింగళి నాగేంద్రరావుగారు- పానగల్‌పార్క్ సమావేశంలో. "వాళ్లు చూస్తే చెడిపోరా? మనం చూస్తే చెడిపోతామా?" అన్నారు ఆయనే చమత్కృతి మిళాయించి, హాయిగా పింగళి మార్కు నవ్వు నవ్వుతూ.

సినిమాలు పుట్టిన కొన్నేళ్లదాకా సెన్సార్ గొడవలేదు. నిశ్శబ్దచిత్రాలు యథాతథంగా విడుదలయి పోయేవి. పైగా ఒక తమాషా ఏమిటంటే అమెరికన్ సినిమాల్లో అసభ్యత, అశ్లీలం ఎక్కువగా వుందని ఆ దేశంలో సెన్సారింగ్ వచ్చేసింది. మన దేశంలోలేదుగ గనక సెన్సార్ కాని అసలు సిసలు సినిమాలే వచ్చి ఆడేవి. ఇంకేం! ప్రేక్షకుల కళ్లకి కావలసినంత పంట. ఈ పంటని ఆపకపోతే అది దేశ సంప్రదాయ వ్యవస్థని మంట కలుపుతుందని సెన్సారింగ్ కావాలని పెద్దలు, పార్లమెంటేరియన్లూ (అప్పుడు వుండేవారు) పట్టుబట్టి 'సినిమెటోగ్రాఫ్‌యాక్ట్' పేరుతో సెన్సారింగ్ ప్రవేశపెట్టారు. అది మనదేశ సినిమాలకీ వర్తిస్తుందన్నారు. కమిషనర్స్ ఆఫ్ పోలీసు, జిల్లా మేజిస్ట్రేట్లూ ఆ సినిమాలు చూసి 'ప్రజలు చూడతగ్గది' వుంచి తక్కినది కోసిపారేసేవారు. ఆ కోతలో కొయ్యబడిన సినిమాయే అసలు సినిమా అంత, చూడదగ్గది రవ్వంతా వుండేదట!

మనకింకో గొడవ కూడా వుంది. బ్రిటిష్ పాలన, స్వరాజ్య ఉద్యమం. సినిమా ప్రభుత్వాన్ని విమర్శించ రాదు. అందులో జాతీయ భావాలు ఉండరాదు. జాతి, మత వైషమ్యాలు కూడా వుండేవి గనక ఒక హిందువు, ఒక ముస్లిము, ఒక విద్యాధికారీ సెన్సార్ సమితిలో సభ్యులుగా వుండేవారు. జాతీయ భావాలున్న పుస్తకాన్నీ, నాటకాల్నీ ఎలాగూ ప్రభుత్వం నిషేధించింది. అంచేత పురాణ చిత్రాల్లోనే వీలైనంతవరకూ జాతీయ భావాలు వచ్చేలా (శబ్దరహిత చిత్రాలే) చూసుకునేవారు నిర్మాతలు.

అప్పుడే ఒక తమాషా! 'భక్తవిదుర్' (1921) అని భారత కథ సినిమాగా వచ్చింది. పురాణకథ గదా, ఏం పట్టించుకుంటార్లే అని - విదురుడిని గాంధీజీలా తయారుచేశారు. మోకాళ్లమీదికి పంచె, కర్రతో వుంటాడు విదురుడు. తలమీద గాంధి టోపీ కూడా పెట్టారు. విదురనీతులన్నీ జాతీయ భావాలతోనూ, స్వరాజ్యానికి సంబంధించీ వుంటాయన్న మాట. శబ్దం లేదు గనక, కొంత అక్షరాల్లో చూపించారు. కొంత వ్యాఖ్యానింప జేశారు. సెన్సార్ వాళ్ళు గ్రహించలేరా? మొత్తం విదురుణ్ణి కత్తిరించమన్నారు. అప్పుడా గాంధీ విదురుణ్ణి తీసేసి, భారత విదురుడిలాగా గడ్డాలూ మీసాలూ పెట్టి మళ్ళీ షూట్ చేశారుట!




మన సినిమాల్లో క్రైమ్, సెక్సూ ఎక్కువ వుండకపోయినా ప్రభుత్వం మీద తీవ్రమైన విమర్శలుండేవి. శబ్దం వచ్చిన తర్వాత ఆ తీవ్రత మరీ తీవ్రం కావడంతో, ప్రభుత్వం సెన్సార్ విషయంలో మరీ తీవ్రమైంది. సినిమెటోగ్రాఫ్ యాక్ట్ అన్నది 'సెంట్రల్ బోర్డ్ ఆఫ్ ఫిలిమ్ సెన్సారింగ్' గా మారి ప్రాంతాలకి కూడా 'రీజనల్' పేరుతో ప్రాకి, కఠినమైన రూల్సుతో వ్యవహరించి ంది. ప్రాంతంలో వివాదం వస్తే, కేంద్రానికి విన్నవించుకోవచ్చు. కేంద్రం కూడా 'నో' అంటే

కోర్టుకే! అంచేత మధ్యగా 'స్క్రీనింగ్ కమిటీ' అని ఒకటొచ్చింది. సెన్సార్ సభ్యులు చెప్పిన కట్స్ నిర్మాతకి నచ్చకపోతే (ఎలాగూ నచ్చావు!) స్క్రీనింగ్ కమిటీకి చెప్పుకోవచ్చు.

ఇందులో ఒక తమాషా: 1976లో 'మనవూరికథ' అని సినిమా వచ్చింది. అందులో 'ఆడింది ఆడింది జోరుగా' అని పాట పాడుతూ గానుగ ఆడుతుంది ఒక పాత్ర. (గిరిజారాణి)




సెన్సార్ వారు ఆ పాట మొత్తం కొయ్యాలన్నారు. నిర్మాతలు స్క్రీనింగ్ కమిటీని 'విన్నపాలు వినవలె'నన్నారు. అప్పుడు బి.యన్.రెడ్డి గారు సదరు కమిటీకి ఛైర్మన్. ఆయన సినిమా అంతా చూసి, 'ఆ పాట సరే ఎలాగూ తీసేయాలి దాంతోపాటు మరికొన్ని డైలాగులూ, షాట్సూ కూడా తీసేయాలి' అని సెలవిచ్చారు. అవి సెన్సార్‌వారు వొదిలేసినవి. నిర్మాతలకి కొరివితో తల గోక్కున్నట్టయింది. దాంతో "స్క్రీనింగ్ కమిటీ ఇంకా డేంజర్" అని తీర్మానించుకున్నారు.

సినిమాల్లో ముద్దులు, గాఢ పరిష్వంగాలు, అర్ధ(నగ్న) వస్త్రాలు, అసభ్యమైన మాటలూ వుండరాదు. ప్రభుత్వ అధికారులైన వారిని (పోలీస్, జుడిషియల్, ప్రభుత్వ యంత్రాంగం) అక్షేపించరాదు, కించపరచరాదు. (ఇవాళ మొత్తం తారుమారు- సెన్సార్ బోర్డ్ వర్ధిల్లాలి!) అప్పట్లో హీరో హీరోయిన్ల చుంబనదృశ్యాలు వుంటే, ముఖాలు దగ్గరగా రాగానే కెమెరా చెట్టు ఎక్కిపోయి పిట్టల్ని చూపించేది.

'సతీ తులసి' సినిమా రెండు సార్లు వచ్చింది. 1936లోనూ, 59లోనూ. ఈ పురాణకథలో తులసి పాతివ్రత్యానికి భంగం కలిగిస్తేనేగాని, భర్త జలంధరుడికి చావురాదు. అంచేత శ్రీ మహావిష్ణువే జలంధరుడి రూపంలో వచ్చి, ఆమె పాతివ్రత్యానికి భంగం కలిగిస్తాడు. ఈ ఘట్టం తొలిసారి వచ్చిన సినిమాలో వుంది. రెండోసారి మాత్రం సెన్సార్‌వారు అభ్యంతర పెట్టారు. "విష్ణువు భగవంతుడు. భగవంతుడొచ్చి అలాంటి పని చెయ్యకూడదు. అంచేత ఈ ఘట్టం కట్ చేస్తున్నాం" అన్నారు వారు.

"స్వామీ! ఇది పురాణకథ. మా పైత్యం కాదు. ముందు వచ్చిన సినిమాలో యథాతథంగా వుంది" అని నిర్మాతలు వాదిస్తే "మేం మాత్రం ఒప్పుకోం" అని కోసేశారు. వాళ్లతో లాభంలేదని, విష్ణు మాయలాంటిదేదో వచ్చి భంగం కలిగించినట్టుగా ఆ పురాణకథని మార్చుకున్నారు.

'పదండి ముందుకు' (1962) సినిమాలో ఉప్పుసత్యాగ్రహాల రోజుల్లో వున్న భారతదేశ పటాన్ని చూపించారు. అప్పటికింకా పాకిస్థాన్ భారతదేశంలోనే వుంది కదా, కాబట్టి మాప్‌లోనూ వుంది. సెన్సార్‌వారు "టాట్" అన్నారు. "విభజించబడిన మాప్‌నే చూపించండి. లేకపోతే పాకిస్థాన్ ఆగ్రహిస్తుంది" అన్నారు. 'అప్పటి కథ కదా' అని నిర్మాతలు ఎంత చెప్పినా వాళ్లు వినలేదు. విభజన జరిగిన దేశపటాన్ని ఎలా చూపిస్తారు? గనక, మాప్ లేకుండానే చేసేశారు- పోరు పడలేక. సెన్సార్‌వారి 'వింత ధోరణులు' ఇలా వుంటాయి.

"గూఢచారి 116" సినిమాలో (1966) సుప్రసిద్ధ మిమిక్రీ కళా కారుడు వేణుమాధవ్ ఒక పాత్ర ధరించి, మిమిక్రీ చేస్తారు- ముఖ్యంగా నటీ నటుల్ని. "మిగతావాళ్లని ఆయన ఇమిటేట్ చేశారు అభ్యంతరం లేదు గాని, నాగయ్య గారినీ భానుమతి గారినీ చెయ్యడానికి మేం ఒప్పుకోలేం. వాళ్లిద్దరూ పద్మశ్రీలు పొందినవారు. వారిని కించపరిచినట్టవుతుంది. అంచేత "మాకేమీ అభ్యంతరం లేదు. మమ్మల్ని అనుకరించడం మమ్మల్ని అవమానించినట్టు కాదు." అని ఆ ఇద్దరి దగ్గర్నుంచి లేఖలు తీసుకురండి. ఉంచుతాం లేకపోతే కత్తిరించే స్తాం" అన్నారు కత్తిరింపు అధికారులు. అది ఏదోగా అనిపించి కుదరనిపని అని వూరు కున్నారు నిర్మాతలు. సెన్సార్ వారు నిర్దాక్షిణ్యంగా తొలగించేశారు! ఇలాంటివి విన్నప్పుడు వింతగానూ వుంటుంది, నవ్వూ వస్తుంది. అంచేత సెన్సారథం హ్యూమరథానికి దగ్గరే. మరికొన్ని తర్వాత. ☆

## 'సం' గీతా రహస్యాలు



**'ఔనా.... నిజమేనా' పాట. హృదయం ద్రవించేలాంటి వరస పడాలని రెడ్డిగారన్నారు. ఘంటసాలగారి పాట! పాడడంలో ఆయన గుండె కరిగించేస్తారు. ముందు ఆయన, తర్వాత భానుమతి రికార్డింగు. ఘంటసాల గారు అద్భుతంగా పాడారు. వియోగబాధని వ్యక్తం చేస్తూ, తన్మయులై పాడారు. రికార్డింగు కాగానే ఆయన్ని అభినందించాలని, పాట పాడిన స్థలానికి వెళ్ళాను. ఆయన అలాగే నించుని వున్నారు, తేరుకోలేదు. అలా చూసేటప్పటికి ముఖంనిండా నీళ్ళు కనిపించాయి- పూర్తిగా చెమటపట్టినట్టు. కాని, కాదు. పాడుతున్నప్పుడు కన్నీళ్ళు ఉబికి బయటకొచ్చి, ముఖమంతా అలుముకున్నాయి! ఆయన్ని అమాంతం కావలించుకున్నాను.**

**"గాయకుడిగా ఆ బాధని అనుభవిస్తూ, ఫీలయిపాడాను. ఆ పాడడంలో కన్నీరు చిలికి వుంటుంది" అన్నారు ఘంటసాల.**

**- ఆర్కే**



# జీవితంలోని ఒక భాగం ఎనర్జీనంతా అన్నయ్యకి వెచ్చించారాయన



- కీరవాణి సోదరుడు

ఐతే... సంగీత దర్శకుడు కళ్యాణి మాలిక్

మా అమ్మగారి పేరు భానుమతి. మా నాన్నగారి పేరు శివదత్త. మేం మొత్తం ఆరుగురు సంతానం, కీరవాణిగారు మా పెద్దన్నయ్య. అందరికీ తనని పెద్దన్న పెద్దన్న అని పిలవటం అలవాటు. ఇప్పుడుకూడా అలాగే పిలుస్తాం. నేను మా కుటుంబంలో ఆఖరివాణ్ణి. అన్నయ్యకి నాకు 11 సంవత్సరాలు తేడా. చాలాకాలం దూరంగానే పెరిగాం అనే చెప్పుకోవాలి. అప్పుడప్పుడు తను సెలవుల్లో రావడం మేం అక్కడికి వెళ్ళడంలాంటి అటాచ్‌మెంట్ తప్ప క్లోజ్‌గా పెరిగాం ఛైల్డ్‌హుడ్ అంతా అని చెప్పుకోవడానికి ఏమీ లేదు.

నేను 7వ క్లాస్ వరకే చదివాను. తర్వాత మెట్రిక్‌లో జాయినై మూడు నాలుగు నెలలు చదివిన తర్వాత ఇంట్రెస్ట్‌పోయి 1986లో నా ఫ్రెండ్ నేను కలిసి మైసూరు పారిపోయాం. మైసూరు అంటే నాకేమీ తెలియదు అపుడు నాకు 13 సంవత్సరాలు. ఆ రోజుల్లో నుంచే సొంతంగా సంపాదించాలి. ఇండిపెండెంట్‌గా బ్రతుకుదామనే ఆశతోటి, నమ్మకంతోటి మేమిద్దరం కలిసి కొవ్వూరునుంచి మైసూరు పారిపోయాం. తీరా అక్కడికి వెళ్ళిన తర్వాత జాబేమీ లేక బిక్కమొహం వేసి ఏమిచేయాలో తెలియక తిరిగి వెనక్కి రావడానికి కూడా డబ్బులు లేక, అక్కడున్న ఫ్రెండ్స్‌ని అడిగి మద్రాసు చేరి - నెమ్మదిగా నేను ఈ స్టేజికి రావడానికి 15 సంవత్సరాలు పట్టింది. ఈ 15 సంవత్సరాల కాలంలో రకరకాలుగా... అంటే గుళ్ళు గోపురాలు తిరగటం, కోరస్ సింగర్‌ని అవటం, తర్వాత అన్నయ్య దగ్గర కాలక్రమేణా అసిస్టెంట్‌గా చేరటం జరిగింది.

నేను కొవ్వూరులో చదువుకుంటున్న రోజుల్లో అన్నయ్య అప్పుడప్పుడు రావడం, తను వచ్చినప్పుడు కలిసి సినిమాలకు వెళ్లడం జరిగేది. తనకు చిన్నప్పటినుంచే అంటే 15 సంవత్సరాలనుంచే స్వరజ్ఞానం వచ్చేసింది. పాటలు వింటూనే స్వరాలు చెప్పేవారు. ఆ రోజుల్లో అన్నయ్య దగ్గర ఒక చిన్న కాసియో ఉండేది. ఎలక్ట్రానిక్ ఐటమ్స్ చూడటం అదే ఫస్టు టైమ్. దానిపైన అన్నయ్య వాయిస్తుంటే చాలా థ్రిల్లింగ్‌గా ఉండేది.

అన్నయ్య అంటే ఒక తెలియని ఎడ్మిరేషన్ అప్పుడే నెమ్మదిగా స్టార్టయింది. కాసియో వాయించడం, పాటలు పాడటం. తను చేసిన ప్రైవేటు ట్యూన్స్ అన్నీ మాకు వినిపించడం చేసేవారన్నయ్య. అవన్నీ విని ఎంజాయ్ చేయడం. ఆ ఎంజాయ్ చేయడంలో తెలియకుండానే ఎటాచ్‌మెంట్ పెరిగిపోయింది. కలిసిపెరిగి ఉంటే జనరల్‌గా అన్నదమ్ముల మధ్య ఒక అనుబంధం ఏర్పడుతుంది. అలా కాకుండా ఎమోషనల్ ఎటాచ్‌మెంట్ స్టార్టెడ్ విత్ మ్యూజిక్ అన్నమాట. రాజమండ్రిలో ఏదైనా సినిమా రిలీజయితే నన్ను సైకిల్‌పైన ఎక్కించుకుని తీసుకెళ్ళడం అన్నీ ఇప్పటికీ గుర్తున్నాయి. ఎంటర్ ది డ్రాగన్ సినిమాకి కష్టపడి... సైకిలెక్కి వెళితే దురదృష్టవశాత్తు ఆరోజే మారిపోయింది ఆ సినిమా. వేరే సినిమా చూసి వచ్చేయడం. ఇవన్నీ తెలియని చిన్న చిన్న అనుభూతులు. ఇవే తన పట్ల ఒక డీప్ అటాచ్‌మెంట్ పెరగడానికి అవకాశం కల్పించాయి. పెద్దన్న ఎప్పుడొస్తాడు మళ్ళీ సెలవులు ఎప్పుడొస్తాయి అనిపించేది. మేం దూరంగా ఉన్నప్పటికీ, ఏజ్ డిఫరెన్స్ ఉన్నప్పటికి కూడా మా మధ్య లోపల అభిమానం ఎక్కువగా పెరిగిపోయింది. ఆరోజు నుంచి ఈరోజు వరకూ ఆయనపట్ల నాకు అదే ఫీలింగ్.

నేను పారిపోయి మద్రాసు చేరినప్పటికే అన్నయ్య చక్రవర్తి గారి వద్ద అసిస్టెంట్‌గా చేస్తున్నారు. అప్పుడు మా టోటల్ ఫ్యామిలీని అన్నయ్యే పోషిస్తుండేవారు. ఆ రోజుల్లో సాంగ్ పేమెంట్ 400/- దాకా వచ్చేది. ఒక సైకిల్ ఉండేది. అసిస్టెంట్‌గా అలా 2 సంవత్సరాలవరకూ... కేవలం ఆ సైకిల్‌ని తొక్కుకుంటూ తిరిగేవారు ఈ రోజు మేం అసిస్టెంట్‌లుగా కార్లు, మోటారు బైకులు కొనుక్కొని ఉన్నాం. ఇప్పుడున్న సిస్టం వేరండి. టోటల్ కుటుంబాన్ని పోషించాలంటే మనలోని కోరికల్ని చంపేసుకుంటేనే గానీ మిగతావారిని పోషించటం జరగదు. అలా తాను అన్నిటిని కంట్రోల్ చేసుకుని మమ్మల్ని పోషించేవారు. ఆల్‌మోస్టు మొన్నటి మొన్నవరకూ ఒక మంచి టేపు రికార్డర్ కూడా లేదు అన్నయ్యకు. టేపు రికార్డర్ కొనుక్కోవాలని ప్రతి ఒక్కరికి ఉంటుంది. ఈ రోజుల్లో ప్రతి హ్యూమన్ బీయింగ్ దగ్గర వాక్‌మెన్‌ని చూస్తున్నాం. మంచి టేప్ రికార్డర్ కొనుక్కుందామంటే.... డబ్బులుంటాయి కాని ఆ డబ్బులు వేరేవాటికి సద్వినియోగం చేస్తూ మా కుటుంబాన్ని పోషిస్తూ కష్టపడి పైకొచ్చిన వ్యక్తి ఆయన. పది పదిహేను మంది అన్నయ్య మీద ఆధారపడ్డాం ఏం చేయకుండా...! ఏం చేయడానికీ చదువుకోలేదు. అన్నయ్యను అడ్మైర్ చేస్తూ అన్నయ్య పైకి ఎదగాలని ఆశలతో బ్రతుకుతూ వచ్చాం. అలా అన్నయ్య రోజూ వెళుతూంటే మేం మధ్యాహ్నం క్యారేజ్

తీసుకెళ్ళేవాళ్ళం. అలాగే అన్నయ్య ఎక్స్‌ట్రా పేమెంట్ తీసుకుంటున్నపుడు మా ఆనందం అంతా ఇంతా కాదు. ఎక్స్‌ట్రా అంటే ఎప్పుడైనా కోరస్ పాడితే ఆ కోరస్‌కు 125/- ఆ రోజుల్లో ఇచ్చేవారు. ఇపుడు 1000/- ఇస్తున్నారు. అలా చాలా స్ట్రగుల్ అయ్యారన్నయ్య. రోజుకో ట్యూన్ నాన్నగారు చేయించేవారు. ఆ ట్యూన్స్ అన్ని పట్టుకొని సైకిల్‌పైన తిరుక్కుంటూ ప్రతి డైరెక్టరూ, ప్రొడ్యూసర్ ఇంటికి వెళ్ళి నాకు ఒక ఛాన్స్ ఇవ్వండి అడగటం అలా చాలా ఏళ్లు చేశారండి. అనుకోకుండా వేటూరిగారు పరిచయం అవడం, చక్రవర్తి గారి దగ్గర అసిస్టెంట్‌గా జాయిన్ అవ్వటం జరిగింది. తను అలా అసిస్టెంట్‌గా ఉంటూ నెమ్మదిగా పరిచయాలు పెంచుకుంటుంటే ఫస్టు అవకాశం ఉషాకిరణ్ మూవీస్‌వారి ద్వారా రావడం జరిగింది. అదృష్టం కూడా కలిసివచ్చి తన టాలెంట్‌ను కూడా నిరూపించుకునే అవకాశం వచ్చింది కాబట్టి గ్రేట్ మ్యూజిషియన్‌గా, గ్రేట్ మ్యూజిక్ డైరెక్టర్‌గా పేరు సంపాదించుకునే అవకాశం వచ్చింది.

**◆ మ్యూజిక్ డైరెక్టర్ అయ్యాక ఆయనలో వచ్చిన మార్పు ఏమిటి?**

గతంలో మాకు తెలిసిన అన్నయ్య- చిన్నప్పుడు అప్పుడప్పుడు కొవ్వూరు వచ్చిన అన్నయ్య- ఎట్లా ఉన్నారో మ్యూజిక్ డైరెక్టర్‌గా మారిన తర్వాత ఈ రోజుకు కూడా అట్లాగే ఉన్నారు. 142 సినిమాలు చేసినా ఈరోజు వరకూ మెంటాలిటీలో ఏ మార్పు- నేను ఇప్పటివరకూ గమనించలేదు. అదే సాఫ్ట్ నేచర్... మాతో ఎలా ఉంటారో బయట ప్రొడ్యూసర్స్‌తో, డైరెక్టర్స్‌తో అలానే ఉంటారు. ఒక డైరెక్టర్‌కి ఎంత విలువ ఇవ్వాలో, ఒక ప్రొడ్యూసర్‌కి ఎంత విలువ ఇవ్వాలో అన్న విషయానికి అన్నయ్య ఓ పరాకాష్ట... ప్రాణం పెట్టేస్తారు. ఒక సినిమా ఒప్పుకున్నారంటే అది రిలీజయ్యేవరకు వారితో తెలియకుండానే ఎటాచ్‌మెంట్స్ పెంచేసుకుంటారు. వాళ్ళు ఎప్పుడొచ్చినా సరే బాగా మాట్లాడుతారు. సినిమా ఫ్లాపయితే ఎక్కువ బాధపడతారు. అంటే తన మ్యూజిక్ వల్ల ఫ్లాప్ కాకపోయినా వాళ్ళు నష్టపోయినారేమోనన్న తత్వం ఎక్కువన్నమాట.



**◆ కొన్ని కొన్ని సినిమాలు చేస్తున్నపుడు ఇంట్లో ఆయన రియాక్షన్, ప్రవర్తన ఎలావుంటుంది?**

జనరల్‌గా ఏ టెక్నిషియన్ అయినా రకరకాల స్ట్రెయిన్స్‌కి గురవ్వాల్సి ఉంటుంది. ఆ ప్రెషర్స్ తెలియకుండానే మనలో బి.పి.ని పెంచేస్తుంటాయి. ఆ బి.పి.ని అంతా మనకు తెలియకుండానే మన అసిస్టెంట్స్ మీద తీర్చుకోవడం జరుగుతుంది. ఈ విషయంలో అన్నయ్య డిఫరెంట్... నేను అసిస్టెంట్‌గా చేరినప్పటినుంచి గమనించింది ఏమిటంటే- ఎన్ని అవాంతరాలు వచ్చినా, ప్రాబ్లమ్స్ ఉన్నా అసిస్టెంట్స్ మీద తీసుకునేది నేను ఎరుగను. నేను బాగా క్లోజ్. తమ్ముణ్ణే కదా అని నన్ను తిట్టిపడేద్దాం అనేది ఇప్పటికి కూడా ఎరుగను. తను ఎంత భయంకరమైన స్ట్రెయిన్‌కు గురైనా స్టూడియోకు వచ్చారంటే తను వేరే మనిషి. ఈరోజు ఏ పాట రికార్డు చేస్తున్నాం అనే... అంతే కాని తన ప్రెషర్ అసిస్టెంట్ మీద కాని ఇతరుల మీద కాని చూపరు. ఆర్కెస్ట్రా ఎవరన్నా తప్పుగా వాయిస్తే ఆ బి.పి.ని వారిమీద చూపించడం అన్నది ఈరోజు వరకూ నేను చూడలేదు.

**◆ మంచి ట్యూన్ ఫైనలైజ్ అయిన తర్వాత ఆయన ఎలా రియాక్ట్ అవుతారు?**

అన్నయ్య టేస్టు వేరండి... బయట తను చేసిన పాటలు వేరండి. అన్నయ్య మెలోడీస్ ఎక్కువగా ఇష్టపడ్తారు. ఆ డెవలప్‌మెంట్ ఎలా వచ్చిందంటే బినాకా గీత్‌మాలా అనే కార్యక్రమం బుధవారం రేడియోలో వింటూ... ఆ పాటలు లైక్‌చేస్తూ.... ఆరోజుల్లో ఎలాంటి పాటలు వచ్చాయెా మీకు తెలును. అవే జీర్ణించేకుపోయి ఉంటాయి తెలియకుండా! వెస్ట్రన్‌పాటలు వినడం, లేకుంటే తెలుగులో మంచి పాటలు ఎస్.రాజేశ్వరారావుగారివి, మహదేవన్‌గారివి వినడం.. అటువంటి టైపు మ్యూజిక్ అన్నయ్యకిష్టం. ఒక క్రియేటర్ దేన్నైతే ఇష్టపడుతున్నాడో అదే క్రియేట్ చేయడానికి ఇష్టపడతాడు. తను ఏదైతే ఇష్టపడుతున్నాడో ఆ మ్యూజిక్‌ని తక్కువగా చేశారని చెప్పుకొవాలి. ఈ 142 సినిమాలలో కూడా తనకు నచ్చిన పాటలు బహుశా చాలా తక్కువ ఉండి ఉంటాయి. అన్నీ డైరెక్టర్స్ ఇష్టానుసారంగా చేశారు. అవి హిట్ అయిఉండవచ్చు సక్సెస్ ఈజ్ డిఫరెంట్. పర్సనల్ టేస్ట్ ఈజ్ డిఫరెంట్. ఇప్పటికి 1000 పైగా పాటలు చేసి ఉంటారు. అందులో తనకు ఇష్టమైన, ఎప్పుడూ వినే పాటలు బహుశా ఒక 100 వరకూ ఉంటాయనుకుంటాను.

ఒక పాట ఫైనలైజ్ అయిన తర్వాత తన రియాక్షన్ ఎలావుంటుందంటే... ఒక సిట్టింగ్‌లో సునాయాసంగా ఒక్కొక్క సిట్యుయేషన్‌కి ఏడెనిమిది పాటలు చేసే తీరుతారు. దాంట్లో మంచివి ఉంటాయి మనకు నచ్చినవి కూడా ఉంటాయి. జనరల్‌గా నాలాంటి వాడికైతే మూడు రోజులు కూర్చుంటే ఓ ట్యూన్ తడుతుందేమో... తనకు అలా కాదు... డ్యామ్ తెరిస్తే వాటర్ ఎలా వస్తుందో... కూర్చుంటే ట్యూన్‌ల మీద ట్యూన్‌లు అనంతంగా కడుతూనే ఉంటారు. ఎవరైనా డైరెక్టర్ ఒక ట్యూన్ ఓకే చేస్తే దానికి థ్రిల్ ఫీలవ్వరు. ఈరోజు ట్యూన్ ఓకే అయిపోయింది నెక్స్ట్ ట్యూన్ ఏంటి అన్నది తప్ప ఎగిరి గంతేసేంత సీన్ వుండదండి.

**◆ అన్నమయ్య సినిమా మ్యూజిక్ గురించి అందరూ పొగుడుతుంటే ఆయన ఫీలింగ్ ఎలా వుండేది?**

ఇప్పటికీ అన్నమయ్యని తలచుకున్నప్పుడల్లా చాలా థ్రిల్‌గా ఫీలవుత్యాం. చాలా కష్టతరమైన ప్రాజెక్టు అది. బహుశా అన్నమయ్యలాంటిది ఇంకోటొస్తే చేయగలుగుతామో లేదో ఎందుకంటే ఆమూడ్స్ ఉంటాయెా లేదో తెలియదుమనకు. జీవితంలోని ఒక భాగం ఎనర్జీ అంతా అన్నమయ్యకి పెట్టేశారు! ఆరోజుల్లో రీ-రికార్డింగ్ తొమ్మిది పది రోజులు పట్టింది. ముఖ్యంగా చెప్పాలంటే క్లైమాక్స్ బిట్. దట్ క్లైమాక్స్ బిట్ ఈజ్ నాట్ రీ రికార్డెడ్ ఇట్స్ ప్రీ రికార్డెడ్. ఒక సాంగ్‌ని సిట్యుయేషన్ అనుకుని ఎలా చేస్తామో అలా అనుకుని చేసిన ఒకానొక గ్రేట్ క్రియేషన్ అది. అందులో నాగార్జునగారి డైలాగ్స్ వస్తుంటాయి మ్యూజిక్ బీజియమ్స్ వస్తుంటాయి, బాలుగారు... అంటే వెంకటేశ్వరస్వామివారి వాయిస్ వస్తుంటుంది, మధ్యలో పాటల బిట్‌లు, భానుప్రియ, శ్రీకన్య వాయిస్‌లు ఇవన్నీ క్లిక్ ట్రాక్ వేసుకుంటూ (క్లిక్‌ట్రాక్ అంటే ఒక బార్ అన్నమాట) సీన్ చేసి ఇవ్వాలి. ఈ సెకన్‌లో ఈ సీన్ వస్తుంది. లేకపోతే ఈ డైలాగ్ వస్తుంది అని రాఘవేంద్రరావుగారు చెప్పటం. అదంతా ఎలా చేయాలన్నది అనుకోడానికి చాలా ఎక్కువ టైమ్ పట్టింది, చాలా ఎనర్జీ తీసుకుంది కూడా.

**◆ ఆ ఒక్క క్లైమాక్స్ రీ రికార్డింగ్‌కి టైమ్ ఎంత పట్టింది?**

ఎప్పుడైనా ఎక్జిక్యూషన్ చాలా ఈజీ. దాన్ని కంపోజ్ ఎలా చేద్దాం... ఆ లెన్త్‌ను ఎలా చెయాలి అన్నదాన్ని ప్లాన్‌చేయడానికి టూ త్రీ డేస్ పట్టింది. ఆ టూ త్రీ డేస్ మధ్యలో బాలుగారు వచ్చి మాకు హెల్ప్ చేశారు. అంటే అక్కడ ఆయన కూర్చుని ఎలా ఎలా డైలాగ్ వస్తుందో అలా ఆయన అంటూ చెప్తుంటే సెకన్‌లచొప్పున కౌంట్‌చేసేవాళ్ళం. దాన్ని బట్టి ఎన్నిబార్లు వేయాలి అన్నది ఫిక్సుచేశాం. ఇలా మొత్తం క్యాలిక్యులేట్ చేసుకుంటూ పక్కాగా ప్లాన్‌చేసి ఎటువంటి మిస్టేక్స్ లేకుండా బాగా ఎక్జిక్యూట్‌చేశాం. దాంట్లో అన్నయ్య గొప్పతనం వెయ్యిరెట్లు కనబడుతుంది. మొత్తం తన జీవిత చరిత్ర అంతా ఒక ఎత్తైతే అన్నమయ్య క్లైమాక్స్ రికార్డ్ చేయడం అన్నది మహాగొప్ప. చాలా గ్రేట్.

◆ ఆ మధ్య కొంత గ్యాప్ వచ్చింది అపుడు ఆయన ఎలా ఫీలయ్యేవారు?

మహాబోరుకొడుతూ ఉండేది. అదే లాస్ట్‌కాదని తెలుసు కానీ అది ఎప్పుడైపోతుంది!? ఆ పీరియడ్ ఎంత టార్చరంటే... 10 సంవత్సరాలపాటు రాత్రిపగలు కంటిన్యూగా పనిచేసిన వ్యక్తి ఇంట్లో కూర్చో వలసి రావటం కన్నా నరకం ఇంకోటి లేదు. చచ్చిపోయినా పర్వాలేదు కానీ ప్రొఫెషన్ నుంచి దూరంగా ఉండడం అన్నది అది ఏ ఆర్టిస్టుకు గానీ, శత్రువుకు గానీ, వర్క్‌చేసేవారికెవ్వరికి రాకూడదు. వర్క్‌చేసుకునేవాడు హాయిగా వర్క్ చేసుకుంటూ ఉండాలి తర్వాత నెక్స్ట్ స్టెప్ ఏంటి అంటే చచ్చిపోవడమే అంతే! ప్రత్యేకంగా మనం చచ్చిపోయి నరకానికి వెళ్ళక్కర్లేదు. ఇంట్లో కూర్చోవాల్సి రావడం కన్నా టార్చర్ ఇంకోటి లేదు. ఆ డిప్రెషన్స్‌ని తట్టుకుంటూ మళ్ళీ నార్మల్ వ్యక్తి అవడానికి ఎంతో ఎనర్జీ కావాలి. ఎంతో విల్‌పవర్‌కావాలి. అన్నయ్యకి ఆ విల్‌పవర్ ఎక్కువండి దానికి అయన ఆధ్యాత్మిక ప్రవృత్తి కూడా తోడయింది.

◆ ఆయన ఆధ్యాత్మిక ప్రవృత్తి ఎలా వుంటుందో చెప్తారా...?

ఆయన ఆధ్యాత్మిక ప్రవృత్తంటే చాలా నిష్టగా ఉండారండీ. గ్రాడ్యుయల్‌గా ఇపుడు తనని తాను తగ్గించుకున్నారు కానీ గతంలో అయితే మార్నింగ్ 3గంIIలేచి పూజలు చేసేకుంటూండేవారు. పూజాకార్యక్రమం అంటే 5 నిమిషాలు దణ్ణం పెట్టుకోవడం కాదు. రెండేసి గంటలు రెండున్నర గంటలు చెమటలతోటి దీపారాధన..... అలా అమ్మ తను కలిసి నిత్యం పూజలు చేస్తుంటారు. మధుర మీనాక్షి తల్లి అంటే తనకి చాలా ఇష్టం. సంవత్సరానికి ఒక్కసారైనా మధుర మీనాక్షి తల్లిని దర్శించుకుని వస్తారు. అలాగే అయ్యప్ప మాలను వేసుకున్నారు. శివదీక్షకూడా... వన్ ఇయర్ భార్యాబిడ్డలకు దూరంగా ఉంటూ చేశారు. ఆ దీక్షలో తనకి అప్పుడు పుట్టిన తన ఫస్టు కొడుకు ఎలా ఉన్నాడో కూడా తెలియదు అంతటి తపోనిష్ట తనది. చాలా గ్రేట్ ఆ విషయంలో.

అన్నయ్య ఒక గొప్ప మ్యూజిక్ డైరెక్టర్‌గా అందరికీ తెలుసు. కానీ ఒక గొప్ప వ్యక్తిగా కొందరికే తెలుసు. వారిలో నేనొకణ్ణి కావటం నా అదృష్టం.

| నెం. | సినిమాపేరు | |
|---|---|---|
| 1. | మనసు మమత | తెలుగు |
| 2. | దాగుడుమూతల దాంపత్యం | తెలుగు |
| 3. | సీతారామయ్యగారి మనవరాలు | తెలుగు |
| 4. | అమ్మ | తెలుగు |
| 5. | పీపుల్స్ ఎన్ కౌంటర్ | తెలుగు |
| 6. | ఆత్మ బంధం | తెలుగు |
| 7. | అశ్విని | తెలుగు |
| 8. | పల్లెటూరి పెళ్ళాం | తెలుగు |
| 9. | అళగన్ | తమిళం |
| 10. | ముగ్గురు అత్తల ముద్దుల అల్లుడు | తెలుగు |
| 11. | నీపాది నాన్ పాది | తమిళం |
| 12. | క్షణ క్షణం | తెలుగు |
| 13. | గంగ | తెలుగు |
| 14. | జీవన చదరంగం | తెలుగు |
| 15. | నీలగిరి | మళయాళం |
| 16. | పాట్టొండ్రు కేట్టేన్ | తమిళం |
| 17. | అత్తింట్లో అద్దెమొగుడు | తెలుగు |
| 18. | సమర్పణ | తెలుగు |
| 19. | అల్లరి మొగుడు | తెలుగు |
| 20. | మొండి మొగుడు పెంకి పెళ్ళాం | తెలుగు |
| 21. | అగ్రిమెంట్ | తెలుగు |
| 22. | సివన్‌ద మలర్ | తమిళం |
| 23. | సూర్య మానసం | మళయాళం |
| 24. | ఘరానా మొగుడు | తెలుగు |
| 25. | ఆదర్శం | తెలుగు |
| 26. | సాహసం | తెలుగు |
| 27. | తేజ | తెలుగు |
| 28. | వానమే ఎల్లై | తమిళం |
| 29. | సేవగన్ | తమిళం |
| 30. | వసుంధర | తెలుగు |
| 31. | హలో డార్లింగ్ | తెలుగు |
| 32. | అంతం | తెలుగు |
| 33. | సుందరకాండ | తెలుగు |
| 34. | ఎస్.పి.తేజ | తెలుగు |
| 35. | ఆపద్బాంధవుడు | తెలుగు |
| 36. | ప్రెసిడెంటు గారి పెళ్ళాం | తెలుగు |
| 37. | లారీ | తెలుగు |
| 38. | జాది మల్లి | తమిళం |
| 39. | రాజేశ్వరీ కల్యాణం | తెలుగు |
| 40. | జీవితమే ఒక సినిమా | తెలుగు |
| 41. | రక్షణ | తెలుగు |
| 42. | అల్లరి ప్రియుడు | తెలుగు |
| 43. | రెండిళ్ళ పూజారి | తెలుగు |
| 44. | ప్రతాప్ | తమిళం |
| 45. | మేజర్ చంద్రకాంత్ | తెలుగు |
| 46. | ప్రేమే నాప్రాణం | తెలుగు |
| 47. | వారసుడు | తెలుగు |
| 48. | మనీ | తెలుగు |
| 49. | అళిమయ | కన్నడం |
| 50. | మిస్టర్ పెళ్ళాం | తెలుగు |

| నెం. | సినిమాపేరు | |
|---|---|---|
| 51. | శభాష్ రాము | తెలుగు |
| 52. | అబ్బాయి గారు | తెలుగు |
| 53. | అల్లరి అల్లుడు | తెలుగు |
| 54. | మాతృదేవోభవ | తెలుగు |
| 55. | రౌడీ మొగుడు | తెలుగు |
| 56. | చిన్నల్లుడు | తెలుగు |
| 57. | అంగరక్షకుడు | తెలుగు |
| 58. | స్వాతి | కన్నడం |
| 59. | పెళ్లికొడుకు | తెలుగు |
| 60. | అన్న | తెలుగు |
| 61. | ఘరానా అల్లుడు | తెలుగు |
| 62. | అల్లరి ప్రేమికుడు | తెలుగు |
| 63. | ఎస్.పి.పరశురామ్ | తెలుగు |
| 64. | కిష్కింద కాండ | తెలుగు |
| 65. | బాయ్‌ఫ్రెండ్ | తెలుగు |
| 66. | ఎస్ నేనంటేనేనే | తెలుగు |
| 67. | పుట్టినిల్లా మెట్టినిల్లా | తెలుగు |
| 68. | గాండీవం | తెలుగు |
| 69. | ముద్దుల ప్రియుడు | తెలుగు |
| 70. | హీరో | తమిళం |
| 71. | బొబ్బిలి సింహం | తెలుగు |
| 72. | ఆవేశం | తెలుగు |
| 73. | ఏయ్ హీరో (ఘరానా మొగుడు) | మళయాళం |
| 74. | క్రిమినల్ | తెలుగు |
| 75. | తీర్పు | తెలుగు |
| 76. | భైరవ | కన్నడం |
| 77. | లేడీ బాస్ | తెలుగు |
| 78. | ఘరానా బుల్లోడు | తెలుగు |
| 79. | శుభ సంకల్పం | తెలుగు |
| 80. | పాతబస్తీ | తెలుగు |
| 81. | డియర్ బ్రదర్ | తెలుగు |
| 82. | బాలరాజు బంగారుపెళ్ళాం | తెలుగు |
| 83. | రియల్ హీరో | తెలుగు |
| 84. | క్రిమినల్ | హిందీ |
| 85. | రాంబంటు | తెలుగు |
| 86. | మౌనం | తెలుగు |
| 87. | అప్పాజీ | కన్నడం |
| 88. | పెళ్ళి సందడి | తెలుగు |
| 89. | సాహసవీరుడు సాగరకన్య | తెలుగు |
| 90. | కర్ణాటక సుపుత్ర | కన్నడం |
| 91. | దేవరాగం | మళయాళం |
| 92. | ఇస్ రాతకీ సుభానహీ | హిందీ |
| 93. | రాయుడుగారు నాయుడుగారు | తెలుగు |
| 94. | బొంబాయి ప్రియుడు | తెలుగు |
| 95. | గాయ | కన్నడం |
| 96. | అదిరింది అల్లుడు | తెలుగు |
| 97. | జాబిలమ్మ పెళ్ళి | తెలుగు |
| 98. | పవిత్ర బంధం | తెలుగు |
| 99. | అర్ధాంగి | తెలుగు |

| నెం. | సినిమాపేరు | |
|---|---|---|
| 100. | సూర్యపుత్రులు | తెలుగు |
| 101. | ప్రియరాగాలు | తెలుగు |
| 102. | అరుంధతి | తెలుగు |
| 103. | అన్నమయ్య | తెలుగు |
| 104. | గీ/ల వి.వరప్రసాద్ | తెలుగు |
| 105. | శుభముహూర్తం | తెలుగు |
| 106. | ఓసి నామరదల | తెలుగు |
| 107. | పరదేశి | తెలుగు |
| 108. | కొండాట్టం | తమిళం |
| 109. | రాజహంస | తెలుగు |
| 110. | సుబ్బరాజు గారి కుటుంబం | తెలుగు |
| 111. | పండగ | తెలుగు |
| 112. | శ్రీసీతారాముల కల్యాణము చూతము రారండి | తెలుగు |
| 113. | పెళ్ళికానుక | తెలుగు |
| 114. | జఖ్మ్ | హిందీ |
| 115. | విచిత్రం | తెలుగు |
| 116. | సీతారామరాజు | తెలుగు |
| 117. | అల్లుడుగారొచ్చారు | తెలుగు |
| 118. | మెకానిక్ మామయ్య | తెలుగు |
| 119. | రాఘవయ్యగారి అబ్బాయి | తెలుగు |
| 120. | హిందుస్తాన్ | తెలుగు |
| 121. | దీపావళి | కన్నడం |
| 122. | చూసొద్దాం రండి | తెలుగు |
| 123. | బావనచ్చాడు | తెలుగు |
| 124. | ఆకాశవీధిలో | తెలుగు |
| 125. | స్టూడెంట్ నెం1 | తెలుగు |
| 126. | అమ్మ | కన్నడం |
| 127. | సుందర కాండ | కన్నడం |
| 128. | జమిందార్రు | కన్నడం |
| 129. | లాహిరి లాహిరి లాహిరిలో | తెలుగు |
| 130. | సాహస బాలుడు విచిత్రకోతి | తెలుగు |
| 131. | తప్పచేసి పప్పు కూడు | తెలుగు |
| 132. | పరదేశి | తమిళం |
| 133. | సుర్ | హిందీ |
| 134. | ఒకటో నెంబరు కుర్రాడు | తెలుగు |
| 135. | పిలిస్తే పలుకుతా | తెలుగు |
| 136. | యువరత్న | తెలుగు |
| 137. | ఎవరే అతగాడు | తెలుగు |
| 138. | ఈఅబ్బాయి చాలా మంచోడు | తెలుగు |
| 139. | జఖ్మ్ | హిందీ |
| 140. | స్టూడెంట్ నెం1 | తమిళం |
| 141. | గంగోత్రి | తెలుగు |
| 142. | సింహాద్రి | తెలుగు |

**"ఈ జులై నాలుగుకి నాకు 42 ఏళ్లు పూర్తవుతాయి. ఆరోజుకి నేను మ్యూజిక్ చెయ్యగా రిలీజయ్యే సినిమాల సంఖ్య 142. భలేగా కోయిన్‌సైడ్ అయింది కదూ" అన్నారు కీరవాణి ఈ లిస్ట్ చూసి.**

జులై 11 మణిశర్మ పుట్టినరోజును పురస్కరించుకొని జరిపిన ఇష్టాగోష్ఠిలో ఆర్పీ పట్నాయక్ అభిప్రాయాలివి:

# 'మణిగారి ఇన్‌స్ట్రుమెంటేషన్ మన తెలుగులో వన్ ఆఫ్ ది బెస్ట్'

## -ఆర్పీ పట్నాయక్



'చిత్రం' సినిమా ఆడియో రిలీజయిన తర్వాత "చాలా బాగుంది హిట్టయింది" అని అందరూ అంటుంటే ఆ టైమ్‌లో మణిశర్మగారు మద్రాసు నుంచి నా నంబరు కనుక్కోవడానికి నాలుగైదు ఎస్టీడీ ఫోన్‌లు చేసి, నా నంబరు కనుక్కొని ఫోన్ చేసి 'చాలా డిఫరెంట్‌గా ఉంది. కీపిటప్' అని విష్ చేశారు. అది ఆయన సంస్కారానికి ఉదాహరణ మాత్రమే. ఫస్టు ఆ విషెస్సే బహుశా ఈ రోజు నేను ఈ స్టేజికి రావడానికి హెల్ప్ చేశాయనుకుంటాను. ఒక మ్యూజిక్ డైరెక్టర్... అదికూడా నెంబరువన్ స్టేజిలో ఉన్న మ్యూజిక్ డైరెక్టర్... అలా విష్ చేయటం చాలా ఎక్సైట్‌మెంట్.

ఆ తర్వాత మణిగారిని పర్సనల్‌గా కలిశాను. ఇద్దరం చాలాసార్లు కలిసి ఫ్రెండ్లీగా సరదాగా మాట్లాడుకున్నాం. ఒకరోజు 'సుబ్బు' సినిమాకి ఒక పాట పాడమని నన్ను అడిగారు. ఆ పాట ఆయనే దగ్గరుండి నా వాయిస్ అంతా రికార్డు చేయించుకుని హేపీ అయిన తర్వాత 'బాగుంది పాట చాలా బాగా వచ్చింది' అన్నారు.

అక్కణ్ణించి మా ఇద్దరి రిలేషన్‌షిప్ ఫ్రెండ్లీగా కంటిన్యూ అవుతూనే ఉంది. 'ఇంద్ర' సినిమా నిర్మాణంలో ఉండగా... ఆయన ఆస్ట్రేలియాలో ఉన్నటైమ్‌లో సడన్‌గా హీరో హీరోయిన్స్ డేట్స్ అడ్జస్ట్ అవడంతో అర్జంటుగా ఓ పాట అవసరమయింది. ఆయన ఆస్ట్రేలియా నుంచి వచ్చి రికార్డ్ చేసేటంత టైమ్ లేదు ఇమ్మీడియట్‌గా పాట కావాలి, 'ఏం చేద్దాం' అని దత్తుగారు ఫోన్‌చేసి అడిగితే- 'వచ్చేయమంటారా' అని మణిగారు అడిగారు.

'మీరు వస్తే రికార్డ్ చేసేటంత టైమ్ కూడా లేదు ఏం చేద్దాం... ఆ ఒక్కపాట వేరేవారితో చేయిద్దామా' అని ఒకరితోఒకరు అనుకున్నారు. 'ఆర్.పి. అయితే నాకు ఓకే' అని మణిగారు కండిషన్ పెట్టారు. అది ఆయనకు నామీదున్న అభిమానానికి ఒక ఉదాహరణ. అపుడు గోపాల్‌గారితో 'అల్లరి రాముడు' సిట్టింగ్ జరుగుతోంది. గోపాల్ గారు, దత్తుగారు కలిసి ఆ సిట్టింగ్‌నే ఇంద్ర సిట్టింగ్‌గా చేసి కూర్చుని నా ట్యూన్‌ని ఓకే చేసుకోవడం, వెంటనే నేను రికార్డుచేసి ఇచ్చేయడం కూడా జరిగింది. స్విట్జర్లాండ్ వెళ్ళి ఆ పాట షూట్ చేశారు.

**పాట బయటకు వచ్చిన తర్వాత ఆయన రియాక్షన్ ఏంటి? మీరైతే ఓకే అని ఆయన**



**అన్నారంటే అది మీ మీద అభిమానంతో కావచ్చు. కానీ ఆయన తన పిక్చర్‌కంటూ ఒక స్టాండర్డ్‌ను ఊహించుకొని ఉంటారు కదా? ఆయన మిగిలిన పాటల స్థాయి వేరు ఈ పాట స్థాయి వేరు అన్న ఫీలింగ్ కాని... లేదా.... ఆ రెండూ మ్యాచ్ అయ్యాయి అన్న ఫీలింగ్ కాని ఆయనకు వచ్చిందా?**

స్థాయి అంటే... ఇన్‌స్ట్రుమెంటేషన్ పరంగా చూస్తే ఆయన ఇన్‌స్ట్రుమెంటేషన్ కొంచెం రిచ్‌గా ఉంటుంది. ఆ రిచ్‌నెస్ ఏదైతే ఉందో డెఫినెట్‌గా అది నేను చేసిన పాటలో కూడా ఉంది. క్యాసెట్ విన్నప్పుడు డెఫినెట్‌గా ఆ ఫీలింగ్ వస్తుంది. అంటే నా పేరు చెప్పకపోతే ఇది మణిగారే చేశారా అనే ఫీలింగ్ వచ్చేటట్టు చేశాను.

**అలా రావడానికి మీరు ఆయన్ని దృష్టిలో పెట్టుకొని ఆ ఇన్‌స్ట్రుమెంటేషన్ ని చేశారా?**

కొంతవరకు ఆయన్ని దృష్టిలో పెట్టుకునే చేశాను. ఎందుకంటే ఈ పాట ఆయన క్యాసెట్ ఫ్యామిలీలో ఉండాలి. ట్యూన్ వరకు నా స్టైల్లో చేసినా ఇన్‌స్ట్రుమెంటేషన్ స్టైల్ అంతా ఆయన్ని దృష్టిలో పెట్టుకుని చేసిందే. ఎందుకంటే మణిగారి ఇన్‌స్ట్రుమెంటేషన్ మన తెలుగులో వన్ ఆఫ్ ది బెస్ట్ ఇన్‌స్ట్రుమెంటేషన్ అని నా ఫీలింగ్.

**ఆ పాట విన్న తర్వాత ఆయన ఎక్స్‌ప్రెషన్స్ ఏమిటి? తర్వాత మీతో ఏమైనా మాట్లాడారా?**

నేను, ఆయనా బిజీగా ఉండటం వల్ల కలవలేదు. ఓసారి ఇద్దరం ఆయన బర్త్‌డే పార్టీలో కలిసాం. అంతే!

**సరే... ఆయన పాటల మీద మీ అభిప్రాయం చెప్తారా?**

'మనసిచ్చిచూడు' ఆయన ఫస్టు నాన్ స్టారర్ మ్యూజికల్ హిట్ ఫిల్మ్. ఆయన చేసినవన్నీ మ్యూజికల్ హిట్సే. కాని స్టార్ అనే పదం లేకుండా హిట్ కొట్టిన ఆడియో అది. ఆ సినిమా హిట్ కి ఆ ఆడియో 50% హెల్ప్అయింది. ఎడిటర్ మోహన్‌గారు తీసిన సినిమా అది.

ఆ తర్వాత గుణశేఖర్‌గారి కాంబినేషన్‌లో ఆయన చేసినవన్నీ సూపర్ హిట్సే. చూడాలనివుంది కాని, ఒక్కడు కాని, అలాగే కృష్ణవంశీగారితో మురారి కానీ.... స్పెషల్లీ నాకు యమహా నగరి కలకత్తా పురి, భం భం భోలే పాటలు చాలా ఇష్టమయిన పాటలు. మిగతా పాటలు కూడా యువతని ఉరకలెత్తించే రకంగా

థియేటర్లో అందరూ డ్యాన్స్ ఆడే టైపులో ఉంటాయి. 'ఆది' లోని 'నీ నవ్వుల తెల్లదనాన్ని నాగమల్లి అప్పడిగింది' అనండి. మెలోడీస్ వచ్చేసరికి రావోయి చందమామలోని 'స్వప్న వేణువేదో' పాట అనండి... ఇలా చెప్పుకుంటూపోతే చాలా ఉన్నాయి ఆయన సూపర్ హిట్స్.

ఇన్‌స్ట్రుమెంటేషన్‌లో ఆయన్ని అనుకరించాను అని అన్నారు. అది చాలా రిచ్‌గా ఉంటుంది అని అన్నారు. **మీ అబ్జర్వేషన్‌లో ఆ రిచ్‌గా ఉండేది ఏమిటో చెప్తారా?**

రిథమ్ చాలా హెవీగా ఉంటుంది.

**అయన రిథమ్‌తో ఎప్పుడూ డామినేట్ చేయలేదే?**

అంటే ఆయన రిథమ్ చాలా పంచ్‌తో ఉంటుంది. అది ఇంపార్టెంట్ కూడా. ఆయన చేసినవి ఎక్కువగా కమర్షియల్ హీరో సినిమాలు, కమర్షియల్ సాంగ్స్ కాబట్టి రిథమ్ ఆ పంచ్‌తో ఉండాలి. అందుకే ఆయన మ్యూజిక్‌లో ఆ పంచ్ ఉంటుంది అని నా అభిప్రాయం. ముందునుంచి ఆయన మ్యుజిషియన్ అవ్వడం వల్ల ఆ సీక్రెట్స్ అన్నీ ఆయనకి తెలుసు.

**మీరు అబ్జర్‌చేసినటువంటి ఆ సీక్రెట్స్‌ని మీ మ్యూజిక్‌లో పెట్టుకునే ప్రయత్నాలు చెయ్యట్లేదా?**

ఆయన్ని అనుకరిస్తే నా మ్యూజిక్ కూడా అంత రిచ్‌గా వస్తుంది. కానీ నా స్టైల్‌లో నేను చేస్తేనే నాకు ఒరిజినాలిటి ఉంటుందని చేయట్లేదు.

**అంటే అది ఎలా ఉంటుందంటారు?**

చెప్పానుగా మంచి పంచ్ ఉంటుంది రిథమ్‌లో, అదీగాక ఇన్‌స్ట్రుమెంటేషన్‌లో కూడా ఎన్ని లేయర్లు వేసినా, ఎన్ని ట్రాక్స్ వేసినా నీట్‌గా ఉంటుంది.

**లేయర్స్, ట్రాక్స్ అంటే అవి ఎలా ఉంటాయి?**

ఒక్కొక ట్రాక్‌లో ఒక్కొక సౌండ్ ఉంటుంది. లేయర్స్ అంటే ఒక్కొక సౌండ్‌కి ప్యారలల్‌గా... ఇపుడు బేసిక్ కార్డ్ ఒక లేయర్. మెలోడి మీద ఇంకో మెలోడి... దానికి సపోర్టింగ్ కౌంటర్ మెలోడీస్... ఇలా ఒక్కొక్కటి ఒక్కొక్క లేయర్ కింద ఉంటాయి. అలా ఎన్ని లేయర్లు వేసినా డిస్టర్బింగ్‌గా ఉండదు.

**ఆయన ఎంత ఫాస్ట్‌గా చేసినా బేసిక్‌గా ఓ రాగంలో చేస్తారు. అది మీ అబ్జర్వేషన్‌లో ఉందా?**

నాకు రాగాల గురించి తెలియదు. నేను చేసేది ఏ రాగమో కూడా తెలియదు. అలాంటిది వేరేవాళ్ళు చేసే రాగాల గురించి ఎలా తెలుస్తుంది.?

**ఆయన మ్యూజిక్ డైరెక్షన్‌లో మీరు పాడిన పాట గురించి కొంచెం వివరంగా చెప్పండి?**

మణిగారు పాడటానికి పిలిచిన టైమ్‌లో నేను ఫ్యామిలీతో తిరుపతి వెళ్ళాను. అక్కడకి

## మణిశర్మ సినిమాలు:

1. సూపర్ హీరోస్
2. రాత్ (హిందీ)
3. బావగారూ... బాగున్నారా
4. గణేష్
5. చూడాలనివుంది
6. మనసిచ్చిచూడు
7. సమరసింహారెడ్డి
8. నేటి గాంధి
9. ఇంగ్లీషు పెళ్ళాం- ఈస్టు గోదావరి మొగుడు
10. రాజకుమారుడు
11. రావోయి చందమామ
12. అనగనగా ఒక అమ్మాయి
13. కౌరవుడు
14. ఇద్దరుమిత్రులు
15. మనోహరం
16. యువరాజు
17. రాయలసీమ రామన్న చౌదరి
18. ఆజాద్
19. వంశీ
20. అన్నయ్య
21. శీను
22. చిరునవ్వుతో
23. దేవీపుత్రుడు
24. మృగరాజు
25. నరసింహనాయుడు
26. ఖుషి
27. మురారి
28. భలేవాడివి బాసూ
29. ప్రేమతో రా
30. షాజహాన్ (తమిళ్)
31. చెప్పాలనివుంది
32. యూత్ (తమిళ్)
33. నరసింహ (తమిళ్)
34. సుబ్బు
35. ప్రియదర్శిని
36. జోరుగా హుషారుగా
37. టక్కరిదొంగ
38. సీమసింహం
39. రూపాయి
40. ఎలుమలై (తమిళ్)
41. ప్రేమకే సే (కన్నడ)
42. శివాని
43. ఆశై ఆశై (తమిళ్)
44. అల్లావుద్దీన్ (తమిళ్)
45. ఆది
46. ఇంద్ర
47. చెన్నకేశవరెడ్డి
48. బాబీ
49. పెళ్ళాం ఊరెళితే
50. ఒక్కడు
51. అరసు (తమిళ్)
52. రాఘవేంద్ర
53. తారక్
54. పలనాటి బ్రహ్మనాయుడు
55. జై (తమిళ్)
56. ఓరీ... నీ ప్రేమ బంగారం కానూ...



మణిగారి పిలుపు రావడంతో మా ఫ్యామిలీని ఇంటికి పంపించేసి నేను అటునుంచి అటే మద్రాసు వెళ్ళాను. గుండు చేసుకొని ఉన్న నన్ను చూసి గుర్తుపట్టలేకపోయారు. 'నేను ఆర్పీని సార్' అన్నాను. (మణిశర్మ ఎలా రియాక్ట్ అవుతారో అలా అయన్ని అనుకరిస్తూ) 'ఆః ఆర్పీయా.. ఏంటి అవతారం ఇలా మారింది!?' అని అన్నారు. నేను 'డైరెక్టుగా తిరుపతి నుంచి వస్తున్నా...' అన్నాను. 'ఓకే ఓకే రా రా' అని సాంగ్ పాడించడం జరిగింది.

**పాట పాడటానికి ఎంత టైమ్ తీసుకున్నారు?**

అయన పాట చెప్పటం, నేర్చుకోవటం... మొత్తం నలభై నిముషాల్లో డబుల్‌ట్రాక్ పాడాను.

**మణిగారు చేసిన ప్రయోగాల గురించి ఏవైనా చెప్తారా?**

'యమహానగరి కలకత్తా పురి' పాటలో ఒక మంచి అందమైన క్లాసికల్ ట్యూన్‌తీసుకుని దాన్ని అంత అందంగా బ్లెండ్ చేయడం ఆయన చేసిన ప్రయోగాల్లో ఒక గొప్ప ప్రయోగం. ఆ తర్వాత ఇద్దరు సింగర్స్‌తో ఒకే సింగర్ పాడిన ఫీలింగ్ తీసుకొచ్చిన 'భంభంభోలే' పాట. ఇందులో హరిహరన్‌తో ప్రారంభమై శంకర్‌మహదేవన్‌తో అయిపోతుంది. అంటే రెండు వాయిస్‌లను ఒకే వాయిస్‌లాగా సౌండ్ చేసినట్టు చేయడం అనేది కూడా చాలా మంచి ప్రయోగం. నాకు తెలిసి ఇప్పటి వరకూ ఎవ్వరూ చేయలేదు అలా.

**అంటే అది కంప్యూటర్‌లో ఎలా చేస్తారో చెప్పగలరా?**

కంప్యూటర్‌లో ఏమీ లేదు. మామూలుగా పాడించేటప్పుడే కేర్‌ఫుల్‌గా పాడించి తర్వాత చిన్న ప్రాసెసింగ్ లాంటిది చేస్తారు.

**మీరు అలాంటి ప్రయోగాలు ఏమైనా చేస్తున్నారా?**

లేదు లేదు. అలాంటి ప్రయోగాలు ఏమీ చేయట్లేదు.

**మీ వరకు మీరు ఇతర సంగీత దర్శకులు ట్యూన్ చేయగా హమ్ చేసుకునే పాటలు ఉన్నాయా?**

నాకు నచ్చిన మ్యూజిక్‌ని హమ్ చేసుకోవటానికి మొహమాట పడను. ఎందుకంటే నా మ్యూజిక్ కూడా వేరేవాళ్ళు హమ్ చేసుకోవాలి కదా.

**అలా హమ్ చేసుకునే పాటల్లో మణిగారి పాటలు ఉన్నాయా?**

చాలా ఉన్నాయి. స్పెషల్లీ 'చెప్పవే చిరుగాలి చల్లగా ఎదగిల్లి' పాటైతే నేను పాడలేదే అన్న ఫీలింగ్... ఎందుకంటే మన తెలుగులో వన్ ఆఫ్ ది బెస్ట్ సాంగ్ అది. మ్యూజికల్‌గా అంత గొప్ప పాటని నేను మిస్సయినాననే ఫీలింగ్ ఇప్పటికే కాదు ఎప్పటికీ ఉంటుంది.

# రాజా ఆడియో రివ్యూ

టైటిల్‌తోనే ఆకట్టుకునే వంశీ సినిమా ఇది. వంశీ సినిమా అంటే మ్యూజికల్ హిట్...! ఇళయరాజా స్వర రచనా సంవిధానాన్ని గుర్తుచేసే బాణీలు...పూర్తి తెలుగుతనాన్ని నింపుకునే సాహిత్యం... వంశీ సినిమా కుండే అస్తుల పట్టికలో కొంత భాగం మాత్రమే! ఆ చరిత్రను 'దొంగరాముడు అండ్ పార్టీ' ఆడియో పునరావృతం చేసింది. శ్రీకాంత్, లయ హీరో హీరోయిన్‌లు కాగా చక్రి ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

తొలి గీతం -'సిరి సిరి మల్లేనా జల్లేనా మంచు ముత్యమా'-పెద్దాడమూర్తి రాయగా బాలు, సుజాత పాడేరు. పాట ట్యూన్‌లో ఉన్న కట్స్‌కి తగ్గ సాహిత్యాన్ని...ఇరికించినట్టుగా కాకుండా స్వతస్సిద్ధంగా వడినట్టు రాయడంలో పెద్దాడ మూర్తి సినారెను గుర్తు చేసేడు. భీంప్లాస్ రాగంలో పాత తరం సంగీత దర్శకులు సమకూర్చిన ట్యూన్ వింటున్నట్టనిపిస్తుందీ పాట వింటుంటే!

బాలు, సుజాత పాడినదే మరొక పాట-ప్రేమే పంచమి వెన్నెల...ప్రేమే పంచమ కోయిల..! పాట బిగినింగ్ ట్యూన్ 'వెన్నెల్లో హాయ్ హాయ్' పాటని గుర్తు చేసినా తర్వాత పాట స్కీమ్ అంతా ట్యూన్ పరంగా ఆలోచిస్తే వంశీ తీసిన 'అన్వేషణ'లోని 'ఏకాంత వేళ...' పాటను పోలివుందేమో ననిపిస్తుంది. పంచమ వెన్నెల, పంచమ కోయిల, మంచున మల్లిక, మన్మధ నంచిక, అల్లుకోనా- జల్లుకోనా- గిల్లుకోనా- తుళ్లిపోనా, సుందరమా సుమధురమా, గత జన్మాలె శతమానాలై లాంటి పదాలు; చక్కని చెక్కిలి నొక్కులలోనా చిక్కని చక్కని చుక్కను కానా, కన్నే కొట్టేసి నేడు-నన్నే చుట్టేసి చూడు- నిన్నే ఇచ్చేసి తోడు /పచ్చబొట్టంటి సోకు-పుచ్చ పువ్వంటి రేకు-ఇట్టే నచ్చేసింది నాకు- లాంటి కట్స్... ఇవన్నీ గీత రచయిత పెద్దాడమూర్తి పై వేటూరి ప్రభావం ఎంతగా వుందో పరోక్షంగా తెలియజేస్తాయి. వలవరమా/ సముఖములో సుమశరమా లాంటి పదాలు, రూపు లేని రేపు లోని తీపి రేపు మధువనమా లాంటి భావప్రకటనలు పెద్దాడమూర్తి స్వంత దస్తూరిని రసజ్ఞ శ్రోతల మెదళ్లలో ప్రింట్ చేసేస్తాయి. స్టీరియో ఎఫెక్ట్‌ని చక్కగా ఉపయోగించుకున్న ఈ పాట కూడా జనామోదం పొందుతుంది. గాయనిపరంగా చూస్తే పంచమ కోయిల అన్న పదాన్ని ఉచ్చరించడంలో సుజాత మరికొంత జాగ్రత్త వహించివుంటే బావుండుననిపిస్తుంది.




విడుదల : సోహాన్
వెల : రూ.38/-

శ్రీనివాస్, సుజాత పాడిన 'చలిరాతిరి వస్తావని-చిరువేనవి తెస్తావని' పాట సంగీతపరంగా సాహిత్యపరంగా, గానపరంగా హాయిగా వినిపించే పాట. ఈ పాట రచయిత తనికెళ్ల శంకర్- తనికెళ్ల భరణి తమ్ముడు. సుతిమెత్తని పదాలతో అలరించటంలో అన్నగారి తత్వాన్ని పుణికి పుచ్చుకున్నట్టనిపిస్తుంది ఈ సాహిత్యాన్ని చూస్తుంటే!

సాయిశ్రీ హర్ష రాయగా బాలు, సుజాత పాడిన 'ఏదో ఏదో తియ్యని దాహం నను మాయ చేసింది మోహం' పాట మొదటిసారికి స్లోగా అనిపించినా రెండుమూడు సార్లు వింటే పాట స్టామినాఏమిటో తెలుస్తుంది. కొన్ని ట్యూన్‌లలో ఉండే గొప్పతనం ఇదీ అని వర్ణించడానికి, విశ్లేషించడానికి కుదరదు. పాడుకుంటున్న కొద్దీ తృప్తిగా ఉంటాయి... అంతే! ఈ పాట ట్యూన్ కూడా ఆ కోవకి చెందినదే! సాహిత్యపరంగా శ్రీహర్ష పటిమగల ప్రౌఢత్వాన్ని చూపి తన సీనియారిటీని నిలబెట్టుకున్నాడు.

బాలు, సుజాత పాడిన 'కళ్లలోనె నువ్వు గుండెలోనె నువ్వు' పాటకి టిపికల్ ట్యూన్ జతపడింది. పాత పాటల మాధుర్యం, కొత్త పాటల స్పీడ్ కట్స్ అన్నీ తగు పాళ్లలో రంగరించుకుని ఆకర్షణీయంగా రూపొందిన పాట యిది. చరణాల చివర్న (కంటి వెలుగై ఉండిపోనా...తనివి తీరా ఇచ్చుకోవా) గల ఆలాపన దగ్గర పల్లవిని చేరుకోవడంలో వినిపించిన మధురిమ గుండెకి భలే హాయిగా అనిపిస్తుంది. వివిధ పత్రికలలో ఫిలిం జర్నలిస్ట్‌గా పనిచేసిన బొమ్మకంటి సీతారామచంద్రమూర్తి ఈ పాటకు రచయిత. ట్యూన్‌లోని కట్స్‌కి తగ్గ సాహిత్యాన్ని అందివ్వడంలో ఈయన కూడా చక్కటి ప్రజ్ఞ చూపాడు.

బాలు, సుజాత పాడిన 'వన్నెలున్న నారి చెయ్యమంది చోరి వెల్లమాకు నువు జారి' పాటకి హిట్ విషయంలో మిగిలిన పాటలకన్నా ఓ రవ్వ ముందుండే ఛాన్సు ఉంది. ముఖ్యంగా 'జనకు జనకు జన సునోరే బాతు జెర ధనము సుఖము మనదె' అనే లైను జనాలకు బాగా పడుతుంది. కష్టాల బతుకు -ముష్కిల్‌ర మెతుకు-రిస్కేగా మనకు/ఎన్నాళ్ల వరకు-చికాకు బతుకు-దారేదో వెతుకు లాంటి ప్రయోగాలతో పాట రచయిత తనికెళ్ల శంకర్ శబ్ద సౌందర్యాన్ని చక్కగా అందించాడు. హుషారైన ట్యూన్‌కి ఈ సౌందర్యాలు మరింత అందంగా అమిరి పోయాయి.

సర్గీయ కె.వి.మహదేవన్ ఎన్ని వేల ట్యూన్‌లు చేసినప్పటికీ -యువ చిత్ర వారిచిత్రాలకు సంగీతాన్నిచ్చేటప్పుడు మురారి టేస్ట్‌తో అన్ని పాటలూ ఒకేలా ఉన్నట్టనిపించినా ప్రతిపాటలోనూ ఒక ప్రత్యేకత నిండినట్టు ఎలా స్వర పరచారో అలాగే ఈ 'దొంగరాముడు అండ్ పార్టీ'లోని ట్యూన్స్‌లోనూ, ఆర్కెస్ట్రయిజేషన్ లోనూ, రచయితలతో రాయించుకోవడం లోనూ, గాయనీ గాయకులతో పాడించుకోవడం లోనూ అడుగడుగునా వంశీయే... అణువణువునా వంశీయే!

**రచన: పెద్దాడమూర్తి (1) గానం: ఎస్.పి.బాలు, సుజాత**
కో: చిన్ చినికిన్ తానే.... చిన్ చినికిన్‌తానే ॥2॥
జిం చరచుం బంచరచుం జించరచుం బంచరచుం ॥2॥
అ: సిరి సిరి మల్లేనా జల్లేనా... మంచుముత్యమా
ఆ: ఆహా..... ఆహా.....
అ: మురిసిన మువ్వేనా నవ్వేనా..... ఆణిముత్యమా
ఆ: ఆహా....ఆహా...
అ: చోరీలునేనెన్ని చేశా నేరాలు ఎన్నెన్ని చేశా
ఏనాడు లేదింత ధ్యాసా ఏమైంది ఈవేళ మనసా
ఆ: హోయిహోయిగా ఊహల్లో ఊగగా నీవునీవుగా మరి లేనే లేవుగా ॥సిరి॥
అ: అసలు కొత్తకాదు మనమెన్ని కొట్టలేదు ఇంతవరకు గుండెల్లో గుబులు పుట్టలేదు
ఆ: ఏమిటో అది మది ఏమిటన్నది
అ: రైలు గూడు ఐన జైలు గోడలైనా వింత వింత హంగామా ఎపుడు చూడలేదే
ఆ: ఇప్పుడిప్పుడే... ఎద చప్పుడయ్యనే
అ: ఎపుడూ మునుపెపుడూ నను తగలనిదీ ఊహే
తొలిగా చలిచలిగా మరి మొదలాయేను ఊసే
ఆ: మంత్రమేసెనో... ఏ మాయ చేసెనో ఊహలే ఇలా ఓ ఈలవేసెనో ॥సిరి॥
అ: గొలుసు కట్టు గాథ ఈ మనసు గుట్టు కాదా
తెలిసి తెలిసి ఎంతెంతో వలుపు పుట్టు కాదా
ఆ: గుండె లోయలో... కూసింది కోయిలా
అ: తీపి తీపి ఊసే చెబుతోంది చిట్టిగొలుసే పోను పోను పెంచేసే కలవమన్న ఆశే
ఆ: ఎంత తొందరా... కథ చెప్ప ముందరా
అ: మెరుపో మైమరుపో నను తాకినదీపూటా
పిలుపో అది వలపా ఇక తెలియనదీ పాట
ఆ: హారమేయనా... ఎద హారతీయ్యనా తీయతీయగా కలలార బోయనా॥సిరి॥
**రచన: పెద్దాడమూర్తి (2) గానం: ఎస్.పి.బాలు, సుజాత**
అ: ప్రేమే ఆ: పంచమి వెన్నెల
అ: ప్రేమే ఆ: పంచమ కోయిల
అ: ప్రేమే ఆ: మంచున మల్లిక
అ: ప్రేమే ఆ: మన్మథ సంచిక
అ: చక్కని చెక్కిలి నొక్కులలోనా
ఆ: చిక్కిన చిక్కని చుక్కని కానా....
అ: కన్నెలా ఆ: అల్లుకోనా
అ: వెన్నెలే ఆ: జల్లుకోనా



అ: చల్లగా తాకింది రేతిరమ్మ అచ్చంగా మెచ్చంగా అందాల వెన్నెలమ్మా
ఆ: చిలిపి చినుకా చురుకు మనకా లేత చలిగా అల్లుకోవా
అ: తళుకు మెరుపా చమకు మనకా కంటి వెలుగై ఉండిపోవా.... ॥కళ్ళలోనే॥
ఆ: పూల జడ పిలిచింది కథ ముదిరింది ఒడి విందులు కోరింది
అ: కలిసి పదపదమంది మొహమాటలే మనకెందుకు లెమ్మంది
ఆ: ఏమిటో ఈ వింత పోకడమ్మా ఇల్లాగే ఉంటుందా నీక్కూడా లోలోనా
అ: జంటగా నువ్వుంటే బాపు బొమ్మ ఉంటాగా నీ వేలి గోరింటై ముద్దుగుమ్మా
ఆ: వయసు గొడవ తెలుసు కనుక కలిసిపోనా కన్నెగువ్వా
అ: తలచి కొలిచి వరములడిగా తనివితీరా ఇచ్చుకోవా... ॥కళ్ళలోనే॥
**రచన: తనికెళ్ళ శంకర్ (6) గానం: ఎస్.పి.బాలు, సుజాత**
ఆ: వన్నెలున్న నారి కో: దొంగలండీ
అ: కన్నెవయసు ప్యారీ కో: దొంగలండీ
ఆ: వన్నెలున్న నారి చెయ్యమంది చోరి వెళ్ళమాకు నువు జారి ॥2॥
కిల్లాడి నా మనసులో ఓ ఖిల్లానా పలికించరా ॥2॥
బంగారు బాతు యాడుంది బాసు
కో: జనకుజనకుజన సునోరే బాతు జెర ధనము సుఖము మనదే
అ: కన్నె వయసు ప్యారీ వెన్నముద్ద చోరి చెయ్యమంది ప్రతిసారి ॥2॥
ఆ: సిరులు దోచె గుణము అది గొప్ప వరము మనకు
అ: ఎవరు దొరలు నిజము ప్రతి మనిషి ముఖము ముసుగే
ఆ: మన్ని ఛీ అంటూ లోకమంటుంటే చెయ్యాలేమో ఖుద్‌ఖుషి
అ: గుడిపూజారి, మంత్రి, వ్యాపారి, దొంగోళ్ళే లేదు నామోషి
ఆ: దర్జాల లుక్కు దర్వాల లైపు దక్కేన మనకు చెప్పక కదలకు
అ: కష్టాల బతుకు ముష్కిల్‌రా మెతుకు రిస్కేగా మనకు అయినా బెదరకు
కో: జనకుజనకుజన సునోరె బాత్ జెర ధనము సుఖము మనదే ॥కన్నె॥
ఆ: వినర గురువా ఆశా అది పెంచుకోకు కలతె
అ: నిజమే కలువా పైసా మరి లేకపోతే గొడవే
ఆ: సొమ్ము లేకుంటే బండి నడిచేనా ఏం చేయాలో దోచక
అ: పురిటి వార్డయినా డెత్ బెడ్డయినా క్యాష్‌లేకుంటే నోఎంట్రీ
ఆ: ఎన్నాళ్ళవరకు చికాకు బతుకు దారేదో వెతుకు మూటలు దొరకవా
అ: బెంగేమి పడకు రంగేళి లక్కు వందేళ్ళ వరకు మన తోడుండగ
కో: జనకుజనకుజన సునోరె బాతు జెర ధనము సుఖము మనదే ॥కన్నె॥
అ: అల్లాడు నీ ఆశకి ఓ థ్రిల్లేదో కలిగించనా ॥2॥
లారీలలోడు చేరేస్తే డబ్బు ॥2॥
కో: జనకుజనకుజన సునోరె బాతు జెర ధనము సుఖము మనదే



**రచన: చంద్రబోస్ (1) గానం: కె.కె, ఆలీ**
సాకీ: ఇందుమూలంగా సమస్త కళాశాల విద్యార్థులకు మనవి చేయుమనేది
ఏమనగా మన చేతుల్లో మాస్టార్లు జలకండ్రి అయ్యారని అందరూ తెగ
ఆనందం పడుతున్నారు మనం మాత్రం
బాయ్స్: ఆ... మనం మాత్రం
సాకీ: ఆ.. ఇలాంటి బలాంత్ర పకిడీస్ చేతుల్లో
క్లీన్ బౌల్డ్ అయ్యే డేంజరుంది జీకేర్‌ఫుల్ గైస్.....
ప: అమ్మాయే బౌలింగ్ చేస్తే - అబ్బాయే క్లీన్‌బౌల్డ్
అందాలా బాలే వేస్తే - అవుతాడు క్లీన్‌బౌల్డ్
చూపులతో స్పిన్నే వేస్తే - చదువంతా క్లీన్‌బౌల్డ్
పెదవులతో ఫుల్‌టాసేస్తే - పర్సంతా క్లీన్‌బౌల్డ్
లవ్వంటూ లేగ్ బ్రేకేస్తే - లైఫంతా క్లీన్‌బౌల్డ్
క్లీన్‌బౌల్డ్ క్లీన్‌బౌల్డ్ క్లీన్‌బౌల్డ్ (2)
చ: ఇంటర్‌నెట్టుకే రమ్మంటారు - ఇన్‌స్వింగరే వేస్తుంటారు
ఈజీగా చేస్తుంటారు - క్లీన్‌బౌల్డ్
అవుట్ హౌస్‌కే రమ్మంటారు - అవుట్ స్వింగరే వేస్తుంటారు
అవలీలగ చేస్తుంటారు - క్లీన్‌బౌల్డ్
గుడివద్దకు రమ్మంటారు - గూగ్లీలే వేస్తుంటారు
గురిచూసి చేస్తుంటారు - క్లీన్‌బౌల్డ్
మూవీకే రమ్మంటారు - మీడియమ్ పేసేస్తుంటారు
ముచ్చటగా చేస్తుంటారు - క్లీన్‌బౌల్డ్
ప్రతీబాల్‌కి ఫ్రంట్ కెళ్ళక పిల్లచేతికి వికెట్‌నివ్వక
తలచుకుంది సాధించేవాడే 'మ్యాన్ ఆఫ్ ది మ్యాచ్'
చ: ఫాస్ట్ కల్చరే పాటిస్తారు - ఫాస్ట్ బంతులే వేస్తుంటారు
పనిగట్టుకు చేస్తుంటారు క్లీన్‌బౌల్డ్
షార్ట్ డ్రస్సులో వస్తుంటారు - షార్టు పిచ్చ్‌లే వేస్తుంటారు
సరదాగా చేస్తుంటారు క్లీన్‌బౌల్డ్
బూమర్లే తింటుంటారు - సీమర్లే వేస్తుంటారు
డ్రీముల్లో చేస్తుంటారు క్లీన్‌బౌల్డ్
కోర్కెల్లో ముంచేస్తారు యార్కర్లే వేస్తుంటారు
ఉర్యూర్కే చూస్తుంటారు క్లీన్‌బౌల్డ్
ఏ బంతికీ చెక్కు చెదరక పూ బంతికీ డక్కౌట్ అవ్వక
జీవితాన పైకెదిగేవాడే 'వరల్డ్ కప్ విన్నర్'
వరల్డ్ కప్ విన్నర్ వరల్డ్ కప్ విన్నర్ ॥అమ్మాయే॥



గుప్పెడంత ఈ చిన్ని గుండెలో గుట్టునింక ఆపడం ఎలా
కుకుకుకుకుకుకూకుకుకుకుకూకు ॥కుకు॥
అ: ఇన్ని రోజులూ ఉన్నమాట చెప్పలేదు చిన్నదాని సన్నజాజులూ
నన్ను ఎప్పుడూ రెప్పలెత్తి చూడలేదు కన్నెపిల్ల కంటిచూపులూ
సైగ చేయడం నేర్చుకున్నవి ముచ్చటైన లేత నవ్వులూ
కొమ్మచాటుగా దాగనన్నవి విచ్చుకున్న సిగ్గుపువ్వులూ
కుకుకుకుకుకుకూకుకుకుకుకూకు ॥కుకు॥
**రచన: సాయి శ్రీహర్ష (6) గానం: మాల్గాడి శుభ, పట్నాయక్**
ప: జుంబాయ్ బాయ్ బాయ్ ముంబాయి మల్లి నోయ్
దిల్ నీకు ఇస్తినోయ్ తెల్లారి బైబై
జుంబాయ్ బాయ్ బాయ్ అబ్బాయి దాయ్ దాయ్
కౌబాయ్ నువ్వేనోయ్ గుడ్‌బోయ్ అవ్వవోయ్
టోకెనిస్తే టోకుగానె సోకులిస్తాలే తాకితేనే తేనెలన్నీ ధారపోస్తాలే
షాలాలా షాల షాలలా షాల షాలలా షాలలా ॥జుంబాయ్॥
చ: అవకాశం ఒచ్చిందంటే నీ వయసు శివకాశి సరుకేనురా
వదిలేసుకోవద్దురా కాసేపూ నా షేపు చూసెయ్యరా
కావ్యాలు నేనే రాసేయనా కమ్మేసుకొచ్చేయనా
కవ్విస్తూ నన్నే ఇచ్చేయనా కన్నెరికం ఒచ్చేయనా
షాలాలా..హే... షాలలా హే షాలలా హే...హే... ॥జుంబాయ్॥
చ: టాలెంట్ అర్జెంటురా ఓ జెంటూ నీ హార్టు నా టెంటురా
ఈ నైటు సామ్రాట్టువూ నువ్వేరా మన జంట డీసెంటురా
లక్కీగా నేనే ఫ్లవరివ్వనా నీ నైటు క్వీనవ్వనా
లైఫ్లీగ నీకే లైఫివ్వనా నీ డూపు వైఫవ్వనా
షలాల... షల... షలాల... షల...హా..హా.. షలాలా...
షలాలా షలలలల హే షలలాలల ॥జుంబాయ్॥
అ: జుంబాయ్ బాయ్ బాయ్ జుమ్మంటు దాయ్ దాయ్
అమ్మాయి కాయ్‌కాయ్ అబ్బాయి హాయ్ హాయ్
పాలగువ్వ పంచలోన మంచమేయాలా
పాలధార పంచదార కలిపి వేయాలా
షలాలా షాల్ల షలాల షాల్ల షలాలా షలాలా
**రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (7) గానం: ఆర్పీ పట్నాయక్**
నిముషం నిలవనంత పరుగెందుకంటె మది బదులు చెప్పగలవా
సమయం కదలనంత బరువేమిటంటె అది నీకైనా తెలుసా లేదా
నీదేనా ఈ వింత ఏమైనా బాగుందా ఓ ప్రేమా ఓ ప్రేమా

ఆ: తనువుల్లో మనసుల్లో జ్వరమే ఈ ప్రేమ చిగురేసి చైత్రంలా పెరిగే లోలోనా
అ: అరుదైన విలువైన చెలిమే ఈ ప్రేమ తపియించె ఎదలోన చినుకై కురిసేనా
ఆ: చుక్కలనే దాటించి అలవోకగా ఎక్కడికో చేర్చేది వలపే కదా
అ: మక్కువతో వేధించి ప్రతిజాములో చెక్కిళ్లు నిమిరేటి చలువేకదా
ఆ: మునుపెరుగని మురిపాలు ముదిరాయి సరదాలు
పూల జల్లు ప్రేమ మన ప్రేమ...
అ: తీపిముల్లు ప్రేమ ఈ ప్రేమ ॥చలి॥

**రచన: సాయి శ్రీహర్ష (4) గానం: ఎస్.పి.బాలు, సుజాత**

ఆ: ఏదో ఏదో తియ్యని దాహం నను మాయ చేసింది మోహం ॥2॥
ఏదో ఏదో కోరెను దేహం నను దోచి వేసింది స్నేహం
అ: ఝుమ్మని తుమ్మెద నాదం ఘుమ్మని కమ్మని అందం
ఘల్లని అందెల తాళం ఝల్లని అల్లరి రూపం తీరలేని తాపం... పాపం॥ఏదో॥
ఆ: కలలకు తీరం కవితల సారం కలతకు దూరం యవ్వనం
అ: వయసుల వాదం వలపు వివాదం తలపుల వేగం తన్మయం
ఆ: మదనుడి వల కలబడి ఎదసడి ఇక తడబడి
అ: మనసే నిండి కురిసే పూలు
ఆ: ఎదలో పొంగే మమతేచాలు
అ: నేనే నీవై జన్మంతా నన్నేలే.. ॥ఎదో॥
అ: ప్రతి ఒక నిమిషం సరసపు సమయం సొగసుల గీతం స్వాగతం
ఆ: ఒకరికి ఒకరం మనదొక లోకం మనసుల మైకం మోహనం
అ: వడి వడి ఇక ముడిపడి త్వరపడి మది అలజడి
ఆ: మనదే జగము మనసే తీర
అ: మదిలో మెరిసే మురిసే తారా
ఆ: ఏమో ఏమో చేసింది ఈ మౌనం ॥ఏదో॥

**రచన: బొమ్మకంటి (5) గానం: ఎస్.పి.బాలు, సుజాత**

అ: కళ్లలోనె నువ్వు గుండెలోనె నువ్వు ఏమిటీ కవ్వింతలోయ్
స్వప్నమల్లె నువ్వు లేచిచూస్తే నువ్వు ఎందుకీ తుళ్లింతలోయ్
ఆ: దొంగలా వస్తుంది కొంటె ప్రేమ దోచుకెళ్లిపోతుంది అయ్యో రామా
అ: అబ్బబ్బో చంపుతోంది హాయి ప్రేమా అంతగా ఏమిటో దీని ధీమా
ఆ: వలపు బడికి వెళదాం చిలిపిగా చెలిమి తలుపు తడదాం
అ: ఏవో అందాలు నావైతే చాలు హాయే... ॥కళ్లలోనే॥
ఆ: మనసు నసపెడుతోంది మొదలెడుతోంది సొద ఎంతకు తేలంది
అ: వయసు పదపదమంటూ తొరబెడుతోంది గిలిగింతలు రేపింది
ఆ: మాఘమేనాడంది జాబిలమ్మ మందార గంధాల విందుల్లి చేసుకోమ్మా



అ: నిన్నిలా ఆ: గిల్లుకోనా
అ: నిన్నలా ఆ: తుళ్లిపోనా
అ: లేని పోని ఊహలన్ని ప్రేమలే సుమా... ॥ప్రేమే॥
ఆ: సుందరమా సుమధురమా తొందరగా జతపడుమా
అ: చిలిపి చిలిపి లిపి సంతకాలతో వలుపు తెలుపుటకు చెంత చేరుకో
ఆ: కన్నే కొట్టేసి నేడు నన్నే చుట్టేసి చూడు నిన్నే ఇచ్చేసి తోడు మగతనమా
అ: పిలవడమా..... కలవడమా....
ఆ: ముద్దులు మీటినదీ ప్రేమా సరిహద్దులు దాటినదీ ప్రేమా
నను నీలాగా నిను నాలాగా పెనవేయి ప్రాయమీప్రేమ
అ: పలవరమా పరవశమా
ఆ: రూపులేని రేపులోని తీపి రేపు మధువనమా ॥ప్రేమా॥
అ: అధరములే ఒణకడమా మధురిమలే తొణకడమా
ఆ: తళుకు బెళుకులకు వందనాలుగా చురుకు కులుకులకు చందనాలుగా
అ: పచ్చబొట్టంటి సోకు పుచ్చాపువ్వంటి రేకు ఇట్టె నచ్చేసింది నాకు యవ్వనమా
ఆ: సముఖములో సుమశరమా
అ: ఇద్దరు లేరని ఈ ప్రేమా మనసొక్కటి చేసినదీ ప్రేమా
గత జన్మాలె శతమానాలై ముడివేయు ప్రాణమీప్రేమ
ఆ: కిలకిలలా కలరవమా
అ: తూరుపింట దారి చూపు వేకువంటి తొలివరమా ॥ప్రేమ॥

**రచన: తనికెళ్ళ శంకర్ (3) గానం: శ్రీనివాస్, సుజాత**

ప: చలి రాతిరి వస్తావని చిరు వేసవి తెస్తావని
మునిమాపుల తెరచాటున చూశా మరివేచా
బిగి కౌగిలికొస్తావని బిడియాలే దోస్తావని
ఎదవాకిట గిలిగింతగ పూసే నా ఆశ
అ: ప్రాయాలే పంచాలి నులివెచ్చగా కాలాలే తోచాలి సరికొత్తగా
ఆ: గతజన్మల పరిచయమే బ్రతికించేను మన కలలే
అ: పులకింతల తొలివలపె కలిగించెను పరవశమే
ఆ: ప్రాణమైన ప్రేమ మన ప్రేమ హాయి పేరు ప్రేమ మన ప్రేమ ॥చలి॥
అ: పరువాల తెరతీసి చొరవే దొరికేనా
క్షణమైనా గడిపేస్తే వరమే ఒడిలోనా
ఆ: హృదయాలే వెలిగించె గుణమె ఈ ప్రేమ విరహాలే కరిగిస్తే సుఖమే జడివానా
అ: గాలైనా రాకుండా మన దారిలో హాయేదో పెరిగింది మలిసందెలో
ఆ: భారాలే తీరంగ మదిలోపల గానాలే చేసింది ఎల కోయిల
అ: నలువైపుల రాగాలే మధువొలుకే మేఘాలై వానవిల్లు విరిసే మరివిరిసే
ఆ: తేనె జల్లు కురిసె మది కురిసె ॥చలి॥



ఎవ్వరికీ అందని నా చేయి అందించనా
అ: చెరిగిపోని చైత్రమాసం ముద్రవేయనా
ఆ: మరపురాని మందహాసం మంత్రమేయనా ॥నీ...తోనే॥
అ: నీ...తోనే ఆ: నే... రానా అ: నీ...లోనే
ఆ: నే... లేనా అ: నీ స్నేహం ఆ: నా...దేనా
అ: నిన్నే గెలుచుకున్న మదికింతకన్న ఏముంది గొప్ప విజయం
ఆ: నీతో పంచుకున్న తొలి ప్రేమతోనె కద విరిసిందీ నాలో ప్రాణం

**రచన : సిరివెన్నెల సీతారామశాస్త్రి (4) గానం: ఎస్.పి.బాలు, చిత్ర**

ఆ: ఏమంటావే ఓ మనసా నీకెందుకే ఇంత ఆశ
అ: ఏమైందనీ ఓ వయసా మారిందిలా నీ వరస
ఆ: వరించే కలలొచ్చి వరాలే కురిపించి
స్వరాలై నీతో చేరి పలికాయా ఈ హైలో హైలెస్సా
అ: హోఓఓ హోఓఓ హోఓఓ ఓఓ ఆ: హోఓఓ హోఓఓ హోఓఓ ఓఓ
ఆ: సంకోచం చాలు అని ఇంకొంచం చేరమని చోటిచ్చిందా ఈ స్నేహం
అ: అవకాశం చూసుకుని సావాసం పంచమని అందించిందా ఆహ్వానం
ఆ: చినుకంత చిన్నతడి వెంటబడి వెల్లువగ మారిందా
అణువణువు తుళ్లిపడి గుండెసడి ఝల్లుమని మోగిందా
అ: ఆ రాగం అనురాగం తెలిపిందా బహుశా
అ: హోఓఓ హోఓఓ హోఓఓ ఓఓ ఆ: హోఓఓ హోఓఓ హోఓఓ ఓఓ
అ: మోమాటం కప్పుకొని ఏ మాటా చెప్పనని ఎన్నాళ్లింకా ఈ మౌనం
ఆ: జడివానై కమ్ముకొని సుడిగాలై చుట్టుకొని తరిమెయ్యవా ఈ దూరం
అ: ఉబలాటమున్నదని ఒప్పుకొని అందుకో నా జంట
నీ వేలు పట్టుకొని ఒదలనని నడపనా నావెంట
ఆ: ఆ మాటే చెబుతోంది వెచ్చని నీ శ్వాస
అ: హోఓఓ హోఓఓ హోఓఓ ఓఓ
ఆ: హోఓఓ హోఓఓ హోఓఓ ఓఓ ॥ఏమంటావే॥

**రచన : సిరివెన్నెల సీతారామశాస్త్రి (5) గానం: ఎస్.పి.బాలు, చిత్ర**

ఆ: కుకుకుకుకుకుకుకుకుకు యెద కోయిల పాడేనా
కుకుకుకుకుకుకుకుకుకు మధుమాసం నేడేనా
నమ్మలేని ఈ క్షణాన నేను నేనేనా
కమ్మనైన ఈ స్వరాన లీనమైపోనా
కుకుకుకుకుకుకూకుకుకుకుకూకు ॥కుకు॥
ఎన్ని రంగులో నిన్న మొన్న చూడలేదు కమ్ముకొచ్చె ఇంతలో ఇలా
ఎన్ని ఊహలో ఉన్నచోట ఉండనీవు గాలి చిందులెంతసేపిలా
కొంటె ఊసులూ కొత్త ఆశలూ అల్లుకుంటే అన్నివైపులా



**రచన: కులశేఖర్ (2) గానం : రవివర్మ, పట్నాయక్**

ప: కృష్ణాజిల్లా మరదలు పిల్లా ॥2॥
రావే నా రాజకుమారీ యమ కష్టపడీ
తెచ్చా మావూరి జిలేబీ
అబ్బా నీసోకు మిఠాయీ తెగ ఇష్టపడి వచ్చా వదిలేసి దుబాయీ
ఒసే తిప్పుల కోడి ఒడే గుప్పుమనాలి
చలో చక్కరకేళి భలే చిత్తు అవాలీ
నడుమే నైలాను ఉయ్యాలా నీ జిమ్మదియా నడకే నాజూకు జంపాలా॥కృష్ణా॥
చ: అమ్మాయి అంతమరీ ఆడించకే అందాల సోకుతో ఊరించకే
ఆ కొంటె చూపులతో వేధించకే సిగ్గంటు యింతలో వారించకే
చెంత చేరుకుంటే ముంత మామిడిస్తా కస్సు బుస్సులొద్దే కన్నెకుమారీ
పట్టె మంచమిస్తే పటిక బెల్లమిస్తా విసిరికొట్టమాకే దుమ్ము దుమారీ॥కృష్ణా॥
చ: వయ్యారి ఆశపడీ వచ్చానులే వజ్రాల గాజులే తెచ్చానులే
నీ పేర నిమ్మమడీ రాశానులే పత్రాలు గుర్తుగా దాచానులే
పంతమాడ కుండా సంతలోకి వస్తే చెట్టు చాటునిస్తా మిర్చి మసాలా
గంతులేయకుండా గమ్మునూరుకుంటే గడ్డివాములోనే గుట్టు దివాలా॥కృష్ణా॥

**రచన : సిరివెన్నెల సీతారామశాస్త్రి (3) గానం : ఎస్.పి.చరణ్, కౌసల్య**

ఆ: అయ్...లవ్‌యూ అ: అయ్...లవ్‌యూ
అ: ఐ లవ్‌యూ ఐ లవ్‌యూ
ఆ: నీ...తోనే అ: నే... రానా
ఆ: నీ...లోనే అ: నే... లేనా
ఆ: నీ స్నేహం అ: నా...దేనా
ఆ: సందేహం ఇంకానా అ: సంతోషం దాగేనా
ఆ: నిన్నే గెలుచుకున్న మదికింతకన్న ఏముంది గొప్ప విజయం
అ: నీతో పంచుకున్న తొలి ప్రేమతోనె కద విరిసిందీ నాలో రాగం॥నీ...తోనే॥
ఆ: నిద్దరనే ఒద్దు అనే నిప్పు రగిలించవా
మేలుకునే కలలుగనే కైపు కలిగించవా
అ: మబ్బులలో మెఱుపునిలా నేలపై దించనా
ముంగిలిలో ముగ్గులయే కళలు నేర్పించనా
ఆ: దాగి ఉండి నీ కోసం వేచి చూడనా
అ: ఆగిపోని వేగంతో వెతికి చేరనా ॥ నీ...తోనే॥
అ: ఎన్నటికి వదలననే స్నేహమే పంచనా
కన్నెతనం కోరుకునే దారి చూపించనా
ఆ: ఎప్పటికీ తగ్గననే దాహమే పెంచనా

# వంశీ దొంగరాముడు అండ్ పార్టీ

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : శంకరమంచి పార్థసారథి |
| పాటలు | : సాయి శ్రీహర్ష, పెద్దాడమూర్తి, తనికెళ్ళశంకర్, బొమ్మకంటి |
| సంగీతం | : చక్రి |
| కెమెరా | : లోకి |
| ఎడిటింగ్ | : బసవపైడిరెడ్డి |
| కొరియోగ్రఫీ | : స్వర్ణబాబు |
| ఆర్ట్ | : డి.వై.సత్యనారాయణ |
| స్టిల్స్ | : జె.జె. రఘు |
| ఎగ్జిక్యూటివ్ మేనేజర్స్ | : నందిపాటి గోవిందరామారావు మల్లెల సీతారామరాజు |
| మేనేజర్ | : కొండా వెంకటేష్ |
| క్యాషియర్ & ఎకౌంటెంట్ | : జి.ఎమ్.డి.బాష |
| కాస్ట్యూమ్స్ | : గణపతి |
| మేకప్ | : బాబు |
| ప్రొడక్షన్ | : వై. వెంకటేష్ |
| అసిస్టెంట్స్ డైరెక్టర్ | : ఎమ్.ఎస్.శ్రీనివాస్, చిన్నా, అనంత్ గోపినికరుణాకర్, నూరప్‌శాంతారాం, |
| సమర్పణ | : సి.హెచ్.పద్మావతి |
| నిర్మాత | : యం.యల్.కుమార్‌చౌదరి |
| స్క్రీన్‌ప్లే-దర్శకత్వం | : వంశీ |

## తారాగణం

శ్రీకాంత్, లయ, తనికెళ్ళభరణి, కోటశ్రీనివాసరావు, ఎమ్.ఎస్.నారాయణ, జయప్రకాష్‌రెడ్డి, రాళ్ళపల్లి, మల్లికార్జునరావు, జీవా, సత్యప్రకాష్, సూర్య, జ్యోతిలక్ష్మి, కృష్ణభగవాన్, కొండవలస లక్ష్మణరావు, సి.వి.ఎల్. బెంగుళూరు పద్మ, దేవిశ్రీ, నిషా, ద్రాక్షారామ సరోజ, లక్కింశెట్టి నాగేశ్వరరావు.


ఎం.ఎల్.కుమార్ చౌదరి


వంశీ


చక్రి



## తారాగణం

తరుణ్, శ్రీదేవి, అనిత, శరత్‌బాబు, రావి కొండలరావు, సునీత, ఆలీ, రాజీవ్ కనకాల, గిరిబాబు, బ్రహ్మానందం, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, శివాజీరాజా, చిన్నా, సుధ, అత్తిలి లక్ష్మి. ఢిల్లీ రాజేశ్వరి, హేమ, ఝాన్సీ అనితాచౌదరి, సుదీప, దేవిశ్రీ, సఖి, గణేష్, జయదేవ్, బబ్లూ.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| స్క్రీన్‌ప్లే- మాటలు | : కోన వెంకట్ |
| కొరియోగ్రఫీ | : రాజు సుందరం, లారెన్స్, కళ్యాణ్, సుచిత్ర చంద్రబోస్ |
| కెమెరా | : ఎస్.గోపాల్‌రెడ్డి |
| ఎడిటింగ్ | : కె.వి.కృష్ణారెడ్డి |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : డి.బ్రహ్మానందం |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : ప్రసాద్ |
| స్టిల్స్ | : ఇ.వి.వి. శ్రీను |
| పబ్లిసిటీ | : కృష్ణ డిజిటల్స్ |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : ఉదయ్‌కుమార్, హరీష్, రాజేంద్ర, ప్రకాష్, తమ్మారెడ్డి |
| సంగీతం | : ఆర్.పి.పట్నాయక్ |
| సమర్పణ | : ఎస్. గోపాల్‌రెడ్డి |
| నిర్మాత | : కె.ఎల్.నారాయణ |
| కథ-డైరెక్షన్ | : కొండా |

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

# నిన్నే ఇష్టపడ్డాను


ఎస్.గోపాల్‌రెడ్డి


కె.ఎల్.నారాయణ


కొండా


ఆర్.పి.పట్నాయక్


సిరివెన్నెల


చంద్రబోస్


కులశేఖర్

వర్ధమాన గాయని, వర్తమాన గాయని అయిన ఉష గురించి తెలుగు ప్రేక్షక శ్రోతలకు పరిచయ వాక్యాలు అవసరం లేదు. ఇప్పటికి సుమారు 100 చిత్రాల్లో 180 పాటలు పాడిన ఉష ఈ మధ్య ఓ ఛానల్‌కి ఇంటర్వ్యూ ఇస్తూ మధ్యలో ఓ ఇంగ్లీషు పాట పాడడం జరిగింది. బాగా ఆరితేరిన ఓ పాశ్చాత్య గాయని విదేశీ ఛానల్‌లో పాడినట్టుగా విన్నవారందరికీ అనిపించింది. నమ్మలేక కళ్ళు నలుముకుని చెవులు సరి చేసుకున్న వారంతా తెగ ఆశ్చర్యపోయారు కూడా! అందుకే ఆ ఇంగ్లీషు పాట సాహిత్యంతో సహా ఉష ఇంటర్వ్యూ ఈసారి పాప్‌కార్నర్‌లో...








❑ ఈ పాట మీకు ఎక్కడినుంచి వచ్చింది? దీని మీద మీకు ఇంట్రస్ట్ ఎలా కలిగింది?

❖ నేను ఎమ్. టీ.వి. పెట్టుకున్నప్పుడు ఒకరోజు వచ్చిందీపాట. అది చాలా బాగుంది. కొన్నిచోట్ల చాలా డిఫికల్ట్‌గా ఉంటుంది. ఈ సాంగ్‌ని పాడింది మరాయకేరి. రేయిన్‌బో అల్బమ్‌లో ఆవిడ పాడారు. వినగానే నేర్చుకుందామనిపించింది. ఎందుకంటే ఇంగ్లీషు సాంగ్స్ పాడటం కూడా కొంచెం రావాలి. అందువల్ల నేర్చుకున్నాను.

❑ నేర్చుకోవడానికి ఎన్నాళ్ళు పట్టింది?

❖ ఫస్టు హాఫ్ డేలో నేర్చుకున్నాను. కానీ నెక్ష్ డే ఇంకొంచెం నేర్చుకున్నప్పుడు అప్పుడొచ్చింది. అంటే కంటిన్యూస్‌గా రాలేదన్నమాట. ఎందుకంటే ఈ సాంగ్‌లో చాలా డిఫికల్టీస్ ఉన్నాయి అని చెప్పానుకదా... అందుకని....

❑ మన తెలుగు పాటలు కానీ, హిందీ పాటలు కానీ నేర్చుకోవడానికి మీకు ఎంత టైమ్ పడుతుంది?

❖ సాంగ్ కొంచెం కష్టంగా ఉంటే ఒక అరగంట పడుతుంది. లేకపోతే తొందరగానే వస్తుంది. కానీ ఈ ఇంగ్లీషు సాంగ్ లో గమకాలు అన్నీ డిఫరెంట్‌గా ఉన్నాయి. అదే మన గమకాలు కర్ణాటకవి కానీ, హిందుస్తానీవి కానీ తొందరగా వచ్చేస్తుంటాయి.

❑ ఇలా అరగంటలో నేర్చుకున్న సాంగ్ మళ్ళీ మెమరీస్‌లో నుంచి వెళ్ళిపోయే ఛాన్స్ ఉందికదా?

❖ ఆ... ఉంది.

❑ అలా మరిచిపోయిన పాటలా కాకుండా మీ మైండులో ఎప్పుడూ ఉండేలా... అంటే స్క్రిప్టుకూడ చూడకుండా పాడుతున్నారు కాబట్టి. అలా మీ మైండులో రిజిష్టర్ అయిపోవడానికి మీరు ఈ పాటని ఎన్ని సార్లు తిరిగి పాడి ఉంటారు?

❖ ఏది ఏమైనా అయిపోనీ నాలో ఒక లైట్ ఉంది. అది ఎంత బ్రైట్‌గా షైన్ అవుతుందంటే నానుంచి డిఫికల్ట్స్ అన్నీ ఆ లైట్‌ను చూసి పారిపోతాయి అని ఈ సాంగ్ యొక్క మీనింగ్ అన్నమాట. ఎప్పుడు పాడాలని అనిపించినా ఈ పాట పాడుతుంటాను. కొంచెం అదోలా ఉన్నాకూడా ఈ పాటే పాడుతుంటాను. అది నాకు ఉపయోగ పడుతుంటుంది కూడా! అలా పాడిపాడి మైండ్‌లో రిజిష్టర్ అయిపోయిందన్నమాట.

❑ సరే... ఈ పాట అల్బమ్ బయట దొరుకుతుందని వెంటనే తెలిసిపోయిందా? లేక దీన్ని సంపాదించడానికి ఏమైనా కష్టపడ్డారా?

❖ ఎమ్.టీ.వీ.లో విన్న తర్వాత నెట్‌లో ట్రై చేశాను. దానికి డౌన్‌లోడింగ్ ఫెసిలిటీ లేదు. తర్వాత మ్యూజిక్ వరల్డ్‌కి వెళ్ళి చూస్తే అక్కడ సీ.డి. ఉంది. వెంటనే కొని తెచ్చుకొని లిరిక్స్ చూసి నేర్చుకున్నాను.

## CAN'T TAKE THAT AWAY (MARIAH'S THEME)

(Mariah Carey - Diane Warren)

They can say anything they want to say
Try to bring me down
But I will not allow
Anyone to succeed
Hanging clouds over me
And they can try hard to make me feel
That I don't matter at all
But I refuse to falter
In what I believe
Or lose faith in my dreams
CHORUS:
'Cause theres's a light in me
That shines brightly
They can try
But they can't take that away from me from me
They can do anything they want to you
If you let them in
But they won't ever win
If you cling to your pride
And just push them aside see
I have learned there's an inner
peace I own
Something in my soul
That they cannot possess
so I won't be afraid
And darkness will fade
'Cause there's a light in me
That shines brightly
They can try
But they can't take that away from me
No
They can't take this
Precious love
I'll always have inside me
Certainly the lord will guide me
Where I need to go
They can say anything they want to say
Try to break me down
But I won't face the ground
I will rise steadily
Sailing out of their reach
Oh Lord
They do try hard to make me feel
That I don't metter at all
But I refuse to falter
In what I believe
Or lose faith in my dreams
'Cause there's a light in me
That shines brightly
They can try
But they can't take that away from me from me

- ❑ మీరీపాటని ఛానల్స్‌లో పాడినపుడు ఎలాంటి రెస్పాన్స్ వచ్చింది?
- ❖ నాకు చాలామంది ఫోన్‌చేసి చెప్పారు. ఇంగ్లీషు టచ్‌తో మీరు సాంగ్ చాలా బాగా పాడారండి అని.
- ❑ ఇండస్ట్రీలో ఈ పాట ఎవరికైనా వినిపించారా?
- ❖ ఇండస్ట్రీలో చాలా తక్కువ మందికి తెలుసండీ... కానీ నా కో సింగర్స్‌కి తెలుసు. కొంతమంది మ్యూజిక్ డైరెక్టర్స్‌కి కూడా తెలుసు. కో సింగర్స్ అంటే మల్లికార్జునరావుకి, నిత్య సంతోషిణికి, గోపికా పూర్ణిమకి వీళ్ళందరికి తెలుసు. తర్వాత ఓఅవార్డు ఫంక్షన్‌లో నన్ను ఈ పాట పాడమన్నారు ఆ రోజు పాడాను. అపుడు మరికొందరికి తెలిసింది. మ్యూజిక్ డైరెక్టర్స్‌లో ఆర్.పి.పట్నాయక్ గారికి, మణిశర్మగారికి.... ఇంకా కొంత మందికి తెలుసు.
- ❑ ఇంకెవరైనా ప్రముఖులు అంటే... ప్రొడ్యూసర్స్ కానీ, డైరెక్టర్స్ కానీ?
- ❖ డైరెక్టర్స్‌కి చాలామందికి తెలుసు.
- ❑ మీరు ఈ పాట పాడిన తర్వాత- ఇలాంటివి మీరు పాడగలరని తెలిసిన తర్వాత- ఇండస్ట్రీలో ఎవ్వరూ ఇలాంటి పాట పాడమని అడగలేదా?
- ❖ లేదండి. ఇలాంటి సాంగ్స్ ఎవ్వరూ ఇవ్వలేదు. కానీ నేను ఇలాంటి సాంగ్స్ పాడగలను. నేనీ పాట పాడిన తర్వాత మ్యూజిక్ డైరెక్టర్స్ అంటున్నారు - అయితే నీచేత ఇలాంటివి పాడించొచ్చన్నమాట అని - కాని ఎవ్వరూ ఇప్పటి వరకూ పాడించలేదు.
- ❑ భానుమతిగారు రెండు సినిమాలలో (తోడునీడ, మాంగల్యభాగ్యం) ఇంగ్లీషు పాటలు పాడారు. తెలుగు సినిమాలో ఇంగ్లీషు పాట వచ్చి దాదాపు 30 సంవత్సరాలు దాటింది. అప్పుడెప్పుడో మధ్యలో బాలుగారు ఒక పాట పాడారు అది వేరే సంగతి. ఫిమేల్ సింగర్స్ మాత్రం గత 30 ఏళ్ళుగా పాడలేదు. మీచేత పాడించవచ్చుగదా?
- ❖ నాచేత ఇంగ్లీషు పాట పాడిస్తే చాలా సంతోషం. నేను పాడడానికి రెడీగా ఉన్నాను.

# పొరుగింట ఘంటసాల

'ఇంట గెలిచి రెచ్చ గెలవడం' ఏ కొద్ది మందికో తప్ప అందరికీ కుదరదు. సంగీత ప్రపంచంలో అందునా తెలుగు సినీ సంగీత ప్రపంచంలో అనితర సాధ్యమైన గళ విన్యాసాన్ని నలుదిక్కలా చవిచూపించి ఘనుడనిపించుకున్న వారు ఘంటసాల. 'పొరుగింటి పుల్లకూర రుచి' అనేది మన సామెత. ఇందులో కొంత ఎద్దేవా ఉంది. ఉడుకు మోత్తనం ఉంది. కాని కూర తినబుల్ గానూ, తీయతీయ గానూ, రుచికరంగా ఉంటే అది పొరుగింటి వారిదితైనేం, దానిని ఆస్వాదించి మెచ్చుకోవడంలో అంత తప్పేంలేదు. అసలీ కూరలు ఇచ్చి పుచ్చుకోవడం లోనే అచ్చమైన ఆత్మీయత పెరుగుతుంది. అసలు విషయం ఏమిటంటే-




1. 1983లో బెంగుళూరు శ్రీరాఘవేంద్ర పబ్లికేషన్స్ వారు 'పద్మశ్రీ ఘంటసాల హాడిరువ రాగసుధా' అనే అతిచిన్న పుస్తకాన్ని అతి తక్కువ ధరలో అచ్చువేశారు. ఇందులో ఎస్.నాగరత్న సంపాదించిన 91 పాటలున్నాయి. మొత్తం చిత్రాలు 58. లిపి కన్నడం, పాట తెలుగు. అదీ విశేషం. ఇందులో భక్తి, దేశభక్తి, సందేశం, చిలిపితనం, అల్లరి ఇలా అన్ని అంశాలను స్పృశిస్తూ ఘంటసాల గానం చేసిన పాటలన్నీ ఉన్నాయి. 'భువన సుందరి కథ'లోని 'ఎల్లి నాతో సరస మాడేను', 'ఈడుజోడు' లోని 'చిరుగాలి వంటిది' వంటి సరసమైన, అరుదైన పాటలు కుడా కనిపిస్తాయి.

'పాతాళభైరవి'లోని ప్రేమ కోసమై వలలో పడెనే' పాడినవారు ఘంటసాలగా పొరబడి ప్రచురించడమనే ఒకే ఒక్క లోపం తప్ప... ఒక చక్కని కూర్పు ఇది.




2. వీరిదే మళ్ళీ 1989లో 'పద్మశ్రీ ఘంటసాల హాడిరువ భక్తిగీతే మత్తు మధుర గీతెగళ - గీతాంజలి' అనే ప్రచురణ వచ్చింది. ఇందులో ఉమాసుందరి, సతీసుకన్య, శ్రీశైల మహత్యం వంటి అరుదైన చిత్రాలలోని పాటలూ కనిపిస్తాయి. ఇందులో 88పాటలు 59చిత్రాల నుండి ఎంచి కూర్చారు.

3.హెచ్.ఎమ్.వి.వారు 2000వ సం॥లో 'బాళొందు నందన - ఘంటసాల హాడిరువ జనప్రియ చిత్ర గీత గళు' అని ఒక క్యాసెట్ విడుదల చేశారు. తొలుత తెలుగులో కొన్ని వినిపించినవే, అవి కన్నడంలో ఘంటసాల ద్వారా వినడం శ్రోతలకు మరో విందు.

స్వాభి మానద నల్లె (వీరకేసరి) ('బందిపోటు'లోని 'వగలరాణివి నీవే'), మదువె మాడి (మదువె మాడినోడు) ('పెళ్ళి చేసి చూడు'లోని 'పెళ్ళిచేసుకుని'), హే చంద్ర చూడ(సత్య హరిశ్చంద్ర), ఏనో ఎంథో (అమర శిల్పి జక్కణాచారి) ('అమరశిల్పి జక్కన'లోని ఏదో ఏదో ఏదో గిలిగింత), నన్యాకె నీ హాగె (గాలి గోపుర) ('గాలిమేడలు' లోని 'ఈ మూగ చూపేల'), మెల్లుసిరే సవిగాన(వీరకేసరి) ('బందిపోటు'లోని 'ఊహలు గుసగుసలాడే')- ఇవీ చెప్పుకోదగ్గ పాటలు.

**-డా॥ తాతిరాజు వేణుగోపాల్**



# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



ఇలపావులూరి మురళీమోహనరావు

9

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్ చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





మధ్యాహ్నం ఆఫీసులో-

వెంకట్రావు రాగానే పిలిచాడు మేనేజర్.

"ఏవోయ్ వెంకట్... ఏమంటోంది మా బుజ్జితల్లి!" అడిగాడు.

ఏం చెప్పాలో తోచలేదు వెంకట్రావుకు. పిల్లి కనిపించడం లేదంటే మేనేజర్‌కు కోపం వస్తుందేమో!

దడదడలాడింది వెంకట్రావుకు.

"బ్రహ్మాండంసార్.... చాలా సంతోషంగా ఉంది. కంటిపాపలా మా ఇంటి జ్యోతిలా మా అందరికీ ఆశారేకగా ఉంది" చెప్పాడు.

"గుడ్... గుడ్... పాపం ఆకలికి అసలుండలేదోయ్ మా బుజ్జిముండ. బాగా తిండి పెడుతున్నావు గదా!"

"దానికేం లోపం లేదు. మేం తాగినా తాగక పోయినా దానికి మాత్రం మూడు పూట్లా పాలు, పెరుగు, మీగడ, జున్నుపాలు తినిపిస్తున్నాం సార్"

"గుడ్..గుడ్... మరి టీవీ చూస్తోందా?"

"ఫస్ట్‌క్లాస్‌గా సార్. దానికోసం రోజూ రెండు మూడు గంటలు టీవీని పెట్టుంచుతాం. దానికోసమని ఇపుడు మేము కూడా ఏనిమల్ ప్లానెట్ చూడటం అలవాటు చేసుకున్నాం"

"వెరీగుడ్... వెరీగుడ్.. ఏంటోనోయ్ వెంకూ. దాన్ని నీకు ఇచ్చామనేగానీ మా మనసంతా దాని మీదనే. మా ఆవిడ రెండ్రోజులు అన్నం తిన్లేదు. వాళ్ళ నాన్న లారీ కింద పడి పిసురుపిసురైనా అంత దిగులు పడలేదు. తొందరపడి నీకిచ్చానని ఒకటే పోరు పెడుతున్నది. రాత్రి పడుకుంటామన్న మాటే గానీ అస్సలు నిద్ర పట్టడం లేదు. కళ్ళు మూసినా పిల్లే, తెరిచినా పిల్లే." ఎక్కడ లేని విచారాన్ని ముఖంలోకి తెచ్చుకున్నాడు మేనేజర్.

"అవునుసార్ దాని అందమే అందం. దాని ఠీవే ఠీవి. నడుస్తుంటే పులి నడుస్తుందా అన్నట్లుండేది. రాత్రిపూట దాన్ని చూస్తుంటే రెండు కళ్ళలో ఇద్దరు సూర్యులున్నారా అన్నట్లు వెలిగిపోయే కళ్ళు. దానిమ్మ గింజల వంటి పలువరస! అది ముఖం కడుక్కోక పోయినా ముత్యాల్లా మెరుస్తుంటాయి పళ్ళు. అది నోరు తెరిస్తే సినిమా హీరోయిన్ నవ్వినట్లుంటుంది. అటువంటి అందాలబొమ్మను మర్చిపోవడం ఎవరికీ సాధ్యం కాదు సార్"

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు

**"చిరంజీవి, బాలకృష్ణ, నాగార్జున, వెంకటేష్ నాకు చాలాకాలంగా తెలిసిన వాళ్ళు" చెప్పాడు రామం.
"అలాగా... అయితే వాళ్ళిళ్ళకు నన్నోసారి తీసుకెళ్ళవా?" బ్రతిమాలాడు సోమం.
"లాభంలేదు. నేనెవరో వాళ్ళకు తెలియదుగా?" చల్లగా చెప్పాడు రామం.
ఈ సీరియల్లోని పురోహితుడు కూడా ఇలాటి కిలాడియే. ఏవిధంగానో మొత్తం సీరియల్ చదివి తెలుసుకోండి.**

"అవునయ్యా... కన్న కూతురును పెంచినట్లే పెంచాను. మా ఆవిడ దాన్ని చూడాలని కలవరిస్తున్నది. ఎలాగైనా ఒక్కసారి రాత్రి మా యింటికి భోజనానికి తీసుకు రారాదూ"

వెంకట్రావు గొంతులో పచ్చివెలక్కాయ పడ్డట్లయింది. సమాధానం ఎలా చెప్పాలా అని బుర్ర గోక్కున్నాడు. పిల్లి కనిపించడం లేదంటే మేనేజర్‌కు కోపం వస్తుందేమో! ఎలారా దేవుడా అని ఆలోచించసాగాడు.

"ఓకే... ఓకే... వెంకట్రావ్. ఐ కెన్ అండర్ స్టాండ్ యువర్ ఫీలింగ్స్. వారం రోజులనుండీ దానికి అలవాటు పడి మళ్ళీ దాన్ని వదిలి ఉండాలంటే నీకు బాధగానే ఉంటుంది. అయినా ఆడపిల్లకు పెళ్ళి చేసి అత్తవారింటికి పంపిన తరువాత చీటికిమాటికి పిల్లను చూడాలనుకోవడం తల్లిదండ్రులకు తగదు. అయినా వియోగబాధ భరించలేక అలా అడిగాను. ఏమనుకోకు నా బంగారు తల్లికి ఏ కష్టం తెలియకుండా సాకుతావని నాకు నమ్మకం ఉంది" కంటి కొసలతో చూస్తూ అన్నాడు మేనేజర్.

"థాంక్స్‌సార్... మీ నమ్మకం నిలబెడతాననే నమ్మకం నాకున్నది. కానీ సార్.. పిల్లి వల్ల కొంచెం ఖర్చు పెరిగింది..." నసిగాడు వెంకట్రావు.

"ఓకె...ఓకె... కొంచెం చూసి చూడనట్లు పోతాలే. పిల్లిని మాత్రం జాగ్రత్తగా చూడు. ఒకవేళ మా యింటికొచ్చే ప్రయత్నాలు ఏవైనా చేస్తుందేమో కొంచెం కనిపెడుతూండు. పెళ్ళయిన ఆడపిల్ల తరచు పుట్టింటి కెళ్ళడం మంచి సంప్రదాయం కాదు. తల్లిదండ్రులే గుండెను రాయి చేసుకోవాలి" ఫైలు తెరిచాడు మేనేజర్.

ఊపిరి పీల్చుకున్నాడు వెంకట్రావు.

"యస్సర్... యస్సర్.. యూ ఆర్‌రైట్! చాలా విలువైన వజ్రం మాట చెప్పారు. ఉంటానుసర్. సీట్లో హెవీ వర్క్ ఉంది" అన్నాడు.

"క్యారీ ఆన్" సైగచేసాడు మేనేజర్.

గండం గట్టెక్కించినందుకు దేవుడికి




కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

"ఏంటండోయ్... చాలా రిలాక్స్‌డ్‌గా కనిపిస్తున్నారు. ఏంటి విశేషం" అడిగింది భారతి.

విషయం ఆమెకు చెబుదామా వద్దా అని ఆలోచించాడు. చివరకు చెప్పకపోవడమే మంచిదని నిర్ణయించుకున్నాడు.

"నథింగ్ మేడమ్. మేనేజర్ గారి చెప్పు తెగిందట..." చెప్పును వత్తి పలికాడు వెంకట్రావు.

భారతి ముఖం మాడింది.

మరో నాలుగు రోజులు పోయాక ఓ ఉదయం సుందరి నిద్ర లేవగానే మ్యావ్ మ్యావ్ మని పిల్లికూతలు వినిపించాయి.

వెంకట్రావును నిద్రలేపింది.

"ఏవండోయ్...పిల్లి కూతలు... పిల్లి కూతలు..." అన్నది.

"అబ్బా... కాసిని వేడినీళ్ళు తాగు. అవే నర్దుకుంటాయి." బద్ధకంగా అన్నాడు వెంకట్రావు.

"నా ఖర్మ... పిల్లికూతలు వినపడుతున్నాయంటే వేణ్ణీళ్ళు తాగమంటారేంటి? లేవండీ..." తలబాదుకుంది సుందరి.

"అబ్బ... నేను లేచి ఏం చేసేది? ఎవరి గొంతులో వచ్చే పిల్లి కూతలు వాళ్ళకు వినిపిస్తాయి. అవతలి వాళ్ళకు వినపడవు. నెమ్మెచేరి ఉంటుందిలే. ప్రస్తుతానికి వేడినీళ్ళు తాగు." మరింత మత్తుగా అన్నాడు వెంకట్రావు.

"ఇంత తెలివి తక్కువ మనిషిని చేసుకోవడం నా ప్రారబ్ధం. నాకు పిల్లి కూతలు రావడం కాదండీ, ఎక్కడినుంచో పిల్లల అరుపులు వినిపిస్తున్నాయి."

"ఎక్కడి నుంచో వినిపిస్తే నీకెందుకు? బజార్లో అనేక జంతువులు అరుస్తుంటాయి. అందులో వింత ఏముంది?"

"బజార్లోంచి కాదు. మనింట్లో నుంచే... లేవండి"

"అబ్బబ్బ... మనిషి నిద్రపోతున్నాడన్న జ్ఞానం లేదు కదా. శెలవు రోజునైనా పది గంటలదాకా పడుకుందామంటే కుదరదు" విసుక్కుంటూ లేచాడు వెంకట్రావు.

ఇద్దరూ కలిసి ఇల్లంతా వెతికారు. పిల్లుల అరుపులు వినిపిస్తున్నాయి కానీ ఎక్కడా కనిపించడంలేదు. చెవులు రిక్కించి వినగా వినగా ఆ శబ్దాలు అటక మీదినుంచి వస్తున్నట్లు అర్థమైంది.

స్టూలెక్కి అటక మీద చూసి కెవ్వున అరిచింది సుందరి.

"ఓసి నీ అరుపు తగలెయ్యా... ఏంటా కేక! గుండె పగిలేట్లు! ఏముందక్కడ?" ఉలికిపడి అన్నాడు వెంకట్రావు.

"పి..పి..పి..పిల్లులు..." అన్నది సుందరి.

"పిల్లులా? అక్కడెందుకున్నాయి? ఎలా వచ్చాయి? ఏదీ దిగు నేను చూస్తాను" తానెక్కి చూశాడు వెంకట్రావు.

ఒక పెద్ద పిల్లి, ఆరు కూనలు ఉన్నాయక్కడ.

"మైగాడ్... ఇది నేను తెచ్చిన పిల్లే. లావుగా,



## జరిగినకథ

**వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. ఎలుకలబోను పెడితే దాన్ని ఎలుక కొరికేస్తుంది. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. అది ఎలుకను పట్టకుండా పడినిద్రపోతూ ఉంటే వెంకట్రావు మండిపడతాడు. తిండిపెట్టక మాడుస్తాడు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లి కనబడడం మానేస్తుంది.**

**(ఇక చదవండి)**

"నీ కంటే ఎంతోమంది సీనియర్స్ ఉండగా నీకేలా ప్రమోషనొచ్చింది?" అడిగాడు భాస్కర్.
"నా సీనియర్లు ఆఫీసరు గారింటికి వెళ్ళే టప్పుడు ఆయన పిల్లలకు చాక్లెట్లు తీసుకెళ్ళేవారు. నేను మాత్రం ఆయన కుక్కకు బిస్కెట్లు తీసుకెళ్ళేవాడిని." రహస్యం విప్పాడు శేఖర్.
అవసరం కోసం ఈ సీరియల్ లోని వెంకట్రావుకు కూడా ఇలాంటి నాటకాలాడక తప్పలేదు పాపం!

## ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు

బొద్దుగా ఉంటే బాగా తిని బలిసిన పిల్లేమో ననుకున్నా. ఇది కడుపుతో ఉన్న పిల్లన్నమాట!" నోరు తెరచి చూస్తూండిపోయాడు వెంకట్రావు.

"ఛీ..ఛీ.. ఒక్క పనీ సవ్యంగా చేయ్యడం రాదు. పిల్లిని తెచ్చేముందు అది ఆడదా మగదా.. ఆడదైతే చూడిదా, చూడిదైతే ఎప్పుడు ఈనుతుంది లాంటివి చూడాలని తెలియదూ?" కస్సుమంది సుందరి.

"అది ఆడదో మగదో చూడిదో పాడిదో నాకెలా తెలుస్తుందే గాడిదా? నేనేమైనా పశువుల డాక్టర్నా? ఏదో పిల్లి కావాలి కదాని పిల్లిని తెచ్చాను" కోపంగా అన్నాడు వెంకట్రావు.

"ఊ.. మరేం తెలుసు? ఏదన్నా అంటే చచ్చేకోపం. మీరు దిగండి. నేను చూస్తాను." వెంకట్రావును దించి తానెక్కింది సుందరి.

కూనలు పాలకోసం తల్లి పొదుగును పీకుతున్నాయి. రెండు కూనలు తాగుతుంటే నాలుగింటిని పక్కకు నెడుతుంది పిల్లి. పీల స్వరంతో అరుస్తున్నాయి కూనలు. ఆ దృశ్యం చూసి హృదయం ద్రవించింది సుందరికి.

"చూడండి పావం. పాలకోసం కొట్టుకుంటున్నాయి, గిన్నెలో కాసిని పాలు పోసి పట్రండి" అన్నది.

"ఏడ్చినట్లే ఉంది. మనం పోయించుకునేదే అరలీటరు. దాన్లో కలిపే నీళ్ళు అరలీటరు. మళ్ళీ దీంట్లో పిల్లులకూ వాటానా?" చిరాగ్గా అన్నాడు వెంకట్రావు.

"పాపం ఆ తల్లి బాధ చూడండి. మీరు కూడా గర్భం ధరించి నలుగురు పిల్లలను కంటే ఆవేదన తెలుస్తుంది. ఆడదాని కష్టం ఆడదానికే తెలుస్తుంది. వెళ్ళి తీసుకురండి. అంతగా అవసరమైతే నేనీపూట కాఫీ మానేస్తాను" అన్నది సుందరి.

వెంకట్రావుకి జాలివేసింది. సుందరి అలా గలగల అరుస్తుందే కానీ హృదయం నవనీతం. అటువంటి వారి అంతరంగాలను అర్థం చేసుకోడం అందరికీ చేతకాదు.




మారు మాట్లాడకుండా వంటింట్లోకెళ్ళి గిన్నెలో పాలు తెచ్చి అందించాడు. కూనల ముందు పెట్టింది సుందరి. కూనలు గిన్నెలో పాలు తాగుతుంటే ముద్దొచ్చింది సుందరికి.

స్టూలు దిగింది. "శుభ్రంగా తాగాయండీ" అన్నది.

"ఎందుకు తాగవూ. నోటిముందు పెడితే నువ్వు మాత్రం వదిలిపెడతావా?" కోపంగానే అన్నాడు వెంకట్రావు.

"ఇకనుంచీ రోజూ వీటికోసం మరో లీటరు ఎక్స్ట్రా పోయించుకోవాలి"

"లీటరే! ఎన్నాళ్ళు?"

"ఏం చేస్తాం మరి? తెచ్చిపెట్టుకున్న శని అలాంటిది. పిల్లిని తేవయ్యా బాబూ అంటే పిల్లల తల్లిని తెచ్చారు. అయినా దరిద్రపు పిల్లికి ఒకే కాన్పులో ఇంతమంది పిల్లలా? మా అన్నయ్యకు పెళ్ళై పదిహేనేళ్ళయింది. ఇంతవరకూ మా వదినె వేవిళ్ళన్నది ఎరగదు. వాడు ఎన్ని గుళ్ళు తిరిగాడు? గోపురాలు చూశాడు! ఈ పిల్లులకు పందులకు మాత్రం ఒక్క దెబ్బకు అరడజను పిల్లలు"

"అయితే వచ్చే జన్మలో మీ అన్నయ్యను పిల్లిగానో పందిగానో పుట్టమను, కరువుదీరా పిల్లలను కంటాడు".

"చాల్లెండి కుళ్ళు మాటలు. ముందు వెళ్ళి మరో లీటరు పాలు పోయించుకురండి" చేతులు కడుక్కోవడానికి బాత్‌రూమ్‌కు వెళ్ళింది సుందరి.

"కానీ సుందూ ఎన్నాళ్ళిలా మనమీ పిల్లి సంసారాన్ని భరిస్తాం?" అడిగాడు వెంకట్రావు.

"చూద్దాం. పిల్లి తన పిల్లలను ఏడిళ్ళు మారుస్తుందట. అంతవరకు తప్పదేమో." చెప్పింది సుందరి.

గుండెలు బాదుకున్నాడు వెంకట్రావు.

-(ఇంకావుంది)

### క్విజ్ వచ్చె... పాఠకులూ భద్రం....

అసంఖ్యాకంగా పాఠకులూ, లబ్ధ ప్రతిష్టులైన సినీ రంగప్రముఖులూ మెచ్చుకుంటున్న ఈ సీరియల్‌లోని ఈ భాగంలో ఒక డైలాగ్‌ని చదవగానే హాస్యబ్రహ్మ కీ॥శే॥ జంధ్యాల పగలబడి నవ్వి రచయిత ఇలపావులూరి మురళీమోహనరావు గారిని గాఢాలింగనం చేసుకున్నారు. ఆ డైలాగ్ ఏమయివుంటుంది?

కరెక్టుగా ఊహించి రాసిన ఒక పాఠకునికి సంవత్సరం పాటు 'హాసం' ఉచితంగా చేరే విధంగా వారితరుపు నుంచి రచయిత ఇలపావులూరి మురళీమోహనరావు చందా కడతానని తెలిపారు.

కనుక... పాఠకులూ... మీరే ఆలస్యం...

జవాబులు 'హాసం' ఆఫీసుకి 15-07-2003 లోగా చేరాలి.



# కొమ్మ కొమ్మకో సన్నాయి...

# స్వరబ్రహ్మ రాగవిష్ణు: గురుర్దేవో మహాదేవన్



నా తొలిపాటకు సరిగమలు దిద్దింది- పెండ్యాల గారు. 'సిరికాకొలను చిన్నది' అనే రేడియో నాటిక అది(1969). నా తొలి సినిమా పాటకు స్వరాలు దిద్దింది- మామగారు శ్రీ కె.వి.మహాదేవన్. 'ఓ సీతకథ' చిత్రంలో 'భారతనారీ చరితము' అనే మకుటంతో సాగే హరికథ అది (1972).

ఆ సుముహూర్తమెటువంటిదో అది 25 వసంతాల పాటు పుష్పించి ఫలించింది. ఆయనతోను, ఆయన మానసపుత్రుడు శ్రీ పుగళేందితోను నా అనుబంధాన్ని జీవితంలో మరపురాని మధుర ఘట్టంగా నిలిపింది. ఆదుర్తి ఆత్రేయ మహాదేవన్ కలిసి ఒక స్వర్ణయుగం. అటు తర్వాత విశ్వనాథ్ మహాదేవన్‌ల యుగంలో నా పేరుకు కాస్త చోటు దొరికిందంటే అది నా పూర్వపుణ్యం.

తెలుగు సినిమాకు సంగీత భిక్షపెట్టిన మహనీయులలో అగ్రగణ్యుడు 'స్వరబ్రహ్మ' శ్రీ కె.వి.మహదేవన్. సినీ గీతంలో సాహిత్యాన్ని మన్ననచేసి మర్యాద నిలిపిన సంగీతదర్శకుడు ఆయన. తెలుగుతనానికి, తెలుగుగాన సంప్రదాయానికి ప్రతీక మహదేవన్ పాట. ఆయన దగ్గర ట్యూన్లు ఉండేవి కావు. రాసిన పాటను బట్టి ట్యూన్ ఏర్పడుతుందని ఆయన సిద్ధాంతం. ఆయన కట్టిన బాణీలన్నీ 'స్టాకు'లోంచి తీసినవి కావు. ప్రతిట్యూనూ రాసిన పాటను బట్టి పుట్టినదే.

నా వరకు నాకు మామతో వున్నబంధం సినీ పరిశ్రమలో మా మా పాత్రలకు పరిమితమైనది కాదు. గురు శిష్య సంబంధం.

మహదేవన్ తెలుగు సినిమా సంగీత సామ్రాజ్యాన్ని మూడు దశాబ్దాల పైబడి మహారాజులా పాలించారు. అయినా కర్తృత్వాహంకారం లేని కర్మయోగి, మితభాషి - మౌని. ఆయన స్వరబ్రహ్మ. నాద తనువు అయిన శివావతారం ఆయనది. తెలుగు పాటకోసం ఆయన పుట్టాడని పూర్వతరానికి చెందిన చిత్రనిర్మాతల, దర్శకుల, ప్రేక్షకుల ప్రగాఢ విశ్వాసం. ఆయనకు జన్మనిచ్చింది తమిళ కేరళ సరిహద్దు ప్రాంతం. ఆయన జన్మనిచ్చింది ఈనాటి తెలుగు సినిమా పాటకీ మాతృక అయిన ఆనాటి పాటకీ... ఏనాటికైనా పాటగా నిలిచే పదాల మూటకీ.... భావాల తోటకీ....! 'ఆంధ్రపత్రిక ఎడిటోరియల్నైనా ట్యూన్ చేయగలడు మామ'.! అన్నది ఆనాటి చిత్రలోకోక్తి, అతిశయోక్తి మాత్రం కాదు.



ఆయన ఏనాడూ ట్యూన్ యిచ్చి ఎరుగడు. అప్పటికే ముందు ట్యూన్ యిచ్చే సంప్రదాయం. హిందీ, మరాఠీ, బెంగాలీ, తెలుగు, తమిళ భాషల్లోవుంది. ఆ మాటకొస్తే రంగస్థలం మీదే ఆ సంప్రదాయం వాడుకలో వుండేది. నేను ఆయనకు రాసిన దాదాపు 50 చిత్రాలలో ఏనాడూ ట్యూన్ యిచ్చి ఎరుగని సంగీత సముద్రుడు. అట్లాంటిక్ ఓషన్‌లా ఆయన సంగీత లోకంలో కర్నాటిక్ ఓషన్ - ఘజల్‌తో జానపదాన్ని జోడించడంలో మెహదీహసన్ ప్లస్ శంకర్ జైకిషన్!

నా తొలిపాట ట్యూన్ చేసిననాడే ఆయన ఎంత గొప్ప సంగీత దర్శకుడో తెలిసింది. అప్పటికి నాకు సినీ భాష అంతగా పట్టుబడలేదు. సంస్కృత సమాస భూయిష్టంగా రచన-

**భారతనారీ చరితము మధుర కథ భరితము**
**పావన గుణ విస్ఫురితము పతిసుతానుమతము సతము**
**శీలజ్యోత్స్నా పులకిత హేలా శారద రాత్రము**
**అతి పవిత్ర మఘలవిత్ర మీ ధరిత్రి కనవరతము**

అంటూ సాగింది. దానిని అవలీలగా సంగీతీకరించిన క్షణాలు నేను మరచిపోలేను. హరికథ అంటే ఏదో పురాణగాథ ఆధారంగా సాగే సంగీత సాహితీ రచన. ఇక్కడ అటువంటిదేమీ లేదు. స్త్రీ గొప్పతనం భారత స్త్రీ యొక్క విశిష్టత, పవిత్రత ఇందులో వస్తువు. సాంఘిక చిత్రం (ఓ సీతకథ) లో రాయాలి. దానికీ భాషేమిటి? నోరు తిరిగినా చెవిలోకి ఎక్కినా అర్థంకాదే...! అయినా ఆ రచనను అంగీకరించిన దర్శకుడి ధైర్యం ఎంత గొప్పది...! మామ ఆ రచనని కాంభోజి, కేదారం మొదలైన రాగాలలో పదిహేను నిముషాలలో స్వరబద్ధం చేసిన తొలి అనుభవం మరువలేను-

ఈ పాటను శ్రీమతి పి.లీల గానం చేశారు. ఈనాటికీ అది చెవులకు చెందినట్లు వినిపిస్తూ వుంటుంది. అటు తర్వాత 'సిరిసిరిమువ్వ' చిత్రంలో అన్ని పాటలూ నేను రాయడం, ఆయన స్వరపరచడం ఎన్నెన్నో మధురానుభూతులను కలిగించింది. త్యాగరాజస్వామి వారి 'మనోధర్మ సంగీతం' రేఖామాత్రంగా అనుభవంలోకి తెచ్చిన రససిద్ధుడు మామ! మహదేవన్ గారి స్వరూపం, స్వభావం, వస్త్రధారణ, విభూతి కుంకుమలతో బ్రహ్మలోకం నుంచి దిగివచ్చిన నాదయోగిలా వచ్చి ఆయన కూర్చునే తీరు అసదృశం. తుంబుర నారదుల వలె ఆయన, పుగళేంది రాగానే ఏ సినిమా ఆఫీసులోనైనా సరే ఒక పవిత్ర వాతావరణం ఏర్పడేది.

దర్శకుడు చెప్పే సన్నివేశం వళ్లంతా చెవులు చేసుకుని వినడం, ముందు పెట్టిన పాటను ముఖ్యంగా పల్లవిని కళ్లతో చదివి మనసుతో అనువదించుకుని బుద్ధితో రంగరించి సంగీతంతో పల్లవింపజేసి సన్నివేశానికి 'ఇదే పాట' అన్న రీతిలో వినిపించడం జరిగేది. ఆ పాట పల్లవి వినగానే అందరికీ ప్రత్యామ్నాయం అడిగే దమ్ము ఉండేది కాదు, ఈ స్థాయి నేనెరిగినంతలో మహదేవన్‌కే సొంతం.

ఆదిశంకరులకు పద్మపాదుడు, కాళిదాసుకు మల్లినాథసూరి, జాన్సన్‌కు బాస్వెల్ వలె మహదేవన్ గారికి దొరికినవారు పుగళేంది. ఆయన మలయాళంలో మంచి కథకుడు, కవి. పాతికేళ్ల తెలుగు పరిచయంతో ఆయన తెలుగులో కూడా కొన్ని కవితా ఖండికలు రాశారు. కొన్నిటిని నేను పత్రికలలో ప్రకటించడమూ జరిగింది. 'నాకు చనుబాలు కావాలి' అనే ఆయన కవితకు బహుళ ప్రశంసలు వచ్చాయి.

పాటల రచయితగా నా ఎదుగుదలకు పునాదులు వేసిన గురువులలో ఒకరు మహదేవన్. స్వరబద్ధం కావలసిన పాటకు మాటలు, పొందిక ఎలావుండాలి, దానికి గల గణితమేమిటి, సమం, అసమం అంటే ఏమిటి వగైరాలు అప్పటికే నాకు కొంత తెలిసినా స్వరపద సంధానం సాధించడానికి ఏ మెలకువలు కావాలి, భావాలను ఎలా పలికించుకోవాలి అనేవి ఆయన స్వర రచన చేసే విధానం చూసి నేను నేర్చుకున్నాను. రాగానికి కటువుగా తగిలే పదాలను అప్పటికప్పుడు మార్చుకుంటూ నా గీతరచనలో నేను తొలిపాఠాలు ఆయన దగ్గరే దిద్దుకున్నాను. ఈ మాట చెప్పడానికి నాకు చాలా గర్వంగా వుంటుంది. ఆదిశంకరులు గురువుకు 'అధిగతతత్త్వః' అనే నిర్వచనం యిచ్చారు. మహదేవన్ నాకు అటువంటి గురువు. 'సిరిసిరిమువ్వ' పాటల రచనలో ఆయన నా వెన్నంటివుండి చక్కని భావప్రకటన, భాషాలాలిత్యం వచ్చిన చోట బొటనవేలు చూపి 'విజయోస్తు' అని మౌనంగా చిరునవ్వుతో ఆశీర్వదించిన సందర్భాలెన్నో.

**గజ్జె ఘల్లుమంటుంటే గుండె ఝల్లుమంటుంది**
**గుండె ఝల్లుమంటుంటే కవిత వెల్లువౌతుంది**
అనే పల్లవి రాసిన క్షణంలో
**ఝుమ్మంది నాదం సైఁ అంది పాదం**
**తనువూగింది ఈ వేళ చెలరేగింది ఒక రాసలీల**
అని రాసినప్పుడు
**అందానికి అందం ఈ పుత్తడి బొమ్మ**

**అందరికీ అందనిదీ పూచిన కొమ్మ**

అనే పాట రాసినప్పుడు ఆయన మౌనాశీరక్షతలకు నేను నోచుకున్నాను. 'ప్రేమబంధం' చిత్రంలో- మామతో ఇది నా మూడవ చిత్రం- ఒక ముఖ్యసన్నివేశానికి నేను పాట రాయడం, దర్శకుడు విశ్వనాథ్‌గారు ఓకే చేయడం జరిగిపోయింది- పల్లవి మామ ముందు పెట్టారు.

**'చేరేదెటకోతెలిసి చేరువకాలేమని తెలిసి చెరిసగమైనామెందుకో తెలిసి'**- ఇదీ ఆ పల్లవి. నిజానికి ఈ పల్లవి ఇప్పుడు చూస్తుంటే నాకే నవ్వు వస్తుంది. మొదటి పంక్తికి రెండవ దానికి తాళం ఎలా సరిపెట్టడం! మాత్రల ప్రకారం కూడా బేసి సంఖ్య వస్తున్నది. ఎలా పాటగా పాడడం. ఒకసారి నిగూఢంగా నావంక చూశాడు మామ- అప్పు (పుగళేంది) నవ్వుకున్నాడు. నాకేమీ అర్థం కాలేదు. కొంచెం భయపడ్డాను. దర్శకులూ అక్కడే వున్నారు. నోట 'ట్యూన్' రావడం లేదు. 'ఏమైనా మార్చాలా?' అన్నాను ధైర్యం తెచ్చుకుని. 'వద్దులే... ఇటుచూడు' అని ఆ మహామేధావి రెండవ లైనులో 'తెలిసి' అన్న పదాన్ని మరో రెండుసార్లు అని పల్లవి ముగించారు. అందరి ముఖాలూ వికసించాయి. 'తెలిసీ, తెలిసి తెలిసీ' అనేసరికి పాటలో భావానికి ప్రాణమొచ్చింది. సన్నివేశ సాహిత్యానికి రూపకల్పన జరిగింది. పాట రాయడంతో పాటు పాటకు బాణీ కట్టడంతోను, పాడించడంతోను ప్రాణప్రతిష్ట చేయడంలో మహదేవన్ గారి తర్వాత ఆ స్థాయిలో కనిపించేది శ్రీ రమేష్ నాయుడు ఒక్కరే!



**'ట్యూన్' అనేది ఒకటి వుండదని, ఉన్నా అది రచనకు ప్రతిబంధకమనీ, కవి రాసిన దాన్నిబట్టి సన్నివేశానికి వున్న అవసరాన్ని బట్టి 'ట్యూన్' వస్తుందని మహదేవన్ అనేకసార్లు చెప్పేవారు. 'మామ చెప్పింది కరెక్ట్' అనేవారు రమేష్ నాయుడుగారు.**

వాణిజ్యపరమైన భారీ చిత్రాలకుసైతం మామ తీసుకునే జాగ్రత్తలు ఆశ్చర్యకరంగా వుండేవి, కదిలేదీ కదిలించేదీ, అయిన ట్యూన్ కట్టేవారు మామ.

సత్యచిత్ర సంస్థ నిర్మించిన 'అడవిరాముడు' నా మొదటి కమర్షియల్ పాటల రచనకు శ్రీకారం చుట్టిన చిత్రం. దర్శకుడు శ్రీ రాఘవేంద్రరావు. ఎన్.టి.ఆర్, జయసుధ, జయప్రద నటించిన ఈ చిత్రం చరిత్రను సృష్టించి బాక్సాఫీసును బద్దలగొట్టింది. మహదేవన్ సంగీతంలో రాసిన ప్రతి పాటా సూపర్‌హిట్ అయింది. అందులో రాసిన 'ఆరేసుకోబోయి పారేసుకున్నాను' అనే పాట ఆ రోజుల్లో (1976) కోటి రూపాయల పాట అనే పేరు తెచ్చుకుంది. వాడవాడలా మోగిపోయింది. ఆ పాటల కంపోజింగు జరుగుతున్న సందర్భంలో జరిగిన కొన్ని సంఘటనలు నేను ఎన్నటికీ మరువలేనివి-

**'ఎన్నాళ్ళకెన్నాళ్ల కెన్నాళ్ళకు**
**ఎన్నెల్లు తిరిగొచ్చె మా కళ్లకు'**

ఇది మొదటి పాట. నేను యధేచ్ఛగా రాసిన ఈ పాటను తాళాల వైవిధ్యంతో, జానపద మధురిమలతో ఆ మహానుభావుడు ఎంత అద్భుతంగా స్వరపరిచాడో తలుచుకుంటే ఒళ్లు పరవశిస్తుంది. దానికి తగ్గట్టు చిత్రీకరణలో సొగసులు ఎన్నెన్నో !అటు తర్వాత రాసిన పాట-

**'అమ్మతోడు అబ్బతోడు నీతోడు నాతోడు**
**అన్నిటికీ నువ్వే నాతోడు'**

చిలిపితనం చిదిపి గీతంగా మలిచారు మామ-

**'కృషివుంటే మనుషులు ఋషులౌతారు**
**మహాపురుషులౌతారు**
**తరతరాలకీ తరగని వెలుగవుతారు**
**ఇలవేలుపులౌతారు'**

మహదేవన్ ఈ పాట స్వరీకరించిన తర్వాత దీనికొక తాళం వున్నట్టు వినిపించింది గానీ, అంతకుముందు అది నిజంగా ఉపన్యాసమే! ఆంధ్రపత్రిక ఎడిటోరియల్లే! దాన్ని అలా ఆపోశనం పట్టడం ఆ అగస్త్యుడికే చెల్లింది. వేడివేడి పాటల్లో వెలుగు బాటలాంటిదీ పాట. పదుగురు మెచ్చిన పాట- సాహిత్యానికి ఊపిరిపోసిన సంగీతానికి కర్త మహదేవన్. తరువాత నాలుగవ పాటగా రానే వచ్చింది-

**'ఆరేసుకోబోయి పారేసుకున్నాను**
**కోకెత్తుకెళ్లింది కొండగాలి- నువ్వు**
**కొంటెచూపు చూస్తేనే చలి చలి'**

అంతకుపూర్వం ఎన్నడో వచ్చిన **'అరెరెరె ఎట్టాగో వుంటాది ఓలమ్మో'** అనే పాట రీతిలోనే **'అరెరెరె ఆరేసుకోబోయి'** అనే పద్ధతిలో ఈ పాటకూడా చేస్తే బాగుంటుందేమో అన్నారు నిర్మాత నెక్కంటి సత్యనారాయణగారు. 'అలా చేయకూడదు- అరెరెరెలని చివరికి పెట్టి చెయ్యాలి' అని కచ్చితంగా చెప్పారు మహదేవన్. చెబుతూనే ఇప్పుడు మనం వింటున్న పద్ధతిలో ట్యూన్‌చేసి పాడారు. మొత్తం అందరూ 'ఓకే' అనేశారు.

అయితే ఈ నాలుగో పాట రాసి తనముందు పెట్టినప్పటి నుంచీ 'మామ' మళ్లీ నేను భయపడేటట్లు చూపు విసరడం మొదలుపెట్టారు. 'ఆయన చెప్పడు. నాకా తెలీదు- అడగడానికి భయం' ఇదీ పరిస్థితి. ఎవరూ లేకుండాచూసి పై పాట కంపోజింగు అవ్వగానే 'ఇది ఎన్నో పాట!' అని మామ నన్ను అడిగారు. 'నాలుగోది... ఇంకా రెండువున్నాయి' అన్నాను. 'ఇంకా రెండేగా వున్నది?' అని మళ్ళీ అడిగారు. అవునన్నాను. కానీ ఏదో కొత్తగా వుంది ఆయన కంఠస్వరం- నిశితంగావుంది చూపు- అర్థం కాకపోగా 'ప్రేమబంధం' నాటి పరిస్థితి మళ్లీ ఎదురైంది. మళ్లీ ఆ మర్నాడే కంపోజింగు. 'అడవిరాముడు' పాటల కంపోజింగు మొత్తం ఏడురోజులలోపల పూర్తి కావడం విశేషం.

యథాప్రకారం మళ్లీ అందరూ కొలువుతీరారు. దర్శకుడు సన్నివేశం చెప్పి దానిని ఆయన తీయదలుచుకున్న పద్ధతి, తనకి ఎలా కావాలీ అనే విషయాలు వివరించి పాట కాగితం మామకి అందించారు, ఆ పల్లవి చూస్తూనే ఒక దృక్ బాణం నాపై సంధించారు మామ! నా పై ప్రాణం పైనే రెక్కలు కట్టుకుని సిద్ధంగా వుంది ఎగరడానికి! ఆ మూగబాధ ఏం చెప్పను-

**'కోకిలమ్మపెళ్లికి కోనంత పందిరి**
**చిగురాకులు తోరణాలు చిరుగాలి సన్నాయి'**

అనే పల్లవి. దర్శకుడు చాలా మురిపెంగా తీయదలచుకున్న పాట అది. ఆయనకి ముద్దొచ్చిన పల్లవి యిది. సాహిత్యం చూసి కొంత మామ చూపు చల్లబడింది. తనలో తానే నవ్వుకున్నారు చాలాసేపు- ఆ నవ్వుకు వంతపాడారు పుగళేంది. ఎందుకు నవ్వుకుంటున్నారో ఎవరికీ తెలీదు. నన్ను గురించే అని మాత్రం నాకు తెలుసు. ఏం తెలుసో ఎంత తెలుసో,

ఎన్నాళ్లనుంచీ తెలుసో ఆఖరికి తబలా మైఖేల్ కూడా నవ్వడం మొదలుపెట్టారు. ఎందుకు నవ్వినా నవ్వు నాలుగందాల స్వీటు అన్నట్టు తనుకూడా నవ్వి రాఘవేంద్రరావు పక్కగదిలోకి వెళ్లారు. గదిలో మామ, అప్పు, మైఖేల్, నేనూ తప్ప ఎవరూలేరు. అప్పుడు మామ నన్ను దగ్గరకు రమ్మనిపిలిచి 'జ్ఞానస్థుడివే. అన్ని పాటలూ ఒకే తాళంలో రాస్తావేరా- అన్నీ త్రిశ్రంలోనే రాస్తే ఏం చెయ్యనురా... ఆరు పాటల్లో అయిదు ఒకే తాళంలో వున్నాయి. ఆరో పాటైనా చతురస్రంలో రాయరా' అన్నాడు.

పై ప్రాణం పైనే పోయింది. గాభరాపడ్డాను. మళ్లీ ఆయనే 'ఫరవాలేదు. ఇప్పటివరకూ యిబ్బంది ఏమీలేదు. అయిదోపాట చాలాబాగుంది. అయిదు పాటలూ సాహిత్యంలో సంగీతంలో ఎలావున్నదీ మనకే తెలుసు, ఆరో పాట మాత్రం నేను చెప్పింది మరిచిపోకు అన్నాడు. ధైర్యం చెప్పాడు. ఎవ్వరూ గదిలో లేని సమయంలో చెప్పడం తండ్రిప్రేమను తలపించింది. ఆ పాట ఎంత అద్భుతంగా మామ చేశాడో, దర్శకుడు తీశాడో అందరికీ తెలిసిన విషయమే.

ఇక ఆరవపాట క్లైమాక్సు పాట. దర్శకుడు పాటను చూసి 'ఓకే' చేసిన తర్వాత 'మామ' దగ్గర పెట్టారు. అదో హడావుడీ హంగామా, మారువేషాలు వగైరాలతో సాగే పాట. సన్నివేశం చెప్పి పనిమీద దర్శకుడు వెళ్లిపోయాడు. పాట చూస్తునే మామ కోపంగా 'ఏం రాశావు చదువు' అన్నాడు. **'చూడరా చూడరా సులేమానుమియ్యా'** అని చదివాను, ఇది ఏం తాళం అన్నాడు. నాకు నేనోట్యూన్ అనుకుని రాశానేమో చతురస్రంలో రాశాను అన్నాను. తను పాడి వినిపించి ఇది చతురస్రమా అన్నాడు. కాదన్నాను, ఆయనకు నవ్వు వచ్చింది. 'తాళం మార్చి రాయి' అన్నాడు. వెంటనే ఎలా మార్చాలో తెలియలేదు. మారిస్తే దర్శకుడు ఏమంటాడో అంతకన్నా తెలియదు. మింగుడుపడని పరిస్థితి. మామ ఇదంతా గమనించి 'ఇంకా రెండు 'చూడరా'లు తగిలించు' సరిపోతుంది అన్నాడు.



**'చూడర చూడర చూడర చూడర ఒక చూపూ సులేమాన్‌మియా'** అని తిరిగిరాశాను. అప్పుడది అవలీలగా చతురస్రంలో వచ్చింది. అందరూవిని ఊగిపోయారు. అలా ముగిసింది 'అడవిరాముడు' సంగీతోపాఖ్యానం.

సినీ కవిగా అప్పుడే కళ్లు తెరుస్తున్న చిన్నవాడిని తల్లిలా కడుపులో పెట్టుకుని, తండ్రిలా కాపాడిన ఉత్తమ కళా సంప్రదాయానికి చెందిన మహావ్యక్తి మహదేవన్.

మహదేవన్ గారి వేషధారణ శుచికీ, నిష్కళంకత్వానికి ప్రతీకగా వుండేది. ఇస్త్రీ చేసి మడతనలగని బంగారుఛాయ సిల్కు చొక్కా, తెల్లని జరీపంచె అడ్డకట్టుతో మౌనముద్రతో ఆయన వస్తుంటే మూర్తీభవించిన సంగీతం నడిచి వచ్చినట్లే వుండేది. ఫాలభాగాన విభూతి, తిలకం ఆయన నిష్టను వెల్లడించేవి. చక్రవర్తి, సత్యం, రాఘవులు వంటి సంగీత దర్శకులు ఆయన పట్ల ఎంతో గౌరవంతో మెలిగేవారు.

అనేకమంది సంగీత దర్శకులు పాట ట్యూన్ చేయవలసి వచ్చినప్పుడు 'ఇది మామ అయితే ఎలా చేస్తాడు' అని యోచించి అలా చేసిన సందర్భాలు ఉన్నాయి. కారంచేడులో ఒకసారి సురేష్ వారి 'సంఘర్షణ' చిత్రానికి మామ మోడల్‌లో చేయమంటే నా పాట ఒకటి **'కట్టుజారిపోతావుంది..చీర కట్టుజారిపోతావుంది'** అలాగే చేసాడు చక్రవర్తి.

మామ మీద అందరికీ అటువంటి గురుత్వం వుండేది. అలాగే మామ పద్ధతి అనేది సినీ సంగీతంలో నేపథ్యంగా పలువురు అనుసరించారు. ముఖ్యంగా 'రిథమ్' విషయంలో మహదేవన్‌గారు ప్రవేశపెట్టిన జానపద ధోరణులు చాలా పాపులర్ అయ్యాయి. 'మామమామమామ' అనే పాటతో ఆయన ఈ కొత్త ధోరణులు ప్రవేశపెట్టారు.

పాటను స్వరపరిచేటప్పుడు 'రిథమ్'ను కట్‌చేసి రాగంతో తాత్పర్యంచెప్పే సంగీతభాష్యకారుడుగా మహదేవన్ లబ్ధప్రతిష్టుడు. అందుకు ఎన్నో ఉదాహరణలు ఉన్నాయి. ఆయన ప్రచ్ఛన్న వాగ్గేయకారుడు. సరిగమలు ఆయన మౌన సాహిత్యానికి 'డుముపులు'. నేనెరిగిన సంగీత దర్శకులు ఎందరో మహానుభావులు-అందులో కొందరికి ఎన్ని వందనాలు చేసినా చాలదు. అటువంటి అనేక వందనాలు చేయించుకోగల మహనీయుడు మహదేవన్. ఆయనకు ముందు తరంలో తెలుగు సినిమారంగానికి చెందినంత వరకు చిత్తూరు వి. నాగయ్యగారు, ఇంకా పూర్వం దైతా గోపాలంగారు-వీరంతా అనుసరించింది భావ ప్రకటనకు ప్రాణం పోసే మనోధర్మ సంగీత పద్ధతి. 'ట్యూన్'లోకి మాటలు కుమ్మరించే పద్ధతి కాదు. అది కృతకమైనదని వీరి నమ్మకం. మనోధర్మం ఏ సన్నివేశానికి ఎలా స్పందిస్తుందో, ఆ ప్రయత్నంగా ఏ రాగ ధోరణితో వెల్లడికాగలదో అనుభూతి లోతులనుంచి రంగరించి 'ట్యూన్' ఇచ్చిన మహానుభావులూ ఉన్నారు.

అన్నీ అన్ని అనుభవాలుగా మధుర స్మృతులుగా మిగిలే మహదేవన్‌గారి సంగీత దర్శకత్వంలో 'శంకరాభరణం' పాటల కంపోజింగు మరపురాని మరో మధురానుభూతి.

కంపోజింగు ప్రారంభమైన రోజున దర్శకుడు విశ్వనాథ్‌గారు నన్నూ మహదేవన్‌గార్నీ చూసి 'నా కథలో హీరో అరవై యేళ్ల వృద్ధుడు, గ్లామరేమాత్రం లేనివాడు. గ్లామరస్ హీరోయిన్ లేదు. డ్యూయెట్లు, ఫైట్లు అసలే లేవు. నాకున్నదల్లా మీరిద్దరే. మిమ్మల్ని చూసి నేను ఈ ధైర్యం చేస్తున్నాను' అంటూ దేవుడి పటం దగ్గర వున్న రెండు కొబ్బరి కాయలు మా చేతికిచ్చి, అక్కడేవున్న మాటల రచయిత జంధ్యాల గారికి మరోకాయ ఇచ్చారు. మా చేతనే పూజ చేయించారు. 'వాతాపిగణపతింభజే' అయిన తర్వాత తొలిసన్నివేశం, కథ పూర్తిగా చెప్పారు.

**'ఓంకారనాదానుసంధానమౌ గానమే శంకరాభరణము'** అనే పల్లవి అనుకోకుండా నాకు రావడమూ దానిని మామ వెంటనే వాగ్గేయ పద్ధతిలో శంకరాభరణరాగంలో స్వరపరచటమూ జరిగాయి.

గంటన్నర లోపల రెండు చరణాలతో సహా పాట రాయడము, స్వరాలు సమకూర్చడమూ కూడా జరిగిపోయింది. ముహూర్తబలం అంటే ఇదే కదా! శంకరాభరణానికి సంబంధించిన పనులన్నీ అలాగే నిరాఘాటంగా జరిగిపోయాయి.

**'సామజవరగమనా'** అనే త్యాగరాజ కీర్తనతో సాగే యుగళగీతానికి నేను రాసిన చరణాలు మహదేవన్ ఎంత మధురంగా శ్రావ్యంగా భావస్ఫోరకంగా లలిత సంగీతధోరణిలో మూలరాగానికి(హిందోళం) తగినట్లు స్వరపరిచిందీ అందరికీ తెలుసు. అలాగే **'శంకరా నాద శరీరాపరా'** అనే పాటని, **'దొరకునా ఇటువంటి సేవ'** అనే పతాక సన్నివేశపు గీతాన్ని స్వరపదాల అద్వైతాన్ని చాటే విధంగా ఆయన తీర్చిదిద్దాడు.

ఆ పాట రాసినప్పుడు నేను అనారోగ్యంగా వున్నాను. అతికష్టం మీద

రికార్డింగు జరుగుతున్న విజయా గార్డెన్సు పాత థియేటర్‌కు వెళ్లాను. అక్కడ ఏదో పనిమీద వచ్చిన ఆత్రేయ గారు కనిపించారు. నన్ను చూడగానే 'ఇదేమిటయ్యా! ప్రాణాలు తీసే అను పల్లవి రాశావు. ఎంత పాడేవాడికైనా ఊపిరందక ప్రాణాలు పోవాల్సిందే 'అన్నారు. 'అయితే నా శ్రమ ఫలించింది, సన్నివేశమే అది ' అన్నాను.

'దొరకునా ఇటువంటి సేవ
నీ పదరాజీవముల జేరు
నిర్వాణ సోపాన
మధిరోహణముసేయుత్రోవ
దొరకునా ఇటువంటి
సేవ' అన్నది త్యాగరాజస్వామి కీర్తన. అది బిలహరి రాగంలో వుంది. కానీ దీనిని మహదేవన్ కళ్యాణి రాగంలో సన్నివేశానికి సరితూగే విధంగా చేశారు.



సప్తపది, శుభోదయం, సీతామాలక్ష్మి ఇలా ఎన్నో చిత్రాలు మా ఇద్దరి కాంబినేషన్‌లో వస్తున్న రోజుల్లో సంగీతానికి కొత్త కోణాలు ఆవిష్కరించి, లేత వయసులనీ, తేనె మనసులనీ పలికించిన రాగాలతో 'జేగంటలు' చిత్రం రావడం జరిగింది.

'ఇది ఆమని సాగే చైత్రరథం
ఇది రుక్మిణి ఎక్కిన పూలరథం
మరోలోకమున మనోవేగమున
పరుగులు తీసే మనోరథం'

'వందనాలు, వందనాలు
వలపుల హరి చందనాలు
వెన్నెలలో వేచివేచి
వెచ్చనయిన నా స్వామికి'

'తెలుసులే తెలుసులే
నీకు తెలుసో లేదోగాని
నాకు తెలుసులే' వంటి పాటలు ఎందరికో హృదయాలకు దగ్గరై చెరగని ముద్రలు వేశాయి. చిత్రం వాణిజ్యపరంగా విజయవంతంకాకపోవడంతో ఆశించినంత 'మాస్' పరంగా పాపులర్ కాలేదు. స్థాయి గల ప్రేక్షక శ్రోతలకు మాత్రం అవి నేటికీ నిత్యగానాలే.

చిలిపి తెలుగుతనపు చిలకపాటలకు మహదేవన్ చేసిన బాణీలు అనుభవజ్ఞులకు సమ్మోహనాస్త్రాలే. 'బుల్లెట్' చిత్రంలో (బాపు-రమణ) నేను రాసిన

'రాధ కృష్ణుడికి ఏమిస్తుందో
ఇస్తావా మరి
సీతకు రాముడు ఏమవుతాడో
అవుతావా మరి
ముందివ్వు మరి
ముందవు మరి' అనే పాటకు చక్కిలిగింతలే సరిగమలుగా 'ట్యూన్' చేశారు మామ. అలాగే 'సిరిసిరిమువ్వ'లో 'ఒదిగున్న పిలువు ఒక గొంతులోనే పలికింది','గోదారల్లే ఎన్నెట్లో గోదారల్లే' వంటి పాటలు తెలుగు జాణతనంతో జానపదంతో పలకరిస్తాయి.

మహదేవన్ జీవిత సోపానం అధిరోహించడానికి పడ్డ శ్రమ ఒక జీవిత కాలాన్ని కూలి అడిగింది. ఆయనలో నిండారి నిగూఢమైన సంగీత శాస్త్రజ్ఞానానికి వెల్లడి లేక, అది వెల్లువలై తనలోనే సుడులు తిరుగుతున్నా మౌనిగానే వుండిపోయాడు. హెచ్.ఎం.వి.వారి పుణ్యమా అని అనుకోకుండా సుముహూర్తం వచ్చింది. నాటి నుంచీ ఆయన పాటగా, తెలుగు పాటగా పునర్జన్మ ఎత్తాడు. '**తనగీతి అరవజాతిని పాటకులనుగా దిద్ది వర్ధిల్లిన తెనుగువాణి**' అన్న రాయప్రోలు వారి మాటను నిలబెట్టింది మామ జీవితం.

సాహిత్యం రెండవదని, సంగీతమే ప్రధానమనే అహంకారపు అంధత్వం కమ్మిన ఏకాక్షులు, భావబధిరులు మహదేవన్ కాలం నాటికి లేరు. రాజన్-నాగేంద్ర వంటి వారు ట్యూన్లు మాత్రమే ఇచ్చినా వాటిలో వున్న మనోధర్మం సాహిత్యానికి ఊపిరి పోసేది. అలాగే ఇళయరాజా, ఎం.ఎస్.విశ్వనాథన్ వంటి వారు కూడా. వారిలో ప్రతి ఒక్కరూ సవ్యసాచి, సగమెరుక కలవారు వారిలో లేరు.

గ్రూపు రాజకీయాలు, ముఠా వాణిజ్యాలు లేని పుణ్యకాలంలో పుట్టిన మహాసంగీత దర్శకులు మహదేవన్ వంటి మహనీయులు. అవే వుంటే ఆయన తెలుగులో ఇన్ని చిత్రాలకు సంగీతం ఇవ్వగలిగి వుండేవాడే కాదు.

పాటలే పచ్చ తోరణాలుగా పాటలీపుత్రంలో గోరింటాకు నోరింటాకుగా నోరు పండించిన రోజుల్లో 'కొమ్మకొమ్మకో సన్నాయి - కోటిరాగాలు వున్నాయి' అనే పాట ఎందరి హృదయాలనో దోచుకుంది. ఆ పాట రచన నాది.. స్వరరచన శ్రీ కె.వి.మహదేవన్. ఈ పాట స్వరబద్ధం చేసిన మహదేవన్‌ను అదే శీర్షికన స్మరించడం కేవలం రాగతాళీయం.

మహదేవన్ మధురస్మృతికి నా గీతాంజలి.

**- వేటూరి సుందరరామ్మూర్తి**

# దిసీజ్ ఖర్మ... దట్సాల్...!

సత్యమూర్తి



కొత్తగా కొన్న టాప్‌లెస్ కారులో సరదాగా కుటుంబంతో
కలిసి పిక్నిక్కని బయలు దేరుతారు.




దారిలో ట్రాఫిక్ జామ్‌లో ఇరుక్కుపోయి-ముందో మున్సిపల్ చెత్తలారీ, వెనక -
'మొక్కలకి ప్రకృతి సిద్ధమైన ఎరువులను' తీసుకు వెళ్ళేలారీల మధ్య బందీలైపోతే...



సినిమా 100వరోజున కొన్న టికెట్‌కి లాట్రీలో కారుని ప్రైజ్‌గా ప్రజలందరి
సమక్షంలో సంబరపడుతూ తీసుకుంటారు.




షెడ్డుకట్టించే లోగా రాత్రికి రాత్రే వచ్చిన గాలివానకి పక్కనే ఉన్న పేద్ద చెట్టు
విరిగి కారు మీద పడితే...



స్నేహితులతో మందు కొడుతున్న సంగతి అమ్మా, నాన్నకి తెలిస్తే తిడతారు
కాబట్టి - గోడ దూకి వెళితే హాయిగా పడుకోవచ్చని ప్లాన్ చేసుకుంటారు



గోడ దూకడంలో కాలు విరిగి మీరు అరిచిన అరుపు వల్ల లేవనెత్తడానికి
వచ్చిన అమ్మా నాన్నకి మీ విషయం తెలిసిపోతే...

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : రాము (తమిళం)

రచన : కణ్ణదాసన్

సంగీతం : ఎం.ఎస్.విశ్వనాథన్

గానం : పి.బి.శ్రీనివాస్

నిలవే ఎన్నిడమ్ నెరుంగాదే - నీ
నినైక్కుమ్ ఇడత్తిల్ నాన్ ఇల్లై
మలరే ఎన్నిడమ్ మయంగాదే - నీ
మయంగుమ్ వగైయిల్ నానిల్లై
కోడైయిల్ ఒరునాళ్ మళై వరలామ్ - ఎన్
కోలత్తిల్ ఇనిమేల్ ఎళిల్ వరుమో
పాలైయిల్ ఒరునాళ్ కొడి వరలామ్ - ఎన్
పార్వైయిల్ ఇనిమేల్ సుగమ్ వరుమో
ఊమైయిన్ కనవై యార్ అఱివార్ - ఎన్
ఉళ్ళత్తిన్ కదవై యార్ తిఱప్పార్
మూడియ మేగమ్ కలైయుం మున్నే నీ
పాడవందాయో వెణ్ణిలవే...
అమైది ఇల్లాద నేరత్తిలే - అన్ద
ఆణ్డవన్ ఎన్నైయే పడైత్తు విట్టాన్
నిమ్మది ఇళందే నాన్ అలైన్దేన్ - ఇన్ద
నిలైయిల్ ఉన్నై ఏన్ తూదు విట్టాన్?



'రాము' తమిళ చిత్రంలో కె.ఆర్.విజయ, జెమిని గణేషన్

ఎ.వి.ఎం సంస్థ నిర్మించిన 'రాము' తమిళ చిత్రంలోని ఈ పాట-పి.బి.శ్రీనివాస్ గానం చేసిన గొప్ప పాటలలో ఒకటి. ఎన్నిసార్లు విన్నా తనివి తీరని ఈ పాటను కణ్ణదాసన్ రాశారు. ఎం.ఎస్.విశ్వనాథన్ సంగీత దర్శకత్వంలో వెలువడిన మధుర గీతాలలో ఈ పాట స్థానం ప్రత్యేకం.

తమిళ చిత్రంలో జెమిని గణేష్ నాయకుడు. కె.ఆర్.విజయ నాయిక. తెలుగులో ఎన్.టి.రామారావు కథానాయక పాత్రనూ, జమున కథానాయిక పాత్రనూ పోషించారు. తెలుగు చిత్రంలోని పాట రాసినవారు దాశరథి. సంగీత దర్శకులు గోవర్ధనం. తమిళ చిత్రంకోసం విశ్వనాథన్ చేసిన వరసలనే తెలుగు చిత్రంలోనూ యథాతథంగా వాడుకొన్నారు.

తమిళ చిత్రంలోని సన్నివేశమే తెలుగు చిత్రంలోనూ ఉంది. కథానాయకుడి భార్య అగ్ని ప్రమాదంలో అకాల మరణం పాలయింది. అది చూచి ఆమె కొడుకుకు మూగతనం వస్తుంది. నోరులేని పసివాడికి తల్లీ తండ్రీ తానే అయి పెంచుతుంటాడు నాయకుడు. ఆ నాయకుణ్ణి ఒక యువతి చూసింది. ముందు జాలిపడింది. ఆ తర్వాత నాయకుణ్ణి ప్రేమించసాగింది. నాయకుడికి ఆమె ప్రేమ అర్థమైంది. కాని ఆ ప్రేమను అందుకోనే స్థితిలో అతను లేడు. ఆమెకు తన పరిస్థితి వివరిస్తూ జాబిలినీ పువ్వునూ అన్యాపదేశంగా సంబోధిస్తూ పాట పాడాడు.

తమిళగీతం భావం:

"జాబిలీ నన్ను సమీపించకు -నీవు
అనుకొన్న చోట నేను లేను
పువ్వా నన్ను చూసి మైకంలో పడకు - నీవు
మైకంలో పడే తీరులో నేను లేను
వేసవిలో ఒకనాడు వాన రావచ్చు- నా
తీరులో ఇకపైన సొగసు వచ్చేనా?
ఎడారిలో ఒకనాడు పూలతీగ రావచ్చు- నా
చూపులో ఇకపైన సుఖం వచ్చేనా?
మూగ కల ఎవరికి తెలిసేను? నా
హృదయపు వాకిలిని ఎవరు తెరవగలరు?
ముసిరిన మేఘం చెదరేముందు - నీవు
పాడడానికి వచ్చావా తెలి జాబిలీ....
ప్రశాంతత లేని వేళ - ఆ
భగవంతుడు నన్ను సృష్టించాడు
నెమ్మది కోల్పోయి నేను అలమటిస్తున్నాను - ఈ
స్థితిలో నిన్ను ఎందుకు దూతగా పంపాడు?"

తమిళంలో స్త్రీని జాబిలితో పోల్చే ఆనవాయితీ ఉంది. తమిళంలోనూ తెలుగులోనూ కూడా స్త్రీని పువ్వుతో పోల్చే సంప్రదాయం ఉంది. తమిళంలో 'నిలవు' అంటే జాబిలి. 'మలర్' అంటే పువ్వు.

ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం సంగీతయాత్ర తొలి రోజులలో ఎం.ఎస్.విశ్వనాథన్‌ను కలుసుకొన్నారు. తమిళగీతం ఏదయినా పాడి వినిపించమంటే- బాలు- విశ్వనాథన్‌కు ఈ పాట వినిపించి మెప్పించారు. (జాబిలిని చేరరావద్దనే పాటతో తమిళ చిత్రాలలో పాడే అవకాశం పొందిన బాలు ఆ తర్వాత 'ఆయిరమ్ నిలవే వా'- 'వేవేల జాబిలి రా' అనే పాట ద్వారా ప్రసిద్ధి గడించడం విశేషం)

సన్నివేశపరంగా ఈ పాటకు ఎంతో ప్రాముఖ్యం ఉంది. జాబిలి కథానాయకుడి దగ్గరికి వస్తున్నది. కాని అతని హృదయపు వాకిలి మూసి ఉంది. దాన్ని ఎవరు తెరవగలరు? నాయకుణ్ణి అతని కొడుకు మూగతనం కూడా బాధిస్తున్నది. ఆ మూగవాడి కల లేమిటో ఎవరికి తెలుసు? నాయకుడిది చిత్రమైన స్థితి. చెదరిపోయిన అతని జీవితాన్ని సరిదిద్దడం

ఎలా? మోడయిపోయిన అతని జీవితం తిరిగి ఎలా చిగురిస్తుంది? భార్యా వియోగం నుంచి తాను పూర్తిగా తేరుకోలేదు. "ముసిరిన మేఘం చెదరేముందే నీవు పాడడానికి వచ్చావా?" అని తన స్థితిని సూటిగానే చెబుతున్నాడు ఆ నాయకుడు. అశాంతిగా ఉన్న వేళ ఎప్పుడో దేవుడు తనను సృష్టించాడనే ఆ నాయకుడు ప్రశాంతత కోల్పోయి తాను తల్లడిల్లుతుండగా- ఆ జాబిలిని 'దూతగా ఎందుకు పంపాడు?' అని ప్రశ్నిస్తాడు.

ఇటీవలి కాలంలో 'జాబిలమ్మ నీకు అంత కోపమా' వంటి పాటలు వచ్చినా- తెలుగులో జాబిలిని స్త్రీగా చూసే సంప్రదాయం లేదు. అందువల్లే కాబోలు దాశరథి 'మంటలు రేపే నెలరాజా' అని పల్లవిలోనే చందమామను పురుషుడిగానే పేర్కొన్నారు.

తమిళ గీతంలో 'మలర్ (పువ్వు) అని ఏకవచనంలో ఉండగా, తెలుగు పాటలో 'విరులు' అని బహు వచనరూపం కనిపిస్తుంది. తమిళ గీతం నాయకుడి స్థితిని ఒక చరణంలో వర్ణిస్తుంది. తెలుగు పాటలో ఆ వర్ణన రెండు చరణాలకు విస్తరించింది. తెలుగు పాటలో నాయకుడి స్థితిని వివరించడానికి తీగలు తెగిన వీణనూ, ఇసుక ఎడారినీ దాశరథి ఉపమానాలుగా వాడారు. నాయకుడి ఆవేదనకు అంతులేదనీ, ఆ జీవితంలో వెలుగు లేదనీ తెలుగు పాట చెబితే- తమిళ గీతం వేసవి వాననూ ఎడారిలో తీగనూ ప్రస్తావిస్తుంది.

తమిళ గీతంలోని చివరి చరణంలో మదిలో శాంతి లేనపుడు దేవుడు తనను సృష్టించాడని నాయకుడు చెబుతుండగా- తెలుగు పాటలో 'ఈ మనిషిని దేవుడు చేశాడు' అనడంలో పాత్రలోని వైరాగ్యమంతటినీ పలికించారు దాశరథి. తమిళ గీతంలో 'నిన్ను దూతగా ఎందుకు పంపాడు?' అని జాబిలీ విరీ అయిన నాయికను - నాయకుడు సూటిగా ప్రశ్నిస్తుండగా- తెలుగులో ఆ ప్రశ్న లేదు. దేవుడు మదిలో శాంతి లేనప్పుడు తనను సృష్టించాడు అనే అభిప్రాయాన్ని కొనసాగిస్తూ సుఖమూ శాంతీ తన నొసట రాయటం మరిచాడు అంటాడు తెలుగు నాయకుడు.

తమిళ గీతంలాగే తెలుగు గీతమూ విశేష ఆదరణపొందింది. తమిళ గీతం పల్లవిలో కనిపించే ప్రత్యేకతలు తెలుగు పాటలో కనిపించవు. తెలుగు పాట రెండవ చరణంలో కనిపించే చిత్రాలు తమిళ గీతంలో లేవు.

**పి.ఎస్.గోపాలకృష్ణ**

**'రాము' చిత్రం కోసం దాశరథి రాసిన పాట ఇక్కడ:**

మంటలు రేపే నెలరాజా - ఈ
తుంటరితనము నీకేలా
వలపులు రేపే విరులారా - ఈ
శిలపై రాలిన ఫలమేమి ॥మంటలు రేపే॥

ఆకాశానికి అంతుంది - నా
ఆవేదనకు అంతేదీ
మేఘములోన మెరుపుంది - నా
జీవితమందున వెలుగేది ॥మంటలు రేపే॥

తీగలు తెగిన వీణియపై - ఇక
తీయని రాగం పలికేనా
ఇసుక ఎడారిని ఎపుడయినా - ఒక
చిన్న గులాబీ విరిసేనా ॥మంటలు రేపే॥

మదిలో శాంతి లేనపుడు - ఈ
మనిషిని దేవుడు చేశాడు
సుఖమూ శాంతీ ఆనందం - నా
నొసటను రాయుట మరిచాడు ॥మంటలు రేపే॥



'రాము' చిత్రంలో జమున, ఎన్.టి.రామారావు

# మధుర సంగీతం... మదన్‌మోహన్ సంతకం

ఈ పేరు వింటేనే గుర్తొచ్చేది మాధుర్యం. ఆంగ్లేయుల పరిభాషలో చెప్పాలంటే అతని 'మిడిల్ నేమ్ మెలొడి' అతి తేలిగ్గా అనిపించే అతి కష్టమైన బాణీలు వేయడంలో అతను దిట్ట. అతని పాటలు వింటున్నంతసేపూ మనం కూడా పాడేయగలమని అనుకుంటాం. గాయకులతో గొంతు కలిపినంతసేపూ మనం పాడగలం కూడా.



ఆ తర్వాత మనమే పాడాల్సి వస్తే తెలుస్తాయి పాట్లు. అదీ మదన్‌మోహన్ ప్రత్యేకత.

సంగీతం లోతుల్ని తరచి చూసిన సంగీత దర్శకుడతను. బహుశా అందుకే, తెలుగు సాహిత్యంలో చాసో (చాగంటి సోమయాజులు)ను 'కథకులకు కథకుడు' అన్నట్టు. మదన్‌మోహన్‌ని 'సంగీత దర్శకులకు సంగీత దర్శకుడు' అనవచ్చునేమో. అతనికి ముందు తరంలో అనిల్ బిశ్వాస్, సి.రామచంద్ర ఈ పేరు తెచ్చుకున్నారు. లతామంగేష్కర్ కు మదన్‌మోహన్ పట్ల అంత గౌరవం, సాన్నిహిత్యం పెరగడానికి ఆ ఇద్దరు సంగీత దర్శకులతో ఇతనికి వున్న పోలిక కూడా ఓ కారణం కావచ్చు.

ఎస్.డి.బర్మన్‌లాంటి జనప్రియమైన గొప్ప సంగీత దర్శకుడు 'హీర్ రాంఝా'లోని పాటలు (ముఖ్యంగా 'యే దునియా యే మహఫిల్', 'మిలేన తుమ్‌కో ఘబ్‌రాయే') విని, 'ఈ చిత్రానికి సంగీతం నేను సమకూర్చానని చెప్పుకోగలిగితే ఎంత బాగుండు' అన్నారట. తన శ్రోతలనే కాక, తోటి సంగీత దర్శకులను కూడా మైమరపింప చేసిన స్వర సామ్రాట్టు మదన్‌మోహన్.

అతను దాదాపు వంద సినిమాల్లో సుమారు 670 పాటలకు సంగీతం సమకూర్చారు. వాటిలో సూపర్‌హిట్ సినిమాలు తక్కువ. సూపర్ స్టార్స్ ఉన్న సినిమాలు అంతకంటే తక్కువ. అద్భుతమైన అతని పాటలను కమర్షియల్‌గా క్లిక్ కా(లే)ని హీరోహీరోయిన్లు తెరమీద అభినయిస్తుంటే, చూసేందుకు బాధ కలుగుతుంది.

అతని పాటలు కావలసినంత హిట్ ఎందుకు కాలేదో అర్థం కావాలంటే, 'దేఖ్ కబీరా రోయా' సినిమా చూస్తే చాలు తెలిసిపోతుంది. ఇందులో పాటలు ప్రజాదరణ పొందాయంటే అది కేవలం మదన్‌మోహన్ అసాధారణ ప్రతిభ వల్లే. లేకపోతే 'కౌన్ ఆయా మేరే మన్‌కే ద్వారే' (మన్నాదే), 'మేరీ వీనా తుమ్ బిన్ రోయే' (లతా), 'హమ్‌సే ఆయాన గయా' (తలత్), 'ఆఖోంసే తేరీ హమ్‌నే తస్‌వీర్ బనాయీ హై' (లతా) వంటి పాటల్ని అనూప్‌కుమార్, శుభాఖోటే ఇత్యాదులు (హాస్యానికి పేరు పొందినవారు) అభినయిస్తుంటే నిరాశగా వుంటుంది. మదన్‌మోహన్ సినీ సంగీత జీవితానికి ట్రాజెడీ అంతా 75 శాతం నాసిరకం సినిమాలకు సంగీతం అందించడంలోనే ఉంది.

మదన్‌మోహన్‌ని తలుచుకోగానే గుర్తుకు వచ్చేవి లతా, ఆ తర్వాత రఫీ పాడిన విషాద గీతాలే. వాటిని స్మరించే ముందు అతను ఇతర 'రసా'లను కూడా ఎలా స్వర వరచగలిగాడో చూస్తే ఆశ్చర్యపోతాం.

'యే దిల్ ముఝే బతాదే - తూ కిస్‌పే ఆగయాహై' (గీతాదత్ - భాయ్ భాయ్- 1956).

అనే చిలిపి పాటలూ

'యే మానా మేరీ జాఁ - మొహబ్బత్ సజాహై (రఫీ, బల్బీర్ - హస్తే జఖ్మ్ - 1973).

అనే ఖవాలీ కవ్వింపులూ.

'సికిందర్ నే పొరస్ - సే కీ థీ లడాయీ జోకిథే లడాయీ - తో మై క్యా కరూఁ' (మహేంద్రకపూర్ - అన్‌పఢ్-1962)

అనే హాస్య గుళికలూ.

'కర్ చలే హమే ఫిదాజానోతన్ సాథియోఁ' (రఫీ, బృందం, హకీకత్-1964)

అనే దేశభక్తి పూర్ణమైన ఆవ్‌రాలూ

## మదన్‌మోహన్ హిట్స్....

| | | | |
|---|---|---|---|
| 1. హమ్ చల్ రహేథే - వో చల్ రహేథే<br>మగర్ దునియా వాలోంకీ దిల్‌జల్ రహేథే | ముఖేష్ | దునియానమానే | 1959 |
| 2. దోఘడీ వోజో పాస్ ఆబైఠే హమ్ జమానే సే దూర్ బైఠే | రఫీ, లతా | గేట్ వే ఆఫ్ ఇండియా | 1957 |
| 3. మేరీ ఆంఖోంసే కోయీ నీంద్‌లియే జాతాహై<br>దూర్‌సే ప్యార్ కా పైగామ్ దియే జాతాహై | లతా | పూజాకే ఫూల్ | 1964 |
| 4. ముఝేలే చలో ఆజ్ ఫిర్ ఉసే గలీమే | రఫీ | షరాబీ | 1964 |
| 5. మేరీ దునియామే తుమ్ ఆయీ<br>క్యా క్యా అప్‌నే సాథ్‌లియే | రఫీ, లతా | హీర్ రాంఝా | 1970 |
| 6. లగ్ జా గలే కీ ఫిర్ యే హసీ రాత్ హో నహో<br>శాయద్ ఫిర్ ఇస్ జనమ్‌మే ములాకాత్ హోనహో | లతా | వో కౌన్ థీ | 1964 |
| 7. న తుమ్ బేవఫా హో - న హమ్ బేవఫా హై<br>మగర్ క్యాకరే అప్‌నీ రాహ్ జుదా హై | లతా | ఏక్ కలీ ముస్ కాయీ | 1968 |
| 8. వో జో మిల్‌తే థీ కభీ హమ్‌సే దీవానోంకీ తర్హాహై<br>ఆజ్ యూఁ మిల్ త్‌హై యూఁ జైసే కభీ పెహచాన్ నథీ | లతా | అకేలీ మత్ జావో | 1963 |
| 9. సపనేమే సజన్ సే దోబాత్<br>ఎక్ యాద్ రహే - ఎక్ భూల్‌గయే | లతా | గేట్‌వే ఆఫ్ ఇండియా | 1957 |
| 10. హమ్ ప్యార్‌మే జల్‌నే వాలోంకో చైన్ కహా<br>హాయే ఆరామ్ కహా | లతా | జైలర్ | 1958 |

'గుడ్‌మార్నింగ్ ఓ పాపా గుడ్ మార్నింగ్' (కిశోర్, హరేంద్రనాథ్ - బావర్చీ - 1972)

అనే ఉత్సాహభరితమైన మేల్కొలుపులు.

ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో భావాలనూ, అనుభూతులను మూడ్స్‌నే మదన్‌మోహన్ తన స్వరాలలో పలికించాడు.

అయితే అతని ముద్ర మాత్రం విషాద సంగీతమే. ముఖ్యంగా లతా పాడిన విషాద గీతాలకు అతని పాటలు ఒక రిఫరెన్స్ పాయింట్ అయ్యాయి. గాయకుడు ఎవరైనా సరే. మదన్‌మోహన్ బాణీలు ఆ కంఠంలోని లోతుల్ని ఆవిష్కరిస్తాయి. లతా, రఫీ అతని ప్రధాన గాయనీ గాయకులు. వారు పాడిన అతి చక్కని పాటల్ని గుర్తు తెచ్చుకునేముందు అపుడపుడూ మదన్ పాటలిచ్చిన తక్కిన గాయకుల మేలిమి గీతాలు స్మరించుకోవాలి.

ఘాయల్ హిరనియా బన్‌బన్-భూపేంద్ర (దుల్హన్ ఎక్ రాత్ కీ -1966)

ఖోగయా జాన్ కహా - హేమంత్‌కుమార్ (మొహర్-1959)

భూలీ హుయీ యాదో - ముఖేష్ (సంజోగ్-1961)

తేరీ అంఖ్ కే ఆఁసూపీ జావూ- తలత్ మొహమూద్ (జహానారా-1964)

ఇంకా ఇలాంటి పాటలు వింటుంటే ఒకటి స్పష్టంగా తెలుస్తుంది. ఒక గాయకుడు మదన్‌మోహన్ సంగీతంలో ఒకటే పాట పాడినా, అతను లేదా ఆమె పాడిన అత్యుత్తమైన డజను గీతాల్లో ఆ ఒక్కటీ తప్పక ఉంటుంది.

సురయా, శంషాద్, గీతాదత్, కృష్ణకల్లే. సుమన్ కల్యాణ్ పూర్ లతో పాటు గజల్ గంధర్వరాగ బేగం అఖ్తర్ కూడా మదన్‌మోహన్ సంగీతంలో పాడారు.

అందుకే అతను హిందీ సంగీత ప్రపంచంలో 'గజల్ రాజ'య్యాడు. గజల్ గానమే వృత్తిగా ఉండే కళాకారులకు సినిమాలలో గజల్లు అంతగా నచ్చవు. కానీ మదన్‌మోహన్ సమకూర్చిన గజల్ బాణీలు మాత్రం ఎంత Perfectionist కైనా నచ్చుతాయి.

లతా పాడిన 'యూ హస్ రతోంకీ దాగ్', 'జానా థా హమ్‌సే దూర్ బహానే బనాలియే','ఆజా కహేసే ఆజా,ఆప్‌కీ నజరోనే సమ్‌ఝా,'జో హమ్‌నే దాస్‌తా అప్‌నే సునాయీ,'అగర్ ముర్ఝసే మొహబ్బత్ హై'.......ఇలా చెప్పుకుంటూ పోతే కోకొల్లలు. అలాగే రఫీ అజరామరమైన గజల్స్.

'ఆప్ కే పెహలూమె ఆకర్' (మేరాసాయా-1966)

'చిరాగ్ దిల్ బుఝావో బహుత్ అంధేరాహై' (చిరాగ్-1969)

'రంగ్ ఔర్ నూర్‌కీ బారాత్' (గజల్)

'మైయే సోచ్‌కర్ ఉస్‌కే దర్‌పే' (హకీకత్ - 1964)...

ఇలా ఎన్నో మదన్‌మోహన్ సంగీతం సమకూర్చినవే. తలత్ గజల్స్‌లో అత్యుత్తమైనది



మదన్ సంగీతంలోనివే (ఉదా: జహాఆరా చిత్రంలోనివి).

ఓ.పి.నయ్యర్, ఎస్.డి.బర్మన్, శంకర్ జై కిషన్‌లలా మదన్ మోహన్ యుగళ గీతాలకు ప్రసిద్ధి చెందలేదుగానీ అన్ని రకాల సన్నివేశాల్లోనూ అతి చక్కని యుగళ గీతాలను అతను అందించాడు.

'హుస్న్ జబ్ జబ్ ఇష్క్ సే టకరాగయా' (రఫీ- ఆశా- నీంద్ హమారీ ఖ్వాబ్ తుమ్హారా- 1966)

'హమారీ గలీ ఆనా అచ్ఛాజీ' (ఆశా, తలత్ - మేమ్ సాహెబ్-1971)

'వో చాంద్ ముస్‌కాయా, వో తారే శర్‌మాయీ' (లతా, మన్నాదే ఆఖ్రీ దావ్-1958)

'తేరీ చమక్ తీ ఆంఖోఁకీ ఆగే యే సితారే కుఛ్ భీ నహీ' (లతా, తలత్ - ఛోటేభాబూ - 1957)

-ఇవన్నీ ఉత్సాహం ఆనందం కలగలిపిన యుగళాలైతే...

'హమ్ సఫర్ సాథ్ ఆప్‌నా ఛోడ్ చలే' (రఫీ, ఆశా- ఆఖ్రీదావ్ - 1958) 'బాద్ ముద్దత్ కే యహ ఘడీ ఆయీ హై' (రఫీ, సుమన్ కళ్యాణ్‌పురి- జహాఁఆరా - 1964)

వంటి యుగళాలు వింటే యుగళ గీతాల్లో కూడా గజల్ సౌందర్యం ఎలా సాధించాడో అర్థమై, అద్భుతంగా అనిపిస్తుంది. మదన్‌మోహన్ పాటల్లో మార్దవానికి మాధుర్యానికి రాజేంద్రకిషన్, రాజా మెహదీ అలీఖాన్, అపుడెప్పుడో మజ్రూహ్, కైఫీ ఆజ్మీ అందించిన గీతాలు విస్మరించలేనివి.

శాస్త్రీయ సంగీతాన్ని జనరంజకమైన స్వరాల్లో సంగీతం చేసి గొప్ప మాధుర్యాన్ని సాధించిన కొద్దిమందిలో అగ్రగణ్యుడు మదన్‌మోహన్. లతా, రఫీలనే ఎక్కువ ఆదరించినా లతా సంపూర్ణ గాన సామర్థ్యాన్ని ప్రపంచానికి చాటి చెప్పిన ఒకరిద్దరిలో ఒకరిగా ప్రసిద్ధి చెందిన మదన్‌మోహన్ దాదాపు తన కాలంలో ఉన్న గాయకులందరికి అవకాశం ఇచ్చారు. దాదాపు లతా పాడినన్ని పాటలు అతని సంగీత దర్శకత్వంలో ఆశాభోంస్లే పాడారంటే ఆశ్చర్యం కలగవచ్చు. కానీ అది నిజం. కాకపోతే లతా పాడినవి మదన్ ఆత్మనుంచి ఉదయించినవి. ఆశా పాడినవి అతని నైపుణ్యం నుంచి పుట్టినవి. అందుకే లతా పాడినవే ఎక్కువ హిట్టయ్యాయి. బాగున్నాయి కూడా. అలాగే మన్నాదే, కిశోర్, మహేంద్రకపూర్‌లకు కూడా అతను పాటలు ఇచ్చినా, రఫీకే తన మేలిమి పాటల్ని ఇచ్చారు.

మదన్‌మోహన్ స్వయంగా గాయకుడు. దస్తక్, ఫిఫ్టీటు వంటి సినిమాల్లో లతా, రఫీ, కిశోర్‌లతో కలిసి యుగళాలు బృందగీతాలు పాడారు.

ఒకానొక రోజున తన పిల్లలు కూడా తన పాటలు పాడక, వేరే సంగీత దర్శకులవి పాడినందుకు మదనమోహన్ బాధపడ్డారట! కానీ... ఎంత కసాయికైనా మదన్ పాట వింటే గుండె చెమ్మగిల్లి కంట్లో నీటి పొర కదలాడుతుందనే విషయం అతనికి తెలుసా?

**-మృణాళిని.**

## మదన్‌మోహన్ హిట్స్....

| | | | |
|---|---|---|---|
| 11. హమారే బాద్ అబ్ మహఫిల్ మే అఫ్‌సానే క్యా హోంగే బహారోం హమ్ కో ఢూండేగీ | లతా | బాగీ | 1953 |
| 12. హర్ కోయీ చాహతీహై ఎక్ ముఠీ ఆస్‌మాన్ హర్ కోయీ ఢూండ్ తాహై ఎక్ ముఠ్ఠీ ఆసమాన్ | కిశోర్ | ఏక్ ముఠ్ఠీ ఆస్మాన్ | 1973 |
| 13. హై ఇసీమే ప్యార్‌కీ ఆబ్రూ వో జఫా కో మై వఫా కరూఁ | లతా | అన్‌పఢ్ | 1962 |
| 14. హోకె మజ్‌బూర్ ముఝ్‌కో - ఉస్‌నే భులాయా హోగా | రఫీ, తలత్, మన్నాదే, భుపేంద్ర | హకీకత్ | 1964 |
| 15. ఫిర్ వహిశామ్ వహిగమ్ వహి తన్ హాయిహై | తలత్ | జహాఆరా | 1964 |
| 16. మేరీ ఆవాజ్ సునో, ప్యారే కా రాజ్ సునో | రఫీ | నౌనీహాల్ | 1967 |
| 17. తేరీ ఆంఖోంకే సివా దునియామే రఖాక్యాహై | రఫీ, లతా | చిరాగ్ | 1969 |
| 18. దిల్ దిల్‌సే మిలాకర్ దేఖో | ఆశా | మేమ్ సాహబ్ | 1971 |
| 19. దిల్ ఢూంఢ్‌తాహై ఫిర్ వహి | భుపేంద్ర | మౌసమ్ | 1995 |
| 20. తుమ్హారీ జుల్ఫ్‌కీ సాయేమే శామ్ కాటూంగా | రఫీ | నౌనీహాల్ | 1967 |

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు




**టి.వెంకటేష్, రుక్మాపూర్**

ప్ర: మీకు ఇష్టమైన లిప్స్?

జ: ఫిలిప్స్

**పి.రాధ, వనస్థలిపురం**

ప్ర: నాకు సివిలైజ్డ్‌గా ఉండాలని అందరితోనూ సోషల్‌గా ఉండాలని వుంటుంది. అయితే ఏమవుతుంది?

జ: 'సివిక్స్' కోసం 'సోషల్' గా ఉంటే 'హిస్టరీ' క్రియేట్ అవుతుంది.

**జి. వరలక్ష్మి, గుంటూరు**

ప్ర: సీతనపహరించడానికి వచ్చిన రావణాసురుడు తన ఒరిజినల్ గెటప్ చూపించాక సీత వెనక్కి వెళ్లి లక్ష్మణరేఖను ఎందుకు ముట్టుకోలేదు?

జ: బహుశా సీతకు కబడ్డీ ఆట వచ్చి వుండదు.

## పేరు - రిపేరు




బావగారూ బాగున్నారా - సకుటుంబ సపరివార సమేతంగా - మా పెళ్లికి రండి

**- ప్రతిభ - శుభ, భీమవరం**

నిజం - ఒట్టేసి చెబుతున్నా - ఈ అబ్బాయి చాలా మంచోడు

**- మహేంద్రాడ చలం, టెక్కలి**

నువ్వు నాకు నచ్చావ్ - ఐతే - పెళ్లి చేసుకుందాం... రా!

**-కోటిపల్లి మల్లేశ్వరం**

## ఈ రూటేవేరు



పేరాశ = పేరు కోసం పడే ఆశ

**-భమిడిపాటి వెంకటేశ్వరరావు, రుద్రారం.**

Three Came = మూడొచ్చింది

**- బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి.**

బ్యాండేజ్ = మేళం వాయించడానికి తగిన వయసు... అనగా... పెళ్లీడు

**-డి. పద్మినీప్రసాద్, విశాఖపట్నం.**






## చిలిపి లిపి

G Came Fee = జిరాఫీ

E G = ఈజీ

**- మామిడి ముని శ్రీలత, పూణే**

S కిమోలకి O పిక A క్కువ = ఎస్కిమోలకి ఓపిక ఎక్కువ

**- తెలికిచెర్ల రామకృష్ణ, విజయ నగరం.**

## డబుల్ రోల్




'అరికాళ్లో' ముల్లు గుచ్చుకుందని డాక్టరు దగ్గరికెళ్తే ఆపరేషన్ చేసి పై 'లోకాల్లో' కి పంపించాడాయన.

- సాయి - సాకీ.

'గిరిజా' మీా తమ్ముడు 'గిరి జారి' పడ్డాడు త్వరగా రా?

- బి.శ్రీనివాసాచారి, హైదరాబాద్.

'గజాలా.... ఆ అబ్బాయంటే నీకంత జాలా!?

- దేవులపల్లి రామమూర్తి, విజయవాడ.

## చిలిపి కవిత




నాకీ మధ్యే పట్టుకుంది కవిత్వపు పిచ్చి
దాంతో మా ఆవిడ నాపై పెంచుకుంది
విపరీతమైన కచ్చి
ఈ రాతకోతలాపకపోతే పోతానంటోంది
నాకు విడాకులిచ్చి
ఎందుకంటే ఆవిడ ఓ చిన్నసైజు టింగరి బుచ్చి

-టి.యల్.ప్రసాద్, విశాఖపట్నం.

## పేరడీ పేరేడ్




వాగితే రెచ్చిపోగలను వాగనివ్వదు
రెచ్చిపోతే వాగగలను రెచ్చనివ్వదు....హుహుహుహు...ఊం

ప: మొగుడి గతి ఇంతే
సగటు బ్రతుకంతే
జగడాల భార్యతో సుఖములేదంతే ॥మొగుడి గతి॥

చ: ఒకటి తిట్టీ మరలిపోదు
వంద దాటినా వదలిపోదు
మాయమైతే ఊరుకోదు
పగలు, రేయి బ్రతుకనీదు ॥మొగుడి గతి॥

చ: రోజూ తగువేనని తెలుసు
అదీ ఒక తంటా అని తెలుసు
తెలిసీ తెలిసీ భరియించుటలో...
తెలిసీ తెలిసీ భరియించుటలో
వెర్రితనం ఎవరికి తెలుసు ॥మొగుడి గతి॥

చ: మరుజన్మ ఉన్నదో లేదో
ఈ బాధలప్పుడేమౌతాయో ॥మరు॥
మగనికి సతియే తీరని శిక్షా...
మగనికి సతియే తీరని శిక్ష
పెద్దలిలా తీర్చుకున్నారు కక్షా ॥మొగుడి గతి॥

-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం

('ప్రేమనగర్' లోని 'మనసుగతి ఇంతే' పాటకు పేరడీగా...)

## షార్ట్‌కట్స్



| | | |
|---|---|---|
| పల్లి లక్ష్మీ కమల | = | పలక |
| గిడుగు లక్ష్మీ కమల | = | గిలక |
| మేరీ కుమారి | = | మేక |
| కందుల చంద్రిక | = | కంచం |
| కరణం లలిత | = | కల |

- జి.యన్.వాణి, సరిపల్లి








## సప్తస్వరసుందరి

# లతామంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు
డా॥ పి.బి.శ్రీనివాస్
'హాసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

ఆమె అలా అనగానే తను కూడా మరిచిపోయిన అప్పటి సన్నివేశం కళ్లకి కట్టినట్లుగా కనిపించేసరికి, కత్తివాటుకి నెత్తురు లేనట్లుగా అయిపోయి ఆ మహావ్యక్తి తోకముడిచి మెల్లగా జారుకున్నాడు. ఆగని నవ్వుని ఎలాగో ఆపుకునేసరికి నా తలప్రాణం తోకకొచ్చింది.

"కమాల్ హై! ఆప్‌కీ యాద్‌దాశ్త్ కా జవాబ్ నహీఁ" అనే ప్రశంసా దృష్టి ప్రసరిస్తూ, పిదప కొంతసేపు సంభాషణ కొనసాగించి సెలవు తీసుకున్నాను, చకితావస్థలో అలా ఎదటివారి మనసుని నొప్పించకుండానే తన అసమ్మతిని చాకచక్యంతో తెలియబరిచిన ఆమె నైపుణ్యానికి జోహారులర్పిస్తూ వచ్చినదారి పట్టాను. ఆమె అద్భుత జ్ఞాపకశక్తికి ఇది చిన్న నిదర్శనం మాత్రమే.

అంతటి జ్ఞాపకశక్తే గనక వుండివుండకపోతే, తన తండ్రి నాటకంలో నారద పాత్రధారి లేకపోయిన సమయాన తానుగా ఆ పాత్రను ధరించి శభాష్ అనిపించుకొని, ఒక్క రిహార్సలు కూడా అవసరం లేకుండా కేవలం తన జ్ఞాపకశక్తినే ఆధారంగా చేసుకుని డైలాగులూ, సాంగులూ యధాతథంగా పాడడానికి సాహసించి వుండేదే కాదేమో!

తండ్రికి ఆమె ప్రతిభపై ఎక్కువగా నమ్మకం కలగడానికి కారణం ఆమె నారద పాత్రలో కనబరచిన అభినయంతో పాటు అమృత రసమయ గానం. చిన్నప్పుడే నాటక నటిగాను, గాయకిగాను తగిన అనుభవం సంపాదించింది.

ఆ నాటకానుభవమే తదుపరి చిత్ర పరిశ్రమలో కూడా రాణించడానికి ఉపయోగ పడింది. 'నటన'పై ఆమెకు తగినంత ఆసక్తి లేకపోయినా, పరిస్థితులననుసరించి లత చిన్నతనంలోనే కొన్ని చిత్రాలలో నటించడం అనివార్యం అయింది.

తండ్రి మరణానంతరం కుటుంబ భారం అంతా తనే మోయవలసి రావడం వల్ల దగ్గరి బంధువైన మాస్టర్ వినాయక్‌రావు గారి ప్రోద్బలం వల్లా, ప్రోత్సాహం వల్లా చిత్రాలలో చిన్న చిన్న పాత్రలు కొన్ని ధరించి వృత్తిగా నిర్వహించింది. కాని గానం పట్లనే ఏనాడుగాని ఆమెకు సంపూర్ణాసక్తి.

'బల్‌వంత్' సంగీత్ మండలి ఉచ్చదశలో వెలుగొందుతున్నాళ్లూ ఏ ఇబ్బంది లేకుండా గడిచేది దీనానాథ్ జీవితం. కాలక్రమేణ, తన సంస్థ బలం సన్నగిల్లడం ప్రారంభించేసరికి, ఆయన ధైర్యం బెదిరిచెదరసాగింది. చిన్నతనంలో 'శరాబ్' వాసనకే తట్టుకోలేని దీనానాథ్ చివరికి మదిరాపానానికి దాసుడయే పరిస్థితి ఏర్పడింది. గొప్ప ఆస్తి హరించుకుపోయింది.

ఎన్ని కష్టాలనెదుర్కోవలసి వచ్చినా తన జీవనాన్ని గానానికి అంకితం చేసి ఆనందంగా రసజ్ఞులకి సంగీతపు విందులందించి, తనూ సంతృప్తితో పయనం సాగించగలిగిన ధీరోదాత్త చిత్తులు శ్రీ దీనానాథ్. ఎట్టి పరిస్థితుల్లోనూ, గానాభ్యానం (రియాజ్) నిర్విఘ్నంగా కొనసాగిస్తూనే వుండేవారు- తను పాడుతూ తన కూతుళ్ల చేత సదా సాధకం చేయిస్తూ! ఆ చిన్ననాటి సంగీత శిక్షణే లతా మహోజ్జ్వల భవిష్యత్తుకి పునాదిగా సమకూరిందది. ముఖ్యంగా, సంస్కృత భాషా జ్ఞానం వలన కలిగే ఉపయోగాలేమిటో



ఎఱిగి వుండడం వలన తన పిల్లలకి బాల్యంలోనే సంస్కృత భాషని నేర్పించారు. అందుచేతనే లత ఏ భాషలో పాడినా ఉచ్చారణ విషయంలోనూ నిర్దుష్ట పదచ్ఛేదం చేయడంలోనూ నైపుణ్యం సంపాదించుకోగలిగింది - ఇది గొప్ప అడ్వాన్టేజ్ ఆమెకి.

తండ్రి పట్ల, లతకి గల గౌరవాభిమానాలు

## దీనానాథ్ ఆత్మస్థైర్యం

కొందరు దీనానాథ్‌ని అహంకారి అనుకునేవారు. సంగీత కార్యక్రమాల్లో, గాయకులు ఏమైనా తప్పుగా పాడితే, వెంటనే సభలోనుండి బయటికి నడిచి వెళ్ళిపోయేవారట దీనా. మరో సందర్భంలో, ఒక ప్రఖ్యాత గాయిక, "దీనా, మీరు ముందుగా పాడతారా, లేక నా తరువాత పాడతారా" అని అడిగితే. దీనా నవ్వి, "మీ కంటె ముందుగా పాడేందుకు నాకెలాటి భయమూ, సంకోచమూ, అభ్యంతరమూ లేవుకాని, నేను శృతిలో శృతి కలిపి షడ్జమం పాడిన తరువాత మీకు పాడే ధైర్యముంటుందా?" అని ఎదురు ప్రశ్న వేశారట.



అలా అహంకారి లాగ పైకి ప్రవర్తించినా, నిజానికి లోపల ఆయనకి మంచి కళాకారులు చిన్నవారైనా పెద్దవారైనా, గౌరవాభిమానాలు చాలా యెక్కువట. అల్లాదియాఖాన్, రహమత్‌ఖాన్, భాస్కర్‌బువాబఖలే వంటి వారి పట్ల ఆయనకి విపరీతమైన ఆదరాభిమానాలట.

అత్యధికాలు. కొన్ని అరుదైన సుగుణాలు పిత్ర వారసత్వంగా ఆమెకి లభించాయి. వాటిలో ముఖ్యమైనవి-ఆత్మవిశ్వాసం, పెద్దలయందు గౌరవం, దినదిన ప్రవర్ధమాన సంగీత సాహిత్య పరిజ్ఞానం మొదలైనవి.

సాధారణంగా దీనానాథ్ అమితభోజి. మాంసాహారం అంటే మక్కువ. కాని "మాయి" అనబడే ఆయన భార్యామణి (లత తల్లి) పక్కు శాకాహారిణి అయివుండడం వలన, తను తినకున్నా భర్త కోసమనే, ఆమె మాంసాహారం వండడం నేర్చుకుని వడ్డించి పెట్టేవారట. లత తల్లి ఈనాటికీ మాంసం అస్సలు ముట్టని శాకాహారిణిగానే వుండిపోవడానికి కారణం ఆమె శాకాహారి అయిన గుజరాతీ కుటుంబానికి చెందిన మహిళ కావడమే.

గాయకిగా కళాత్మకంగా ఆమె భారతీయ నారీరత్నం అనడం కన్న సమస్త విశ్వవనిత అనడమే సబబు. తండ్రి ద్వారా కూతురి కబ్బిన మరో విషయం క్రికెట్ క్రీడలో ప్రత్యేకాభిరుచి, ఈ నిజం ఏనాడో జగద్విదితం. తండ్రి చేసే కొన్ని పనులు ఆమెకు ఇష్టంలేని వైనా, ఆమె పట్టించుకోలేదు. తన ధోరణి తనదే ఎప్పుడూ! "పెద్దలు చేసినట్లెన్నడూ చెయ్యకు, పెద్దలు చెప్పినట్లే చెయ్యి" అనే గాంధీ సూక్తిని ఆమె అక్షరాలా అనుసరించే వినయశీలి.

ఇలా తండ్రినుండి ఉత్తమ సలహాలెన్నో ఆయన ముద్దుల కూతురుకి లభించాయి. లత, ఈనాడు కూడా గౌరవాలూ సన్మానాలూ జరిగే సమయాన్నైనా, నాటి తన జనకుడి సూక్తులన్నీ తలుచుకుని, నెమరు వేసుకుంటూ వుండడం పరిపాటి - "తండ్రిని మించిన తనయ" అనడానికి ఆమె అర్హురాలే అయినా, "తండ్రికి తగిన తనయ" అని అనిపించుకోవడమే లతకెప్పుడూ సంతోషం కలిగిస్తుంది!!

కాని, "తనని మించిన తనయ"గా లత విశ్వవిఖ్యాతిని తన ప్రతిభా పాటవాల చేతనే గడించి తీరుతుందని, దీనానాథ్ భవిష్యవాణి. చనిపోయే ముందు ఓ పక్కన అవస్థ పడుతూనే తను భైరవ్, బహార్ రాగాల ఆలాపన చేస్తూ, లతా, మీనా, ఆశాలు తంబూరా మీటుతూ వుండగా, వారిచేత కూడా ఆ రాగాలు పాడించారట-

ఆఖరి సారిగా, ఆయన వివరించినట్లే, ఆ బహార్ (వసంతం), లతా ఆశాల జీవితాలలో నిరంతర వసంతమై, దీనా భవిష్యద్వాణిని నిరూపించి, ధ్రువపరిచింది.

మాయీ (శ్రీమతి దీనానాథ్)కి అప్పుడు 32 ఏళ్ల వయసు. పెద్ద కూతురు లతకి 13 ఏళ్లు మాత్రమే. తన 42వ ఏటనే దీనానాథ్ పరమపదించడం, ఆయన కుటుంబానికి పెద్ద పరీక్షగా మారింది. పేదరికంలో ప్రారంభమై సంపదలతో తలతూగి, మళ్లీ పేదరికంలోకి దిగజారింది.

కాని, విధివశాన, తన కూతురి జీవితం అంతా చలనచిత్ర రంగంలోనే విశిష్టంగా గడిచి రాణిస్తుంది, అన్న విషయం జ్యోతిష్యంలో మంచి ప్రవేశం వుండీ కూడా తండ్రి దీనా ఊహించలేదు. ఏది ఎలా జరిగినా అంతా భగవన్నిర్ణయమే తప్ప మానవ నిర్ణయ ఫలితం కాదు. - పైకి చెప్పకపోయినా, ఆ విషయం ఆయన ఎరుగునేమో!!

## కీర్తి కాముకత వద్దు



"ఖజాంచీ" అనే చిత్ర నిర్మాతలు 11 సంవత్సరాల బాలికలతో పాటల పోటీలు ఏర్పాటు చేశారు. లతా కూడా పాల్గొని, రెండు మెడల్స్, ఒక దిల్‌రుబా (సంగీత వాద్యం) బహుమతులుగా స్వీకరించి తెచ్చుకుంది. ఆ దిల్‌రుబా ఆమెకు ప్రాణ సమానం. ఆ దిల్‌రుబాని తీసుకుని దీనానాథ్ వాయించి పలికిస్తుండగా, ఆయన దృష్టిలో కొంత దూరాన ఒక చిట్టెలుక పడగానే, చికాకు పడి, కమానుని దాని పైకి విసిరేశారట. అది ముక్కలు ముక్కలై చెల్లాచెదరైనప్పుడు, లత కళ్లు కన్నీటిధారలు కురిశాయట. తను సంపాదించి తెచ్చుకున్న బహుమతికి ఆ గతి పట్టిందే అని వాపోయిందట. అది గమనించిన తండ్రి "-అమ్మాయ్, నీ కన్నీళ్లకి కారణం నువ్వు సంపాదించిన బహుమతి విరిగిపోవడమేగా! అంటే నీ సాధనకి నువ్వే పొంగిపోతున్నావన్నమాట. అది మంచి లక్షణం కాదమ్మా, ఏమైనా నీకిల్లాంటివేకాక ఇంతకన్నా గొప్పగొప్ప బిరుదులూ, బహుమతులూ, సత్కారాలు, తప్పకుండా లభిస్తాయి. కాని, నీ విజయాలు, నీ తల బరువుని పెంచి గర్వానికి దారి తీయకూడదు" అని మందహాసంతోనే మందలించారట.



ఫోటోగ్రఫీ అన్నా, క్రికెట్ అన్నా లతాకు ప్రాణం. సచిన్ వంటి క్రికెటర్‌ను ఫోటో తీయడం అంటే ఆమె ఉత్సాహం ద్విగుణీకృతమయినట్లే!

తను రాబోయే శుక్రవారం తరువాత ఈ మర్త్యలోకంలోనే వుండబోననీ, ఆనాటి గండం గడవగలిగితే దీర్ఘాయువుతో జీవించగలుగుతాననీ, బుధవారంనాడే ఆయన అందరికీ చెప్పేశారట. కాని కాల నిర్ణయాన్ని కాదనగల వారెవరు??

ఇప్పటికీ కొడుకు హృదయనాథ్ చింతిస్తూ

## సినిమాలో ఉపయోగపడని లతా మొదటి సినిమాపాట

దీనా మరణానికి ఒకేనెల ముందు మార్చి మాసంలో తన మొదటి చలన చిత్రగీతం శ్రీ వసంత్ జోగ్లేకర్ గారి మరాఠీ చిత్రానికై (హితీహసాల్) (ఎంతగా నవ్వగలవు?) పాడింది, తన తండ్రి అంతగా ఇష్టం లేకున్నా అనుమతినివ్వడం వల్ల. ఆయనకి రంగస్థల వృత్తి మాత్రమే ఇష్టం. చలన చిత్ర వృత్తి అంటే ఒక విధమైన చిన్నచూపు. తరువాత చలనచిత్ర రంగంలో లతా సృష్టించిన అద్భుత చరిత్ర ఆయన కనులారా కని విని ఆనందించే అవకాశం పొందకపోవడం శోచనీయం!!

"మంగేశ్ ప్రభువు మిమ్మల్ని సదా కాపాడుతూ సంరక్షిస్తూనే వుంటాడు" అని దీనా తన పరివార సభ్యులందరికీ అందించిన దీవెనల సత్ఫలితమే తన అనుదిన పురోభివృద్ధికి ప్రథమ కారణం అని లత నమ్మకం. ఆయన్ని తలచుకోకుండా ఏ పనీ తలపెట్టదు. ఇంతకీ లత పాడిన ఆ ప్రథమగీతం మాత్రం చిత్రంలో ఉపయోగింపబడలేదు. తండ్రి హృదయ పూర్వకంగా సమ్మతించకున్నా తను పాడవలసివచ్చిన ఆ పాట చిత్రంలో వదిలి వేయబడడం లతకి సంతోషాన్నే ఇచ్చింది.

వుంటారట. తన తండ్రి అధమ పక్షం 1950 ప్రాంతం వరకూ జీవించి వుండినట్లైతే, కూతురి దిగ్విజయాన్ని, ఐశ్వర్యాన్నీ చూసి, "ఆయేగా ఆనేవాలా" పాట పాప్యులారిటీకి మురిసిపోయి వుండేవారనేదే హృదయనాథ్‌కి తీరని వేదన. "ఒకవేళ తన తండ్రి తరువాత కూడా బ్రతికి వుంటే కుటుంబపు ఛాదస్తపు నిర్బంధ నిర్ణయాల వల్ల, తదితర నియమాల పరిమితి వల్లా లత చలన చిత్ర రంగ ప్రవేశానికి చాలా అవరోధాలు కలిగి, ఆమె ప్రతిభ నాలుగు గోడల మధ్య బంధింపబడే వుండిపోయేదేమో, అని కూడా అనిపిస్తూ వుంటుందట అప్పుడప్పుడు హృదయనాథ్‌కి. ఇంతకీ దైవ నిర్ణయం అనివార్యం!!

ఒక సమయాన, కనురెప్ప పాటు లోపలే వింత వింత సంఘటనలూ పరిణామాలూ బృహత్పరిమాణంలో ఏర్పడడం జరుగుతూ వుంటుంది. దాని ఫలితంగానే కాబోలు, ఆట పాటలలో ఉత్సాహంగా ఉల్లాసంగా సాగవలసిన లత కౌమార దశలోనే చింతలూ, గృహ నిర్వహణ బాధ్యతలూ చుట్టుముట్టి ఆమెకి ఏదైనా పనిచేయక తప్పని పరిస్థితిని తెచ్చిపెట్టాయి. తల్లి కన్నా కూతురే అధికంగా ఆలోచించి, చింతించసాగింది.-

మెల్లమెల్లగా తాకట్టు పట్టుకి బలై, ఇంట్లోని వస్తువులు బయటికి వెళ్ళిపోవడం మొదలుపెట్టాయి. కెమేరా వగైరాలని నిలుపుకునేందుకు తల్లి నగలూ ముందే ఖర్చైపోయాయి. మాయీకి తెలియనీయకుండా, ఇంటి పనిమనిషి దొంగతనంగా ఆహార సామగ్రి అదీ తెచ్చి, పిల్లలకి అందిస్తూ వుండేదట. అది తెలిసిన రోజున మాయి అగ్గిబుగ్గై ఆకలి మనుషుల్నే చంపుతుంది. కాని బిచ్చం ఎత్తి తినడం మనుషుల పరువునే మంట గలుపుతుంది అని గద్దించారట. ఆ పరిస్థితి వలన ఆమె ఆత్మాభిమానం మరింత గాయపడింది.

కష్టపరిస్థితి వలన కుటుంబం అంతటికీ ఒకే ఆలోచన- అంతవరకూ నేర్చుకున్న విద్యనే ఆధారంగా చేసుకుని డబ్బు సంపాదించగలిగే ఉద్యోగమేదైనా చేయాలని. సంగీతాధ్యయనం కొనసాగించడానికి అవకాశమేలేదు. పోనీ సినిమాల్లోనే పాడవచ్చు గదా అంటే, అప్పట్లో లతా కంఠస్వరం అతి నాజూకుగా, సన్నగా వుండడం వలన ఆనాటి చలనచిత్రాలలో నటించే నడివయసు హీరోయిన్లకి నప్పదని పలువురి అభిప్రాయం. అదీగాక నేపథ్యగానం అప్పుడప్పుడే కొత్తగా ప్రారంభమై అభివృద్ధి జెందవలసిన అవస్థలో వుండింది. కనక, లతకి మిగిలిన ఒకే ఒక జీవనాధారం నటన.

- (సశేషం)

# అంతేరా బామ్మర్ది

ఆదివిష్ణు



## జరిగిన కథ

భాగ్యనగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్త బసవరాజు, జానకిల కూతురు ఉమ. కొడుకు మురళి. ఉమ, వేణుని ప్రేమిస్తోంది. వేణుకు నాగపూర్లో ఉద్యోగం వచ్చినా ఉమను విడిచి వెళ్లడం ఇష్టం లేక ఉద్యోగానికి వెళ్లనంటాడు. అతని బావ రంగనాధం తన బాల్యమిత్రుడు బసవరాజు కంపెనీలో ఉద్యోగం వేయిస్తానని హామీ ఇస్తాడు. తనే స్వయంగా వెళ్లి బసవరాజును కలిసి బావమరిది ఉద్యోగం కై అడుగుతానంటాడు. ఈ లోపుల బసవరాజు పేపర్లో వార్తలు చదివి ఖంగారుపడి బావమరిదికై ఉద్యోగాలకోసం వచ్చే ఫ్రెండ్స్‌ను కలవకూడదని నిశ్చయించుకుంటాడు. అందుకే అతన్ని కలవడానికి వచ్చిన రంగనాధాన్ని చూడ నిరాకరిస్తాడు. కానీ తరువాత బాధపడతాడు. ఆ సంగతి తెలియని రంగనాధం బసవరాజుపై మండిపడుతూంటాడు. బావగారి పేరు చెప్పకుండా ఉద్యోగానికై వేణు డైరక్టుగా వెళతాడు. బసవరాజు అతన్ని చూసి ఇంపెస్ అవుతాడు.

(ఇక చదవండి)

బసవరాజు ఆఫీసు గది!

ఇప్పుడు ఆ గదిలో వేణు కూడా వున్నాడు!

బసవరాజు మనస్ఫూర్తిగా వేణుని అభినందిస్తున్నాడు!

"కేవలం సర్టిఫికెట్లు మాత్రమే కాదు! నీ సమాధానాలు కూడా నన్ను బాగా ఆకట్టుకున్నాయ్! కుర్రాళ్లంతా నీ మాదిరి చాకుల్లాగా వుండాలి!"

"థేంక్యూ సార్!" అన్నాడు వేణు

బసవరాజు నొచ్చుకుంటో అన్నాడు-

"వద్దు! నేనే నీకు థేంక్స్ చెప్పాలి! మంచి సెక్రటరీ కోసం వెతుకుతున్నాం. ప్రకటన కూడా చేసేం! ఎవరెవరో వచ్చేరేగాని - వచ్చిన వాళ్లు నాకు నచ్చలేదు. నువ్వునచ్చేవ్!"

ఆ మాట మీద ఆ గదిలోకి పాణి వచ్చేడు!

అతని చేతిలో ఒక కాగితముంది! ఆ కాగితాన్ని బసవరాజు చేతికిచ్చేడు!

బసవరాజు ఆ కాగితమ్మీద సంతకం చేసేడు!

ఆ కాగితాన్ని వేణుకిస్తూ అన్నాడు-

"ఇది నీ అప్పాయింట్‌మెంటు ఆర్డరు!"

"థేంక్స్" అన్నాడు వేణు ఆర్డరు తీసుకుంటో.

"ఇవాళే ఇప్పుడే డ్యూటీలో జాయినవు తున్నావ్!"

వేణు కొంచెం సంశయిస్తున్నట్టు కనిపించేడు.

"ఏమైనా అడగదలుచుకుంటే అడుగు!" అన్నాడు బసవరాజు.

"ఇప్పుడే జాయినవ్వడానికి నాకేం అభ్యంతరం లేదనుకోండి! జాయినయ్యేముందు మా పెద్దవాళ్ల ఆశీస్సులు తీసుకోవాలనుకుంటున్నాను!"

"మంచి ఆచారం! మీ వాళ్లు ఏ ఊళ్లో వున్నారు?"

"ఈ ఊళ్లోనే వున్నారు!"

"అయ్‌సీ! మీ నాన్నగారి పేరు?"

"నాన్న గారు లేరు. నా చిన్నప్పుడే పోయేరు!"

"అయ్‌సీ! తల్లి చేతుల్లో పెరిగేవన్నమాట! అందుకే ఇంత బ్రిలియంట్ వయ్యేవు!"

"సారీ! నాకు తల్లి కూడా లేదు! నాన్న పోయిన షాక్‌తో ఆవిడ కూడా పోయేరు!"

"అయ్యయ్యో! మరి..."

"దేవతలాటి అక్కయ్యా - దేవుడి లాంటి బావగారూ వున్నారు! వాళ్లే నన్ను పెంచి పెద్ద చేసేరు!"

బావగారు అనే మాట వినగానే పాణికి ఏదో పాయింటు గుర్తుకు రాగా - చెంప సవరించుకుంటో అడిగేడు -

"బావగారా? అంటే-"

పాణి పాయింటేమిటో గ్రహించిన బసవరాజు - పాణిని సముదాయించే ప్రయత్నంలో అన్నాడు -

"మనకి తెలిసిన బావగారు కాదులే! ఆ బావగారికి ఇల్లాంటి బామ్మర్ది వుండడు! వుండటానికి వీల్లేదు! అంచేత ఖంగారు పడకు! చూడు మిస్టర్ వేణూ - మీ బావగారి పేరేమిటి?"

"రంగనాథం!"

'ఆ' అని నోరు తెరిచేడు బసవరాజు. అది ఆసరాగా తీసుకుని పాణి రెచ్చిపోతున్నాడు -

"నాకు డవుటురానే రాదు సార్! వస్తే మాత్రం అది ఖచ్చితంగా ఫేక్టే అవుతుంది! మిస్టర్ వేణూ! మీ అపాయింట్‌మెంట్ ఆర్డరు ఇట్లా ఇవ్వండి!"




"ఎందుకు?" అని బసవరాజు అడిగేడు.

"చింపి పారేద్దాం సార్! ఇతను మీ ఫ్రండుకి బామ్మర్ది!

"అఫ్ కోర్స్ - అయితే?"

"ఒక్కసారి మలయాళం వార్త గుర్తు తెచ్చుకోండి సార్! గట్టిగా జ్ఞాపకం తెచ్చుకోండి!"

"తెచ్చుకున్నా!"

"కొచ్చిన్లో నాయర్ని జ్ఞాపకం తెచ్చుకోండి!"

"తెచ్చుకున్నా!"

"మరింకే? ఆర్డరు చింపమంటారా?"

"అక్కర్లేదు!"

"సార్ - కొచ్చిన్లో కుట్టిని కూడా జ్ఞాపకం తెచ్చుకోండి సార్!"

"తెచ్చుకున్నా!"

"థేంక్యూ సార్!"

"అయినా సరే! ఆర్డరు చించవద్దు!"

"సార్?"

"నా దగ్గిర కొచ్చింది ఖూనీకోరు కుట్టిగాడు కాదు! సాక్షాత్తు కేండిడేటే వచ్చేడు! వచ్చినవాడు నచ్చేడు! నచ్చేడు గనక ఉద్యోగమిచ్చేను! అర్థమైందా?"

"అర్థమైంది సార్! మీరట్లా వస్తారనుకోలేదు!"

"ఈ పాయింట్లో మాత్రం అట్లాగే వస్తాను! వచ్చేసేను! దట్సాల్! ఇంకమాటాడకు.

మిస్టర్ వేణూ!-"

"క్షమించాలి!"వేణు నీళ్లు నములుతూ అన్నాడు -

"నాకిచ్చిన అపాయింట్‌మెంటు ఆర్డర్ని పాణిగారు ఎందుకు చించాలని ముచ్చటపడుతున్నారో - మీరు ఎందుకు వద్దంటున్నారో - కొచ్చిన్లో నాయరెవ్వరో, కుట్టి ఎవరో - వారికీ నాకూ లింకేమిటో - అసలర్థం కాలేదు!"

బసవరాజు వేణుని సముదాయించేడు -

"నీకనవసరమైన విషయాలు అర్థం కాకపోవడమే మంచిది! రేపట్నుంచి డ్యూటీలో జాయినవ్వు! ఒకే!"

వేణు థేంక్స్ చెప్పి ఆ గది నుంచి బయటపడుతూ పాణికి్కూడా థేంక్స్ చెప్పేడు!

వేణు వెళ్లిం తర్వాత -

క్షణం గడిచాక పాణిని బసవరాజు పలకరించేడు -

"ఇప్పుడు ఆ సింగినాదంగాడు నా పీక పిసకలేదు! ఎంచేత అని



అడుగు!"

"ఇంత తెలిసింతర్వాత ఎట్లా అడగ్గలనుసార్? అడగలేను!"

"ఏం తెలిసింది? అచ్చెప్పునాకు!"

"మీరు నాయరూ కాదు! మీ ఫ్రండు కుట్టీ కాదు!"

"పైగా - సింగినాదం అడక్కుండానే వాడి బామ్మర్దికి ఉద్యోగం కూడా యిచ్చేసేను!"

"అంచేత చాలా నేర్గా చావు తప్పించుకున్నారు సార్!"

ఆ మాటకి బసవరాజు నొచ్చుకున్నాడు కాబోలు! పాణి వేపు సీరియస్‌గా చూసేడు!

ఆ చూపుని భరించలేని పాణి - అక్కడ్నించి పారిపోయే ప్రయత్నంలో -

"ఎక్స్‌క్యూజ్మీ సార్! నన్నెవరో పిలుస్తున్నారు! మళ్ళా కలుస్తాను సార్!"

అని ఆ గదిలోంచి పారిపోతున్నాడు - పాణి!

* * *

రంగనాథం ఇల్లు!

రంగనాథం దంపతుల ముందు వేణు దోషిలాగా నిలబడి వున్నాడు.

రంకెలు వేస్తున్నాడు రంగనాథం -

"నీ బావని అవమానించిన ఆ డకోటాగాడి దగ్గిర ఉద్యోగం చేస్తావా? ఉద్యోగం!? వీల్లేదు!"

అని చేతిలో వున్న సిగరెట్టు పాకెట్ విసిరేసేడు.

వేణు అనునయంగా అంటున్నాడు -

"బసవరాజు గార్ని నువ్వు అపార్థం చేసుకుంటున్నావ్ బావా!"

"నోర్మూయ్" అన్నాడు రంగనాథం!

అక్కడికి దగ్గర్లో వున్న బట్టల స్టాండు దగ్గిరికి వెళ్ళి, దాని మీదున్న దుస్తుల్ని యిష్టమొచ్చినట్టు విసిరేస్తూ అన్నాడు -

"చెడ్డీలు - చెడ్డీలు తొడుక్కునే వయస్సు నుంచి వాడు నాకు తెలుసు! జాకాల్ గాడు! వదిలెయ్ వాడ్ని!"

అని గబగబా ఫోన్ దగ్గిరికి వెళ్ళి డయల్ చేస్తున్నాడు.

"ఫోనెవరికి బావా?" అని ఆందోళనగా అడిగేడు వేణు!

"రైల్వే ఎంక్వయిరీస్? - హల్లో - రైసుమిల్లా! రాంగ్ నెంబర్! పెట్టేయండి ఫోను!"




వేణుకి అర్థం గాక అడిగేడు -

"ఇప్పుడు రైల్వే ఎంక్వయిరీస్‌తో పనేమిటి?"

"నాగపూర్ రైలెన్నింటికో కనుక్కోవాలి గదా?"

"నాగపూరా?"

"అవును! నాగపూరే! ఇక నీ ఉద్యోగం అక్కడే!"

"క్షమించు బావా! మిమ్మల్ని విడిచి నాగపూరు వెళ్ళలేను!"

"మేం కూడా నీతోపాటే నాగపూరు వస్తున్నాం!"

"సొంత ఊళ్ళోనే మంచి ఉద్యోగం దొరికినప్పుడు నాగపూరు ఉద్యోగం ఎందుకు?

అక్కడ ఇంటి అద్దెకి సగం జీతం తగలెయ్యాలి! ఇక్కడ సొంత ఇల్లు!"

"సొంత ఇల్లు! ఎవరికి? ఎవరికిరా సొంత ఇల్లు? నీక్కాదు!"

"బావా-"

"బసివిగాడి కంపెనీలో చేరింతర్వాత - ఈ ఇంటో నీకు స్థానం లేదు! వుండదు!"

అంతవరకూ మవునంగా వున్న అన్నపూర్ణ కలగజేసుకుంది -

"అవేం మాటలండీ?"

"అడుగు నీ తమ్ముడ్ని! నాగపూరు వెడతాడా వెడతాడు! సుఖపడతాడు! బసివిగాడి కంపెనీలో చేరి బలైపోతాడా పోతాడు! సుఖపడతాడో బలైపోతాడో - ఏదో ఒకటి తేల్చుకోమను!"

వేణు తన గదిలోకి వెడుతున్నాడు -

"అటెక్కడికి?"

"ఈ ఇంటో నాకు స్థానం లేదని తెలిసిపోయిం తర్వాత - నా వస్తువులు మాత్రం యిక్కడెందుకుండాలి?"

"అంటే? ఇంత చెప్పినా - నువ్వు నీ బావని కాదని ఆ బసివిగాడికే ఓటు వేస్తున్నావా?"

బావగారి మాటల్ని పట్టించుకోకుండా వేణు తన గదిలోకి వెళ్ళిపోయేడు!

అన్నపూర్ణమ్మ భర్తవేపు భయం భయంగా చూస్తోంది!

రంగనాథం అటూ యిటూ చూసి - డైనింగ్ టేబిల్ని ఎత్తిపారేసి వీధిలోకి వెళ్ళిపోతున్నాడు!

అన్నపూర్ణమ్మ అల్లాడిపోతూ అడిగింది -




"అటెక్కడికండీ?"

రంగనాథం ఆగి అన్నాడు -

"అడక్కు! నీ తమ్ముడు ఈ ఇల్లు ఖాళీ చేసిం తర్వాత వస్తా!"

"వీధిలోకి వెడుతున్నారేమో? చెప్పులు తొడుక్కుని వెళ్ళండి!"

"అక్కర్లేదు! చెప్పుల్లేకుండా - ఎర్రటి ఎండలో - తార్రోడ్డు మీద - ఇట్లా ఇట్లా - మెల్లిమెల్లిగా - అడుగులో అడుగు వేసుకుంటో తిరుగుతా!"

"అది కాదండీ!"

"మాటాడకు! మంటెత్తిపోతోంది నాకు!"

అని గబగబా బయటకు నడిచేడు!

అతను వెళ్ళిన వేపు చూస్తూ అన్నపూర్ణమ్మ 'ఊ' అని నిట్టూర్చింది!

* * *

అదొక పక్కా తారు రోడ్డు!

తీవ్రమైన ఎండ మాడు పగలగొడుతుండగా - ఆ రోడ్డు మీద - చెప్పులు లేకుండా నడుస్తున్నాడు రంగనాథం!

నిప్పుల్లో నడుస్తున్నట్టున్నా - అహో, ఓహో అని ఆనందంగా అనుకుంటో మంటని ఓర్చుకుంటున్నాడు!

అతనికి ఎదురుగా వస్తున్న కృష్ణమూర్తి - ఆ విడ్డూరం చూచి షాకు తిన్నాడు! అంచేత అల్లాడిపోతూ అడిగేడు -

"అయ్యయ్యో! ఇంతెండలో తారు రోడ్డు మీద చెప్పుల్లేకుండా నడుస్తున్నారేమిటీ?"

ఇప్పుడు నడక ఆపి - నడిరోడ్డు మీద నిలబడి అంటున్నాడు రంగనాథం -

"నడిస్తే తప్పా? ఇట్లా నడవకూడదని రూలు ఏమైనా పెట్టేరా?"

"కాళ్లు కాలడం లేదూ?"

"ఊహు! లేదు! అయిసు -అయిసు ముక్కల మీద నడుస్తున్నట్టు ఎంతో చల్లగా వుంది! ఆనందంగా వుంది! మాకు ఆనందం ఎక్కువైనప్పుడు పాటలు కూడా వస్తాయి! నాట్యం చేసుకుంటో పాటలు పాడుకుంటాం. చూడండి"

అని నడి రోడ్డు మీద డేన్స్ చేస్తూ - ఏమి హాయిలే హలా అని పాడేడు. రెండంటే రెండు లైన్లు మాత్రమే పాడి అడిగేడు -




"ఇప్పుడు మీ కళ్లు చల్లబడ్డాయా?"

కృష్ణమూర్తి తట్టుకోలేక అన్నాడు -

"చాల్లేండి! మొన్న కూడా ఇదే వరస! పరిచయస్థులు కదా అని - చెప్పుల్లేకుండా నడుస్తున్నారేమిటని బుద్ధిలేక అడిగేను! ఇంకెప్పుడైనా మిమ్మల్ని పలకరిస్తే చెప్పుతో కొట్టండి!"

అని - కృష్ణమూర్తి విసురుగా వెళ్లిపోతున్నాడు!

వెళ్లిపోతున్న కృష్ణమూర్తిని చూస్తో రంకెలు వేస్తున్నాడు రంగనాథం-

"చెప్పుతో కొట్టాలిట చెప్పుతో! చెప్పుతో కొట్టడానికి మా కాళ్లకి చెప్పులేవ్! కనీసం చెప్పులు కూడా కొనుక్కోలేని దుస్థితి మాది! మాకెందుకుంటాయ్ చెప్పులూ? వుండవు! కాలిపోతే మా కాళ్లే కాలతాయ్! మీ కాళ్లు కావుగదా! ఎండలో నల్లిలా మాడిపోతే మేమే మాడిపోతాం! మీరు కాదు గదా! వెళ్లండెళ్లండి!"

అని మరచిపోయిన పాటని మళ్లా మొదలెట్టేడు. బాధని ఓర్చుకుంటో ఆ పాటని ఆనందంగా పాడుకుంటో నడుస్తున్నాడు -

ఏమి హాయిలే హలా!
ఓహో ఏమి హాయిలే హలా!

(ఇంకావుంది)

---

## ఘంటసాల క్విజ్ - 1 విజేతలు

1. మొదటి బహుమతి - కె. వసంత కుమార్, దేవరకొండ.
2. రెండవ బహుమతి - మల్లిడి విజయభాస్కర్ రెడ్డి, కుతుకులూరు.
3. మూడవ బహుమతి - ఎస్.వి. నాగభూషణం, వనస్థలిపురం, హైదరాబాద్.

**కరెక్టు సమాధానాలు:**

1. లక్ష్మమ్మ 2. షావుకారు
3. శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యం 4. పేకేటి శివరాం
5. సావిత్రి

## ఘంటసాల క్విజ్ - 2 విజేతలు

1. మొదటి బహుమతి - ఎస్.ఎస్. కృష్ణమూర్తి, సికింద్రాబాద్.
2. రెండవ బహుమతి - ఎస్. హేమ, కర్నూలు.
3. మూడవ బహుమతి - ఎమ్. నాగేశ్వర శర్మ,గుంటూరు.

**కరెక్టు సమాధానాలు:**

1. విజయకుమార్ 2. పరోపకారం
3. షావుకారు 4. ఏడుకొండల శ్రీనివాసా
5. దినకరా శుభకరా

## ఘంటసాల క్విజ్ - 3 విజేతలు

1. మొదటి బహుమతి - ఎమ్.ఎ.కృష్ణ, ఖైరతాబాద్,హైదరాబాద్
2. రెండవ బహుమతి - గంగారపు వెంకట్రావు, సత్తెనపల్లి.
3. మూడవ బహుమతి - వి.రోశిరెడ్డి, సత్తెనపల్లి

**కరెక్టు సమాధానాలు:**

1. త్యాగయ్య 2. సందేహించకుమమ్మా
3. నిదురపోరాతమ్ముడు
4. శ్రీ రఘురాం జయ రఘురాం
5. అదుగదుగో అల్లదుగో

**బహుమతులు:**

1. మొదటి బహుమతి : ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది.
2. రెండవ బహుమతి : 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
3. మూడవ బహుమతి : ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్‌మి నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది.



# తెలుగు సినీ గీత కోశం

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 807 | చోద్యం చూశావా | మర్మయోగి | 1964 | ఘంటసాల | ఆరుద్ర | సుశీల |
| 808 | మధువు మనకేల సఖియరో | మర్మయోగి | 1964 | ఘంటసాల | ఆరుద్ర | ఘంటసాల, జమునారాణి, కోమల |
| 809 | నవ్వుల నదిలో | మర్మయోగి | 1964 | ఘంటసాల | ఆరుద్ర | పి.లీల, ఘంటసాల |
| 810 | పాలోయమ్మపాలుకమ్మనిగుమ్మపాలు | మర్మయోగి | 1964 | ఘంటసాల | ఆరుద్ర | సుశీల, ఘంటసాల |
| 811 | రావాలి రావాలి రమ్మంటే రావాలి | మర్మయోగి | 1964 | ఘంటసాల | ఆరుద్ర | ఘంటసాల, జమునారాణి |
| 812 | తీయనైన హృదయం | మర్మయోగి | 1964 | ఘంటసాల | ఆరుద్ర | సుశీల |
| 813 | నాజూకైన గాడిదా | మర్మయోగి | 1964 | ఘంటసాల | కొసరాజు | ఘంటసాల, జమునారాణి |
| 814 | చూసింది ఒకచోట | మొగుడా పెళ్ళామా | 1975 | ఎస్.హనుమంతరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, వాణిజయరాం |
| 815 | నేనంటే నువేలే | మొగుడా పెళ్ళామా | 1975 | ఎస్.హనుమంతరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, జమునా |
| 816 | పరమ శివుని మెడలోని పాము అన్నది | మొగుడా పెళ్ళామా | 1975 | ఎస్.హనుమంతరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు |
| 817 | తెలియదటమ్మా | మొగుడా పెళ్ళామా | 1975 | ఎస్.హనుమంతరావు | కొసరాజు | మనోరమ |
| 818 | హేపీ బర్త్‌డే... టు యూ | మహ్మద్ బిన్ తుగ్లక్ | 1972 | ఎస్.హనుమంతరావు | కొసరాజు | ఎస్.పి.బాలు, బృందం |
| 819 | జోహారు జోహారు ఢిల్లీశ్వర | మహ్మద్ బిన్ తుగ్లక్ | 1972 | ఎస్.హనుమంతరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, విజయలక్ష్మి కన్నారావు |
| 820 | కొంటె చూపుల చిలకమ్మ | మహ్మద్ బిన్ తుగ్లక్ | 1972 | ఎస్.హనుమంతరావు | దాశరథి | ఎస్.పి.బాలు, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 821 | నిరుపమ గుణశాలి | మహ్మద్ బిన్ తుగ్లక్ | 1972 | ఎస్.హనుమంతరావు | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 822 | వయసులో రుబి రుబి | మహ్మద్ బిన్ తుగ్లక్ | 1972 | ఎస్.హనుమంతరావు | సి.నారాయణరెడ్డి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 823 | భామల్లాల భామల్లాల | ముద్దబంతిపువ్వు | 1976 | రమేష్‌నాయుడు | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 824 | హలో అమ్మాయి పాలరాతి బొమ్మోయి | ముద్దబంతిపువ్వు | 1976 | రమేష్‌నాయుడు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, రమోల |
| 825 | ముద్దబంతి పూలు | ముద్దబంతిపువ్వు | 1976 | రమేష్‌నాయుడు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, రమోల |
| 826 | పచ్చగడ్డి కోస్తుంటే | ముద్దబంతిపువ్వు | 1976 | రమేష్‌నాయుడు | సి.నారాయణరెడ్డి | సుశీల. కోరస్ |
| 827 | ప్రణయ రాగ రంజిత | ముద్దబంతిపువ్వు | 1976 | రమేష్‌నాయుడు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, జానకి |
| 828 | వలచే ప్రతి మనిషికి | ముద్దబంతిపువ్వు | 1976 | రమేష్‌నాయుడు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు |
| 829 | ఆనందమే బ్రహ్మానందమే | ముగ్గురు మూర్ఖులు | 1976 | చక్రవర్తి | వీటూరి | సుశీల |
| 830 | అరబ్బు వీరులారా స్వాగతం | ముగ్గురు మూర్ఖులు | 1976 | చక్రవర్తి | దాశరథి | ఎస్.పి.బాలు, సుశీల, ఎస్.జానకి |
| 831 | హే కృష్ణా నువ్వురాకుంటే నాకేదిదారి | ముగ్గురు మూర్ఖులు | 1976 | చక్రవర్తి | వీటూరి | సావిత్రి, ఎల్.ఆర్.ఈశ్వరి, అంజలి, కౌసల్య |
| 832 | కృష్ణా కృష్ణా అందరి వాడవని | ముగ్గురు మూర్ఖులు | 1976 | చక్రవర్తి | వీటూరి | సుశీల |
| 833 | వీచెను ధీరసమీరే | ముగ్గురు మూర్ఖులు | 1976 | చక్రవర్తి | వీటూరి | ఎస్.పి.బాలు, సుశీల |
| 834 | ఏరా ఏరా పెద్దోడా | ముగ్గురు మూర్ఖులు | 1976 | చక్రవర్తి | కొసరాజు | ఎస్.పి.బాలు, రమేష్, ఎమ్.సత్యం |
| 835 | బ్రహ్మే తాళము మ్రోద | మురిపించే మువ్వలు | 1962 | S.M.సుబ్బయ్యనాయుడు | ఆరుద్ర | పి.లీల, రాధాజయలక్ష్మి |
| 836 | దేశాన ఉత్తముల చిత్రవధ | మురిపించే మువ్వలు | 1962 | S.M.సుబ్బయ్యనాయుడు | ఆరుద్ర | ఘంటసాల, గ్రూప్ |
| 837 | జయమనుమా శుభ జయమనుమా | మురిపించే మువ్వలు | 1962 | S.M.సుబ్బయ్యనాయుడు | ఆరుద్ర | మాధవపెద్ది |
| 838 | కాంచ కన్నుల విందు | మురిపించే మువ్వలు | 1962 | S.M.సుబ్బయ్యనాయుడు | ఆరుద్ర | పి.లీల |
| 839 | కులుకు తేనెటీగాయే | మురిపించే మువ్వలు | 1962 | S.M.సుబ్బయ్యనాయుడు | ఆరుద్ర | సుశీల |
| 840 | నా ఆశ నీవు తీర్చుమా | మురిపించే మువ్వలు | 1962 | S.M.సుబ్బయ్యనాయుడు | ఆరుద్ర | ఘంటసాల |
| 841 | నీ లీల పాడెద దేవా | మురిపించే మువ్వలు | 1962 | S.M.సుబ్బయ్యనాయుడు | ఆరుద్ర | ఎస్.జానకి |
| 842 | శాంత ముఖంతో సంతతం | మురిపించే మువ్వలు | 1962 | S.M.సుబ్బయ్యనాయుడు | ఆరుద్ర | అప్పారావు |
| 843 | సొంపౌ గజ్జెల శృతి చేసా | మురిపించే మువ్వలు | 1962 | S.M.సుబ్బయ్యనాయుడు | ఆరుద్ర | పి.లీల |
| 844 | శుభములిచ్చే వేల్పు | మురిపించే మువ్వలు | 1962 | S.M.సుబ్బయ్యనాయుడు | ఆరుద్ర | పి.లీల |
| 845 | వీరుల భూమి | మురిపించే మువ్వలు | 1962 | S.M.సుబ్బయ్యనాయుడు | ఆరుద్ర | ఎల్.వి. కృష్ణ, బృందం |
| 846 | గొగులు పూచె | ముత్యాలముగ్గు | 1975 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | సుశీల, ఎస్.పి.బాలు |
| 847 | ముత్యమంత పసుపు | ముత్యాలముగ్గు | 1975 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | సుశీల |
| 848 | శ్రీరామ జయ రామ | ముత్యాలముగ్గు | 1975 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | బాలమురళీ కృష్ణ |
| 849 | ఏదో ఏదో అన్నది | ముత్యాలముగ్గు | 1975 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | రామకృష్ణ |
| 850 | ఎంతటి రసికుడవో తెలిసెరా | ముత్యాలముగ్గు | 1975 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 851 | నిదురించె తోటలోకి | ముత్యాలముగ్గు | 1975 | కె.వి.మహదేవన్ | గుంటూరు శేషేంద్రశర్మ | సుశీల |
| 852 | చెకుముకి రవ్వ | నేరం నాది కాదు ఆకలిది | 1976 | సత్యం | సి.నారాయణరెడ్డి | సుశీల, బృందం |
| 853 | డైమన్ రాణి గులాబీల బుగ్గ | నేరం నాది కాదు ఆకలిది | 1976 | సత్యం | ఆరుద్ర | ఎస్.జానకి |
| 854 | హైదరాబాద్ బుల్ బుల్ | నేరం నాది కాదు ఆకలిది | 1976 | సత్యం | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు |
| 855 | మంచిని సమాధి చేస్తారా | నేరం నాది కాదు ఆకలిది | 1976 | సత్యం | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు |
| 856 | పబ్లిక్‌రా ఇది అన్ని తెలిసిన పబ్లిక్‌రా | నేరం నాది కాదు ఆకలిది | 1976 | సత్యం | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు |

సేకరణ: పున్నమరాజు శేషగిరిరావు, విశాఖపట్నం.

వచ్చే సంచికలో మరికొన్ని



# బాపు విశ్వరూపం 15

బొమ్మలేసే బాపు కథలు రాస్తారా? రాస్తే ఎలా వుంటుంది? అని ఆశ్చర్యపడేవారు - 'మబ్బూ వానా - మల్లెవాసనా -' చదివితీరాలి. దీనిలో రమణమార్కు వాక్యాలు కనబడి కొంపదీసి రమణ గారు రాసిపెట్టారా అని ఆశ్చర్యపడతాం.

నిజం చెప్పాలంటే రమణగారి పేర వెలువడిన 'లక్ష్మి' (1953) కథ బాపుగారు ఆయనకు రాసిపెట్టినదే! తనను ఎంకరేజ్ చేయడానికి బాపు రాసిపెట్టారని అంటారు రమణగారు. అంతేకాదు, ఇటీవలే ఎల్లలోకానికీ తెలియబరచారు కూడా - బాపుకార్టూన్లలో, వాటిల్లో రాతా, గీతా బాపువేనని, తనవి ఎంతమాత్రం కాదనీ.

బాపుగారి కథలు మూడు, లక్ష్మి కథ వారి ఎక్కవుంటులో వేస్తే! కథలో అక్కడక్కడ రమణ (అదే బాపు) తరహా చెణుకులు కనబడ్డా అదొక విషాదగాథ. తరువాత వచ్చిన కథల సరసన నిలబడదు. 'అమ్మ-బొమ్మ' అనే కథ 1959లో ఆంధ్రపత్రిక వీక్లీకై 'పిక్చర్ ఆఫ్ డోరియన్ గ్రే' గుర్తుకువచ్చేట్లా పిల్లల కొరకై రాశిన ఆ కథ నీతిబోధకంగా ఉంటుంది.

ఇక ఈ లైట్ రొమాంటిక్ కథ 1957లో ఆంధ్రపత్రికకై 'లక్ష్మీనారాయణ' పేరుతో రాశారు. బాపు, రమణల ఆలోచనల్లో ఎంత సాదృశ్యం ఉందో మరోసారి ఎత్తిచూపే కథ ఇది -

తెరమీద మధుబాల సిగపూల సొగసు చూడగానే మాధవరావులో ఒక మధురానుభూతి కలిగి, యతిప్రాసయుతమైన వాక్యంలా రమణీయరూపం ధరించి, తీరనికోరిక అంత పెద్ద కెరటంలా లేచి, అందంగా విరిగిపడి మనసును కలవరపరిచింది. సీత, వెన్నెల, మల్లెపూలు, అందమైన ఊహలు, మబ్బూ, వానా ఇలాటివన్నీ అతనికి గబగబా జ్ఞాపకం వచ్చేశాయి. ఇంటికి బయలుదేరాడు.

*****

మాధవరావుకి మల్లెపూలంటే ఇష్టం.

"సీతా! నువ్వు జడలో మల్లెపూలు ముడుచుకుంటే ఎంత బావుంటావనుకున్నావ్! పిల్లతెమ్మెరలు ఆ మల్లెల చల్లటి పరిమళాన్ని మెల్లిగా, నాసాపుటాలకు విందుగా అందచేస్తుంటే ఎంత బాగుంటుందో - ఈ లోకమే మరిచిపోతా! - అదొక మధురానుభూతి" అని మాత్రం ఎప్పుడూ అనలేదు. అతనికి అలాటి మాటలాట్టే సయించకపోవడం ఒక కారణం.

రెండోది - తన అర్ధాంగి సవరం వాడుతుంది. అందుకని "నీ సవరంలోని పువ్వులు" అని వాక్యం సవరించాలి. దాంతో పొయెట్రీ కాస్తా పోనేపోయె.

'టంటంటం టంటంటం' అన్నాడు మాధవరావు, హీరో దగ్గరనుంచి వచ్చిన ఉత్తరాన్ని గుండెలకి హత్తుకుంటూ 'అట్టతోట'లో హిందీ హీరోయిన్ పాడిన పాటను యథాశక్తి అనుకరిస్తూ.

ఇంకో నిమిషం తరువాత తలుపుతాళం తీసి, లోపల బల్లమీద పడేస్తూ "టింటర టింటం టరటరటం" అని కూడా అన్నాడు. ప్రస్తుతం సీత ఇంట్లోలేదు కాబట్టి ఇంకో టరటాలు కలిపి పాడినా ఫరవాలేదు.

ఆఫీసునుంచి తిన్నగా సినిమా కెళ్లి హోటలువాడు "ఇది అన్నమే" అని హామీ ఇచ్చిన పదార్థాలను వాడు నొచ్చుకుపోతాడేమో అని తనుకూడా అది అన్నమే అని నమ్మేసి తన ఇంటికి వచ్చాడు.

సీత ఉదయం బయలుదేరి పక్క ఊళ్లో చుట్టాలింటికి పెళ్లికి వెళ్లింది. రేపో ఎల్లుండో వస్తుంది.

రాత్రి పదిన్నరవుతోంది.

"వెదర్ యమగా ఉంది" అనుకున్నాడు. అందువల్ల తెగించి గోల్డుఫ్లేకు పెట్టె కొనేశాడు మాధవరావు. రూపాయినోటు తీసుకుని మళ్లీ లిక్కిలిక్కిమని అణా చిల్లరివ్వటమేమిటని, అడక్కుండానే కొట్టువాడు డీలక్సు అగ్గిపెట్టె చేతిలో పెట్టాడు. పిల్లలు కలవాడు - పోనీలే అని మాధవరావు అడ్డుచెప్పలేదు.

సిగరెట్టు వెలిగించి, లైటార్పి, పక్కమీద పడ్డాడు. బయటగాలి జోరుగా వీస్తోంది. కొద్దినిమిషాలకి చినుకులు ప్రారంభించాయి. పొడినేల మీద తొలిచినుకులు పడగానే వచ్చిన వాసనకి మాధవరావు ముగ్ధుడయిపోయాడు. "హో! మల్లెపూల వాసనకంటే బావుందే" అనుకున్నాడు.

వారం రోజుల క్రితం సంగతి గుర్తొచ్చింది.

*****

తెల్లారి అయిదింటికి వాన మొదలెట్టింది. వానంటే కూడా మాధవరావుకి ఎంతో ఇష్టం. పెళ్లవని రోజుల్లో, వానొచ్చినప్పుడల్లా, పక్కన తనకిష్టమైన చక్కటి అమ్మాయి చెక్కిలికి చెక్కిలి ఆనించి మరీ వానని చూడాలనుండేది.

పెళ్లయిన తరువాత ఒకరోజు వాన రాగానే ఆ సంగతి గుర్తుకొచ్చింది. ఇపుడు సీతని లేపి, చెంపకిచెంప ఆనించి వానని చూద్దామని అడుగుతే,నిద్దుర మత్తులో ఆ అమ్మాయి కంగారు పడొచ్చు. అయినా లేపాడు.

"ఊఁ" అంది సీత కళ్లు తెరవకుండానే.

"వాన" అన్నాడు తను.

"కిటికీ తలుపులు మూసేయండి.జల్లు కొడుతుంది" అంది సీత.

మాధవరావుకి చిరాకేసింది.

"అబ్బే అదికాదు. కిటికీ దగ్గర కూచుని వాన చూద్దాంరా.లే" అన్నాడు కోపంగా.

సీత ఆవులించింది."బావుల్దడ్డీ -హాయ్- అదే బావుల్ది. అర్ధరాత్రి వేళ అంకమ్మ శివాలన్నట్లు. చాల్చాలు.పడుకోల్దీ" అంది -అటువేపు తిరిగి.

"టెక్నికల్ అబ్జెక్షను. అర్ధరాత్రి కాదు - ఇపుడు అయిదయింది-తెల్లారి.." అన్నాడు ఇంకా కోపంగా.

సీతకి ఇవేమీ వినిపించినట్టు లేదు.

మండిపోయాడు మాధవరావు.

దడదడా లేచి కోపంగా పళ్లు తోమేసి(తనవి) ముఖం కడిగేసుకుని, అంతకన్న కసిగా పదహారు అగ్గిపుల్లల సాయంతో కుంపటి అంటించి పారేసాడు. మళ్లీ తెచ్చి వంటింట్లో పెట్టి వసారాలో కొచ్చావ్వట్టికి గూట్లో పాలగిన్నె ఖాళీగా కనిపించింది. ఇంకా పాలవాడు రాలేదు- వాన పడ్డం మూలాన్ని, వాడూ బహుశా వాడి తాలూకు అర్ధాంగి చెంపకి చెంపానించి వానని బయట వాన జోరు కొంచెం తగ్గింది. కిటికీలోంచి వచ్చే గాలికి దుప్పటి మడతపడింది. సిగిరెట్టు బయటికి విసిరి, దుప్పటి సరిచేసి తలగడా మీద తల ఆన్చాడు.

మల్లెపూల వాసన గుప్పుమంది.

నిన్న రాత్రి, సీత, పక్కింటివారి అమ్మాయి తెచ్చి పెట్టినవీ, తను అంతకుముందే కొన్నవీ కలిపి జడలో రోజూకంటే మరిన్ని పూలు తురుముకుంది. వాటి తాలూకు పరిమళం తలగడాని అంతటా అలముకుని, జవరాలి కంచుకంలా గాఢాశ్లేషం చేసుకుందనిపించింది. మర్నాటికీ ఆ పరిమళం అలాగే ఉండటం గమనించిన మాధవరావులో తక్షణం మనోహరమైన ప్రణయభావాలు, మధురస్మృతులు మెదలాయి.

అమాంతం సీత అంటే ప్రేమ పెల్లుబికింది.

*****

తను మొదటిమాటగా పెద్ద పండుక్కి అత్తారింటికెళ్లినప్పుడు, గుమ్మం దగ్గర మల్లెపూలు బేరం చేస్తున్న సీత అప్పుడే రిక్షా దిగిన తన్ను చూడగానే బోలెడు సిగ్గుపడిపోయి గబుక్కున లేచి, గడప తగిలి బోర్లాపడినంత పనిచేసి, వసారా తుడుస్తున్న పనిమనిషిని ఢీకొట్టి, పడిపోకుండా నిలదొక్కుకుని లోపలికి పరిగెత్తుకెళ్లిపోయిన సందర్భం తలచుకుని తక్షణం తనూ బోలెడు సిగ్గుపడిపోయాడు. ఆ మైకంలోనె రిక్షావాడు 'పావలా ఇప్పించండి బాబూ' అని అడుగుతుంటే, ఇంతకంటే చచ్చినా దమ్మిడీ ఇవ్వనని వాడి చేతిలో పరాగ్గా అర్ధరూపాయి కాసు పెట్టేశాడు తను.

రాత్రి డాబాలో వెన్నెల కింద పక్కవేశారు. భోజనాలయిన తరువాత మామగారు తనకొచ్చిన జలుబు గురించి చెబుతూ, అణ్వాస్త్ర పరీక్షలూ, వాటి దుష్ఫలితాలూ వివరించి, అమెరికానూ, బ్రిటన్నూ తలవాచేట్టు తిట్టారు. అసలు ఇలాటి ఏటంబాంబులు మన పూర్వులు ఎప్పుడో కనిపెట్టి పారేశారని చెప్పి ఆయన బోల్డు

గర్వపడిపోయాడు. మళ్లీ లేచి కాశ్మీరం మీదికి దండయాత్ర ఆరంభించేటప్పటికీ, మాధవరావు వెకిలి నవ్వు నవ్వేసి, చప్పట్లు కొట్టినంత గట్టిగా చిటికెలు వేస్తూ ఆవలింతలు అభినయించేసరికి విముక్తి లభించింది.

భోజనం అయి వదిహేడు నిముషాలయింది. అంతవరకూ సిగిరెట్టే కాల్చలే! డాబా మీదకు వెళ్తూనే వరుసగా రెండు కాల్చేసి అయిన కాలనష్టం భర్తీ చేసాడు.

తెల్లటి వెన్నెల క్రింద, తెల్లటి పక్కమీద పాల కెరటంలాంటి మెత్తటి తెల్లటి దుప్పటీ-దుప్పటీ మీద ఆ కెరటవు నురగలా తెల్లటి మల్లెపూలు-"ఓహ్!ఏమి టేస్టురా" అనుకుని గుండెలు బాదుకున్నాడు. "యమటేస్టు" అని తనే జవాబు చెప్పుకున్నాడు.

సరే తరువాత మెట్లమీద గాజులగలగల, దరిమిలా కనబడిన సీత మొహం కలకల, ఆ మొహం తాలూకు కాటుకకళ్ళు మిలమిలా, ఆ పైన శబ్దాలంకారం కోసం ఆమె చేతి మరచెంబు తళతళా మొదలైన ఏర్పాట్లు చూసి మాధవరావు మురిసిపోయాడు.

*****

వర్షజలంతో శుభ్రంగా కడిగివేసిన నక్షత్రాలను,పల్చటి మబ్బుతెరలలోంచి చూస్తూ ఉంటే, ఆతారలు మరింత మనోహరంగా తియ్యటి తొయ్యలి గురించిన మధురభావాలలా కనిపించి అనిపించాయి.

లోగడ తాను చూసిన హిందీ సినిమా తాలూకు హీరోలాగా, తను వదిలిన సిగిరెట్టు పొగలోకి ఫోటోజెనిక్‌గా చూస్తూ"ఇదేగాబోలు -మధురస్మృతులంటారు హసినీ!" అనుకున్నాడు మాధవరావు.

"అంటే అన్నారు గాని ఇవన్నిటిని లేక వీటన్నిటినీ సీతకు గుర్తుచెయ్యాలి. చేసి ఆమె ముఖం మీద కనబడే సిగ్గుదొంతర్లు చూడాలి. ఆమె పెదాల మీద పూచే అలతి నవ్వుల పువ్వులను ఆఘ్రాణించి అలాంటి చిరునవ్వు నవ్వినందుకు ఆ పెదాలను యధాశక్తి సత్కరించాలి. ఆ!" అనుకున్నాడు మాధవరావు. రానీ చెప్తా అని గట్టిగా అన్నాడు. వచ్చేదాకా నిదురపోవచ్చుననుకుని మెల్లిగా నిద్రకు ఉపక్రమించాడు.

మర్నాడు సాయంకాలం ఆఫీసునించి ఇంటికి వచ్చేటప్పటికి సీత వచ్చేసింది.

మొహం కడుక్కుని కాఫీ తాగుతూ తను చెప్పదలచుకున్నది చెబుదామనుకున్నాడుగానీ, ఆ అమ్మాయి చాకలాడికి బట్టలేస్తోన్నదని చూసి, ఇది మంచి సమయము కాదు అనుకుని విరమించుకున్నాడు. భోజనాదికాలు పూర్తిచేసిన తరువాత వెన్నెలలో అయితే భేషుగ్గా ఉంటుందని నిర్ణయించుకున్నాడు.

సీత,వంటిల్లుకడిగి ముగ్గెట్టి, తాళం వేసి వచ్చి, పక్కన కూచుని తమలపాకు చిలకలు చుట్టి నోట్లో వేసుకుంటుంది.

మాధవరావు'రైఠో' అని పుంజుకున్నాడు. వెంఠనే సరళప్రద ప్రవాహం ఉహూ సెలయేరు లాగా వెలువడకపోయినా, ఉపోద్ఘాతంగా గొంతు సవరించుకుని సకిలించాడు.

"ఏమిటి-ఆఁ!" అన్నాడు.

నోరు తమలపాకులు నమలడంలో పూర్తిగా నిమగ్నమయి ఉన్నందున కళ్లతోనే 'ఏమిటి' అంది సీత. అని జవాబుకి ఎదురు చూడకుండా తమలపాకుల పళ్లెం, చెక్కపొడి భరిణా బీరువాలో పెట్టడానికి అటేపెళ్లింది.

కాసేపు తెల్లబోయి తమాయించుకుని "సీతా-ఇలారా" అన్నాడు మాధవరావు.

దగ్గరకొచ్చింది సీత.

సీతని దగ్గరగా చూడగానే తాను చెప్పదల్చుకున్నది అప్పటికి వాయిదావేసి "పెళ్లి బాగా జరిగిందా" అన్నాడు.

"ఆ! పెళ్లికేం దివ్యంగా జరిగింది. మీరు రాలేదని చాలా ఇదయ్యారు కూడాను" అంది సీత - మళ్లీ వెళ్లి బీరువా తలుపు మూస్తూ.

మాధవరావుకి చిరాకేసింది. సీత మీద కోపం వచ్చింది. ఆ మాత్రం అర్థం చేసుకోదేమని.

కుదుటపడి, ఫ్లాష్‌బాక్‌తో ఆరంభించడం మంచిదని"నేను పెద్ద వండక్కి మీ ఇంటికొచ్చినప్పుడు గుర్తుందా-" అన్నాడు

"లేకేం. అన్నట్టు అపుడు మా అమ్మ నాకు పెట్టిన చీర గుర్తుందా? ఎర్రంచు బార్డరు. తెల్లచుక్కలు ఉంటాయి. అలాటిదే మగపెళ్లివారు పెట్టారండీ నిన్న పెళ్లిలో. వదిహేను రూపాయలు తక్కువలోనే కొన్నారుటండీ. అప్పుడు మా అన్నయ్యకి చెప్పాకూడాను- వెళ్లి మళ్లీ సరిగ్గా ధర కనుక్కురారా

# ముబ్బా వానా మల్లె వాసనా



అని. బడుద్ధాయి వినలేదు. బావుండదే- తీసేసుకున్నాం కదా అని సణిగాడు. కానీ భలే ఉందండీ...."

మంచినీళ్లు!మంచినీళ్లు!! అన్నాడు మాధవరావు.

తెచ్చిచ్చి వెళ్లి పక్కమీద వాలింది సీత"నిన్న రాత్రంతా నిద్దురేలేదూ" అంటూ.

మాధవరావు పిడికిళ్లు బిగించాడు. పళ్లు నిశ్శబ్దంగా కొరికాడు. ఆఖరి ప్రయత్నం చేసాడు-గొంతుకని సాధ్యమైనంత మెత్తగా వినబడేటట్టు చేయ ప్రయత్నిస్తూ.

సీతా! నిన్నరాత్రి తలగడాలమీద తల అన్చగానే వాసన...

"అబ్బే మాసిపోయాయండీ-ఇవాళే చాకలాడికి వేసేశా కొత్తవి తొడిగాలెల్డి-హాయ్-పడుకోండి బాబూ నిదరొస్తోల్ది" అంది సీత ఆవులిస్తూ.

"లైటార్పేయండి బాబూ కాస్త" అని కూడా అంది .

ఎర్రంచు బార్డరు-హు! అని సణుక్కుంటూ స్విచ్చిదగ్గరకెళ్లాడు మాధవరావు.

*****

**జరిగిన కథ**

అజయ్ అనే శ్రీమంతుడు, విజయ్ అనే పేదవాడు ఒక ఏడాదిపాటు తమ తమ స్థానాలను మార్చుకోవాలని నిశ్చయించుకుంటారు. అజయ్ స్థానంలో వచ్చిన విజయ్ మేనేజర్ భానోజీకి ముకుతాడు వేస్తాడు. అతని కుమార్తె సరళ మంచిదని తెలిసి ప్రేమిస్తాడు. విజయ్ చెల్లెలు మీనా కాపురం సరిదిద్దే ప్రయత్నంలో విజయ్ స్థానంలో అజయ్ తప్పనిసరి పరిస్థితుల్లో తన సంతకం తనే ఫోర్జరీ చేసి జైలుపాలవుతాడు. ఈ లోగా భానోజీ చేతికి తాళంచెవులు చిక్కడంతో ఇనప్పెట్టె తెరిచి అజయ్, విజయ్‌లో ఒప్పందం సంగతి తెలుసుకుంటాడు. ఏమీ తెలియనట్టు నటిస్తూ విజయ్, సరళల వివాహం ఏర్పాటుచేస్తాడు. అతని గుట్టుబయటపెట్టాలని విజయ్ సమ్మతిస్తాడు కూడా.

(ఇక చదవండి)

అన్నపూర్ణావారి

# ఇద్దరు మిత్రులు



సీరియల్ - నం 20

**రచన : ముళ్లపూడి వెంకటరమణ**



పెళ్ళి. ఆడపెళ్ళి వారింటనే ఏర్పాటు చేశాడు పిల్ల తండ్రి. కాబోయే జమీందారిణి తండ్రిగా, దర్జాగా భారీ ఎత్తున రంగుహంగులు సమకూర్చాడు శోభాయమానంగా అలంకరించాడు. అంతా మిత్రులే తప్ప, బంధువులు లేరు. విజయ్ తరపున అసలు లేరు. భానోజీగారి ధైర్యం పుంజుకుంది. ఒకటి రెండుసార్లు, "విజయ్‌బాబూ" అని పిలిచిచూసి బెదరగొడదామని ఉబలాటం కలిగినా తమాయించుకున్నాడాయన. హాలులో సంగీతం హాయిగా వుంది. కాదు చిత్రంగా వుంది. పెళ్ళికళలు వున్నా...ఎలాగో ఉందనిపించింది.

"ఏదో పెద్ద పోలీసువాను వచ్చింది సార్!" అన్నాడు శేషావతారం కంగారుగా.

"రాదు మరీ, మినిష్టరూ, వాళ్లూ వస్తారు గదా బందోబస్తు ఉండొద్దూ" అన్నాడు భానోజీగారు ధైర్యంగా నవ్వి.

"మినిష్టర్స్ వస్తున్నారాసార్!" అన్నాడు గుమాస్తా గుడ్లు పెద్దవిచేసి.

"ఎందుకు రారయ్యా. అజయ్‌బాబూ వంశం అంటే ఏమనుకున్నావ్ గవర్నరు గారొచ్చినా ఆశ్చర్యంలేదు" అన్నాడు భానోజీ - పనిలో పనిగా తనకి తను నచ్చచెప్పుకుంటూ. గవర్నరు మాటెలా వున్నా, పోలీసు కమీషనరు గుమ్మంలో కారు దిగాడు.



"బందోబస్తు అంతా పకడ్బందీగా వుందా, ఇన్‌స్పెక్టర్!" అన్నాడు.

"యస్. సార్!"

"లోపల్నించి బయటికిగాని, బయటనించి లోపలికిగానీ ఎవర్నీ కదల్నివ్వకూడదు"

"యస్. సార్!"

విజయ్, ఆయనను వెంటబెట్టుకుని హాలులోకి వచ్చాడు.

"అమ్మయ్యా! వచ్చేశావా, అజయ్‌బాబూ!" అంటూ ఎదురొచ్చాడు భానోజీ విజయ్‌ని చూచే వరకూ ఆయన కొంచెం కంగారు పడుతూనే వున్నాడు.



"ఇదిగో, నా ఫ్రెండ్‌ని వెంటబెట్టుకు వచ్చేసరికి ఆలస్యమైంది. వీరు మిస్టర్ శేఖర్. అమెరికాలో నా క్లాసుమేట్" అన్నాడు విజయ్.

వీడింకో తోడుదొంగ కాబోలు! చాలామందిని చక్కబెట్టుకోవాలి అనుకుంటూ, వందనం చేశాడు భానోజీగారు.

"వీరు మిస్టర్ భానోజీ! నాకు కాబోయే మావగారు" అన్నాడు విజయ్.

అపరాధుల "మామగారు", విజయ్ మామగారికి వందనం చేశాడు - పరీక్షగా చూస్తూ.

"చాలా సంతోషం. దయచెయ్యండి, దయచెయ్యండి"అన్నారు భానోజీగారు చిరునవ్వు పులుముకుని.

వచ్చినవాడు అతిథిగా ఉండేట్టులేడు.

"మిస్టర్ అజయ్, ఎండన పడొచ్చారు, లోపల కెళ్ళి టాయిలెట్ చేసుకుని రండి" అన్నాడు.

"అవు నజయ్‌బాబూ! అమ్మాయికూడా మేడ మీదే వుంది. త్వరగా తయారై అయిదు నిముషాల్లో వచ్చేయండి!"



"మిస్టర్ శేఖర్-"



"ఇట్సాల్‌రైట్...మీ పని మీరు చేసుకోండి. కింద ఏర్పాట్లన్నీ నేను చూస్తానుగా" అన్నాడు శేఖర్.

భానోజీగారు ఆయనని కూర్చోబెట్టి మర్యాద చేయబోయారు. హాలు బాల్కనీ కిటికీదగ్గర ఎర్రటోపీ కనబడింది. ఇంకో క్షణంలో ఆ వరస వరసంతా అవే. తుపాకులు పట్టుకు మరీ నిలబడ్డారు పోలీసులు.

భానోజీగారికీ మతలబు కొరుకుడు పడలేదు. మొగపెళ్ళివారు ఇంత బందోబస్తుగా రావడం ఏమిటో అంతుచిక్కలేదు. నిజంగానే మినిస్టర్లూ, గవర్నర్లూ వస్తూవుండి వుండాలి.

"ఇన్‌స్పెక్టర్‌గారూ ఈ పోలీసులంతా ఇక్కడ తమాషా చూడాలని వచ్చారా? లేక బందోబస్తుకి వచ్చారా? వెళ్ళి ఆ బజారు జనం లోపలికి రాకుండా చూడమనండి" అన్నాడు గుంభనగా...



...గుట్టు ఆరా తీయడానికి.

శేఖర్‌గారు తమాషాగా నవ్వారు.

"మీకా సందేహం అక్కర్లేదు భానోజీగారూ. ఇంటికి బయటా, లోపల కూడా బందోబస్తు చేశాం" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

ఇంటి లోపల - అంతఃపురంలో, పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ ముస్తాబుల మీమాంస చేస్తున్నారు.



"అవతల టైమ్ అయిపోతోంది. విసిగించక చెప్పండి అజయ్‌బాబూ! ఏది వేసుకోను! ఇదా, ఇదా?" అంది సరళ రెండు నెక్లెస్‌లు చూపిస్తూ.

"ఉఁహు. ఈ రెండూ కాదూ నీ పుట్టినరోజుకి వేసుకున్నావే - ఆ నెక్లెస్."

"ఓ అదా - ఇన్ని నగలుండగా సరిగ్గా అదే కావాలేమిటి" అంది సరళ అందంగా నవ్వి.

"ఏం!? నీకిష్టమైన టై వేసుకోవాలని మారాం చేస్తావే నువ్వు?" అన్నాడు విజయ్ పెంకెగా.

"ఎంత చిలిపివారండీ మీరూ" అని కిలకిల నవ్వుతూ, ఆ నెక్లెసున్న సొరుగును లాగింది సరళ. అది బెట్టు చేసింది. విజయ్ చేయిచేసుకుని బలంగా ఒక్కసారి లాగాడు. పెద్ద కుదుపుతో అది ఊడివచ్చింది. దాంతో పాటు, దానిని ఆనుకొని వున్న గోడ బీరువాలో లక్ష్మీపటం ఊడిపడింది. ఆ చప్పుడుకు అటుచూసిన విజయ్, సరళ నిర్ఘాంతపోయారు.



ఆ పటం వెనుక గూఢంగా ఇంకో గోడబీరువా ఉంది. దాని అరల నిండా వెయ్యిరూపాయల నోట్లు కట్టలుకట్టలుగా ఉన్నాయి. బంగారం కమ్మెచ్చులు దొంతరపెట్టి ఉన్నాయి. నెక్లెసు, విలువగల ఆభరణాలూ, కాసులూ కుప్పతిప్పలుగా ఉన్నాయి.



ఇద్దరికీ చాలాసేపు నోటమాట రాలేదు.

"ఆశ్చర్యంగా ఉందే!" అంది సరళ నెమ్మదిగా.



విజయ్ ఆమె ఆశ్చర్యాన్ని పరిశీలనగా చూచాడు.

"నాకు తెలీకుండా నాన్న ఇవన్నీ దాచారన్న మాట" అంది సరళ. అది విజయ్‌తో అన్నమాట కాదు తనకి తనే చెప్పుకుంటున్నట్టుంది.

"నిజంగా నీకు తెలియదా సరళా?" అన్నాడు విజయ్ ఆమె కళ్ళలోకి సూటిగా చూసి.

"నిజం! నాకేం తెలీదు అజయ్‌బాబూ. అంతా అయోమయంగా ఉంది. ఇదేమిటో నాన్ననే అడుగుతాను" అంటూ వెళ్ళబోయింది సరళ.

విజయ్ ఆమెను వారించాడు.

"ఒద్దు సరళా. బహుశా నీ పెళ్ళి సమయంలో కానుకగా ఇవ్వాలని ఆయన ఉద్దేశమేమో, - ఆ ఆనందం ఆయనకు దక్కనీ."



"అజయ్‌బాబూ" అన్న గర్జనవిని వెనక్కి తిరిగి చూశాడు విజయ్.

భానోజీగారు పులిలా నిలబడి ఉన్నాడు.

"ఏమిటిది? ఎవరా తెరిచింది?" అన్నాడు ఉద్రేకంగా.

శుభముహూర్తం వచ్చేసింది. విజయ్ నిర్లక్ష్యంగా నవ్వాడు.

"మేం తెరవలేదు మిస్టర్ భానోజీ, కాలం మూడినపుడు రహస్యాలు వాటంతట అవే తెరుచు కుంటాయి."

"అజయ్‌బాబూ"



"భానోజీగారూ. ఈ నగలూ, డబ్బూ ఎక్కడివి మీకు? ఎలా సంపాదించారు?" అన్నాడు విజయ్ జబర్దస్తీగా.

"విషయం నీకు అనవసరం."

"మా ఎస్టేటునూ, ఫ్యాక్టరీనీ కొల్లగొట్టి మోసంచేసి చేర్చిన డబ్బుకాదా అది?" అన్నాడు విజయ్ తీవ్రంగా.

భానోజీగారు కసిగా, హేళనగా నవ్వారు.

"మీ ఎస్టేటు...బికారివి.. నీకో ఎస్టేటుకూడానా. నీ నిజస్వరూపం నాకు తెలీదనుకొంటున్నావా? ఎంతకాలం ఇలా మోసం చేద్దామనుకుంటున్నావ్?"అన్నాడాయన జబర్దస్తీగా.

"నాన్నా! నాన్నా ఏమిటి నాన్నా నువ్వంటున్నది?" అంది సరళ కంగారుగా.

"నువ్వుండమ్మా...చూడు, విజయ్‌కుమార్, నీ రహస్యం నా గుప్పెట్లో వుంది...బాగా ఆలోచించుకో. బుద్ధి తెచ్చుకుని నువ్వు నా చెప్పుచేతల్లో ఉంటావా-నీకే ఆపదా రానివ్వను. సరళనిచ్చి వివాహం చేస్తాను. నా ఆస్తితో పాటు అజయ్‌బాబు జమీందారీక్కూడా నిన్ను అధిపతిని చేస్తాను."



విజయ్ ఇక వినలేకపోయాడు.

"నన్ను ద్రోహిగా బ్రతకమంటావా? నా జన్మలో అలాటి నీచానికి పాల్పడను" అన్నాడు.

"అయితే, నీ సర్వనాశనాన్ని నువ్వే కోరుకుంటున్నావన్న మాట!"

"లేదు. నువ్వు చేసిన మోసాన్ని బయటపెట్టి, అజయ్‌బాబు ఆస్తిని



"నిలబెడతాను" అంటూ కమీషనర్‌ను పిలువబోయాడు విజయ్.

భానోజీగారు రెప్పపాటులో రివాల్వరుతీసి, గురిచేసి "ఆగు!" అని గర్జించాడు.

అంతవరకూ ఆ యిద్దరి సంభాషణ వింటూ, కంగారుపడుతున్న సరళ, ఆ క్షణంలో తండ్రి దగ్గరకు పరుగునవచ్చి, రివాల్వరు లాక్కోబోయింది.



భానోజీగారు విసురుగా ఒక్కతోపు తోశారు కుమార్తెను. "నోరుమూసుకు పడుంటావా లేదా.. ఏం... నిన్నే... చెప్పు" అని గద్దించాడు విజయ్‌ను.

సరళకి భయోద్వేగంలో భయంపోయింది. తండ్రిని వారించడానికి వెనుకపాటుగా పరుగెత్తింది.

"సరళా!" అన్నాడు విజయ్.

భానోజీగారు ఉలికిపడి వెనుదిరిగిన క్షణంలో విజయ్ ఆయనమీదికి దూకి, రివాల్వరు లాగబోయాడు. దాదాపు ఒక నిముషంపాటు పెనుగులాట సాగింది. భీకరంగా నిశ్శబ్దంగా సాగింది. సరళకి అరవడానికి కూడా భయంకలిగి, కొయ్యబారిపోయి చూస్తూ నిలబడింది. రివాల్వరు రెండుసార్లు పేలింది, అద్దం పగిలింది.



అత్తయ్యగారి కోపం ధర్మమా అని ఖైదునుండి బయటపడిన అజయ్, పోలీసులను వెంటబెట్టుకుని పైకి వచ్చింది, సరిగ్గా ఆ ముహూర్తంలో, పోలీసులకన్నా చురుగ్గా ముందుకు దూకి భానోజీగారి చెయ్యిపట్టుకు వెనక్కివిరిచి రివాల్వరు లాగివేశా డతను.

అతన్ని చూచిన ఉత్తరక్షణంలో భానోజీగారు పట్టువిడిచాడు.



"మీరా అజయ్‌బాబూ! ఎంత అదృష్టం. సమయానికొచ్చారు. వీడు మోసగాడని ఇప్పుడే కనుకొన్నాను" అన్నారు నిష్ప్రయోజనం అని తెలిసీ తుదియత్నంగా.

"మోసగాడా! ఎవరు భానోజీ?" అన్నాడు కమీషనర్.

"వీడే. దగాచేసి అజయ్‌బాబు ఇంట్లో ప్రవేశించాడు. అజయ్‌గా నటించి, ఇన్నాళ్లూ మా కన్ను గప్పాడు."

"ఏమిట [illegible] వ్వు?"

"ఇది [illegible] ఏవండి మీకే తెలుస్తుంది" అంటూ, అజయ్‌కేసి ఒక్కసారిచూసి, జేబులోని అగ్రిమెంటుకాగితం కమీషనర్ చేతికిచ్చారు భానోజీ.



"ఎంత ఘోరం అజయ్‌బాబూ. ఆ దుర్మార్గుడు మీ ఆస్తి కాజెయ్యాలని చూశాడు. మిమ్మల్ని జైల్లో పెట్టించాడు. చివరికి మా సరళను కూడా మోసం చేసి పెళ్ళాడడానికి సిద్ధపడ్డాడు. తేనె పూసిన కత్తి వీడు..." అన్నాడు ఆయాసపడుతూ.



అజయ్ బావురుమని ఏడ్చి ఆయనను కౌగిలించుకోలేదు. "కట్టిపెట్టు భానోజీ. నీ పాపం పండింది. తిన్నింటివాసాలు లెక్కపెట్టి మా డబ్బు దోచుకున్నది నువ్వు...మా నాన్నగారి ఆఖరి ఘడియల్లో మోసంచేసి నగలన్నీ కాజేసి ఇక్కడ చేరవేసింది నువ్వు...ఫ్యాక్టరీ డబ్బును కాజేసింది నువ్వు..." అన్నాడు అజయ్.

"అబద్ధం, అది నేను ఆర్జించి కూడబెట్టుకున్న డబ్బు-"



కమీషనరు నవ్వాడు. "ఓహో! మీ కొచ్చే జీతంలో అంత డబ్బు కూడబెట్టారన్నమాట.... అయితే, మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాను.."అన్నాడు.

భానోజీగారు తలదించుకున్నారు.

"నాన్నా, నాన్నా, దేనికోసం చేశావు నాన్నా" అంది సరళ దుఃఖం నిగ్రహించుకుంటూ.

తండ్రికి కూతురు ముఖం చూడటానికి ధైర్యం చాలలేదు. "అంతా నీ మేలుకోసమే చేశాను. నువ్వు సిరిసంపదలతో సుఖపడాలనే చేశాను" అన్నాడు నిట్టూర్చి.



"నా సుఖంకోసమా, ఎంత పొరబడ్డావు నాన్నా, మోసం చేసి నాకు ధనరాసులిస్తే వాటితో నేను సుఖపడగలనా నాన్నా?" అంది సరళ ఆవేదనతో- జాలితో.

"అంతేకాదు, నీ భవిష్యత్తుకోసం ఎన్నో కట్టుదిట్టాలు చేశాడు-" అన్నాడు విజయ్.

అంతా అతనికేసి చూశారు.

"ఈ వీలునామా చూడు, మీ నాన్న బనాయించింది. దీని ప్రకారం అజయ్‌బాబు నిన్ను పెళ్ళాడితే ఆస్తి అంతా నీదే. కాకపోయినా, ఆస్తిలో సగభాగం నీకు చెందుతుంది..." అంటూ వీలునామాపత్రం అందించాడు.



కుమార్తెకు తండ్రి మీద జాలికూడా పోయింది. కోపగించే స్థితి దాటిపోయింది. అసహ్యం వంటిది ఏర్పడింది. "ఎంత ఘోరం చేశావు నాన్నా. ఎవరి ఉప్పుతిని మనం ఇన్నేళ్లు బతికామో, వాళ్ళనే మోసం చేశావా? నీలాంటి వాడి కడుపున పుట్టడమే నా దురదృష్టం" అంది.

ఏ తండ్రికి ఇంతకు మించి క్షోభ కలగదు, ఏ నేరస్తుడికీ ఇంతకుమించిన శిక్ష పడదు.



భానోజీగారి గుండె చితికి పోయింది. కంట గిర్రున నీరు తిరిగింది.

"హుం ఎవరికోసం నా జీవితం అంతా ధారపోశానో- ఆ నా బిడ్డే నాకు ఎదురుతిరిగేక నా కింకేం మిగిలింది..." అన్నాడు నెమ్మదిగా.

ఒక్క క్షణం దుర్భరమైన నిశ్శబ్దం ప్రవరిల్లింది.

-(ఇంకావుంది)




విజయ, వాహిని, ఏ.వి.యం, అన్నపూర్ణా, ఎన్.ఎ.టి, సారథి వంటి సంస్థలలాగే మంచి చిత్రాలను నిర్మించిన సంస్థలలో అనుపమ ఫిలిమ్స్ ఒకటి. దర్శక నిర్మాత కె.బి.తిలక్ ఈ సంస్థకు అధినేత. పెండ్యాల, ఆరుద్ర వంటివారు ఈ సంస్థకు వెన్నెముకలు. అనుపమ సంస్థ నుండి వెలువడిన ఎన్నో చక్కటిచిత్రాలలో విలువలతో కూడిన పాటల ఆవిర్భావానికి ఈ ముగ్గురి కలయికే కారణం. అటువంటి చిత్రాలలో ఒకటి




1958లో వెలువడిన ఈ చిత్రంలోని పాటలను, పద్యాలను ఆరుద్ర వ్రాయగా పెండ్యాల స్వరపరిచారు. ఆ చిత్రంలోని ఓ ఆరు పాటలివి:

అ: పైలా పైలా పచ్చీసు పరువంలోని లేడీసు ॥2॥
మగాళ్ళతోటి సమానమంటూ
ఎక్కారండీ సైకిల్సు
పైలా పైలా పచ్చీసు
ఆ: జీరోలైన హీరోసు
వెంట తిరుగుతూ వెక్కిరించితే
అవుతారండీ మురుగీసు ॥పైలా॥
అ: నోటికి పవరు జాస్తి - దానికి తాళం నాస్తి
పోట్లాడేందుకు మాటల యీటెలు- ఆడాళ్ళకు అస్తి ॥పైలా॥
ఆ: అల్లరి బుద్ధి పోదు తిన్నని మాట రాదు ॥2॥
మీ మగవారి మాటల తీటలు వేపకాయలా చేదు
పైలా పైలా పచ్చీసు
లైలా అంటూ మజ్నూసు
వెంట తిరుగుతూ వెక్కిరించితే
చేస్తారండీ - మాలీసు ॥పైలా॥
అ: సమాన హక్కుల కోసం హోరాహోరీ పోరాటం ॥2॥
రైలుబండిలో సినిమాహాల్లో స్థానం మాత్రం ప్రత్యేకం ॥పైలా॥
ఆ: ఆశయాలకై వీరు నిలబడతారని పేరు ॥2॥
కట్నం కోసం పట్నం చదువులు చదివే పెద్ద మొనగాళ్ళు॥పైలా॥








పి.బి.శ్రీనివాస్, జిక్కి బృందం పాడిన ఈ పాటను జగ్గయ్య, గిరిజ, మరికొందరు ఉప పాత్రధారులు అభినయించారు. సంగీతం ప్రపంచంలో వాదసంవాదాల ప్రక్రియ పద్యాలతో నాటకాలలో మొదలై సినిమాలలో ప్రవేశించి పాటలతో పెద్ద మలుపు తిరిగి చాలాకాలం వరకు ఆరోగ్యకరమైన ధోరణిలోనే కొనసాగింది. ఆ రోజులలో పుట్టిన పాటే యిది. ఈ వాద సంవాదాలలో ఇరువైపుల నుంచి వచ్చే ఆరోపణలు దేనికదే కరెక్టుగా ఉంటాయి. అలా రాయగలగడం, అందుకు తగ్గ పాయింట్లను పోగుచేసుకోవటం, వాటికి భాషా చమత్కారాన్ని జోడించటం రచయిత ప్రత్యేకతలలో ఒకటి. ఈ పాటను ఆపాంతం గమనిస్తే ఆ లక్షణాలన్నీ పరిపుష్టంగా కనిపిస్తాయి. ఆ రోజుల్లో సినిమాధియేటర్లలో మధ్యకి ఓ గోడ కట్టేవారు. ఆ గోడకి అటువైపు ఆడవారు, ఇటువైపు మగవారు కూర్చునేటట్టుగా సీట్లను ఏర్పాటు చేసేవారు. ఇప్పటికీ దొరుకుతున్న పూలరంగడు, సీతామాలక్ష్మి సినిమాలు చూస్తే ఈ తరం వారికి ఆనాటి పోకడలపై ఓ అవగాహన ఏర్పడుతుంది.

ఈ పాటలో - రైలుబండిలో, సినిమాహాల్లో స్థానం మాత్రం ప్రత్యేకం- అనే వాక్యం ఆనాటి ఆ పోకడలకు అనుగుణంగా రాయబడినదే! నోటికి పట్టుబడే నులువైన సాహిత్యాన్ని చక్కటి తూగుతో పెండ్యాల నడిపించిన విధం పాటను నలుగురి నోళ్ళలోనూ నానే విధంగా నిలిపింది.

అ: రమ్మంటే వచ్చారు అమ్మాయిగారూ - మన
సిమ్మంటే కమ్మగా ఏమంటారు? ॥రమ్మంటే॥
ఆ: రమ్మంటే వచ్చానా అబ్బాయిగారూ - ఇలా
రాలుగాయి మాటలంటే పొమ్మంటారు ॥రమ్మంటే॥
అ: కయ్యంతో మొదలైంది మన కలయిక - ఇది
వియ్యంగా మారాలని నా కోరిక ॥కయ్యంతో॥
ఆ: ఇద్దరమూ వియ్యానికి ఇష్టపడినను - మన
పెద్దవాళ్ళు లైను క్లియరు యివ్వాలిగా
అ: రమ్మంటే వచ్చారు అమ్మాయిగారూ - మనసిమ్మంటే కమ్మగా ఏమంటారు?
ఆ: మీరిమ్మంటే ఇవ్వనండీ అబ్బాయిగారూ - పెద్దలిమ్మంటె ఇస్తానే ఏమంటారు
అ: ముచ్చటలు మురిపాలు పెద్దవాళ్ళవి - మన
సిచ్చి పుచ్చుకొనడాలు చిన్నవాళ్ళవి ॥ముచ్చ॥
ఆ: ఇల్లలికిన వెంటనే పండుగయ్యేనా - ఈ
ఇంపైన మాటలు నిలకడయ్యేనా....
అ: అహహ ॥రమ్మంటే॥
ఆ: పట్నంలో చదివారు అబ్బాయిగారూ - మీకు
కట్నం కావాలంటే పొమ్మంటారు -
అ: కట్నం కావాలి నాకు అమ్మాయిగారూ -
మిఠాయ్ పొట్లం వలె నీ మనసే కట్నం నాకు
ఆ: ఏనాడో మనసిచ్చా అబ్బాయిగారూ - మన
మిద్దరమూ హాయిగా జీవిద్దాము.



ఈ పాటను పి.బి.శ్రీనివాస్, జిక్కి పాడగా జగ్గయ్య, గిరిజ అభినయించారు. ప్రస్తుతం యుగళగీతాల పేరిటవస్తున్న విన్యాసగీతాల (రచన, స్వరరచన, అభినయం అంతా విన్యాసమే) ప్రభంజనంలో ఈ పాటను గనుక వినడం జరిగితే మనసు వికలమైపోతుంది. ప్రేమికులు మనసిచ్చిపుచ్చుకునే ప్రయత్నాలలో ఏకాంతంగా హాయిగా పాట రూపంలో వెలిబుచ్చుకునే అభిప్రాయాలు రానురాను ఓ ఇరవై ముప్ఫై మంది మధ్య 'మంద'భాగ్యంతో వెల్లడించవలసిన బహిరంగ శృంగార విన్యాసాలుగా మారినందుకు గుండె తరుక్కుపోతుంది. అనారోగ్యాన్ని ఇనుమడింప చేసే తిండిని తింటున్న సంతానాన్ని చూసి ఆరోగ్యకరమైన వాతావరణంలో పెరిగిన పెద్దల మనసు విలవిల లాడినట్టు అయిపోతుంది. హాయిగా అనిపించి, వినిపించే ఈ పాటకు హిందుస్థానీ రాగమైన తిలంగ్ ఆధారరాగం.

అశోకవనమున సీతా
శోకించె వియోగము చేతా ॥అశోక॥
కంటికి మంటికి ఏకధారగా
కారేను వేడి కన్నీరు కారెను వేడి కన్నీరు
ఆ కన్నీరే లంకాపురమున
ఐనది పెద్ద కోనేరు ॥అశోక॥
పతినీ తననూ విడదీసి
చెరపెట్టెను క్రూర రావణుడు
చెరపెట్టెను క్రూర రావణుడు
భరించలేని నరకమది
విడిపించను రాడా రాముడు ॥అశోక॥
శీలవతి ఆ సీత గతి చూచిన
శిలలే ద్రవించెను
నాథుని కొరకై సాధ్వి రోదన ॥2॥
నాలుగు దిసెలను దహించెను ॥2॥ ॥అశోక॥



ఈ పాటను పి.సుశీల పాడగా తర్వాతి రోజుల్లో దేవికగా ప్రసిద్ధిచెందిన ప్రమీల అభినయించింది. జగ్గయ్య, పెరుమాళ్ళు, లక్ష్మీకాంతమ్మ సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. ఈ పాట రచనా విధానంపై ముళ్ళపూడి వెంకటరమణగారి అభిప్రాయం, సాక్షి సినిమా తీసేటప్పుడు ఆరుద్రగారితో ఆ అభిప్రాయాన్ని వెలిబుచ్చిన తీరు, దానికి ఆరుద్ర స్పందించిన విధానం ఇవన్నీ హాసం 17 వ సంచికలో (1-15 జూన్ 2002) ప్రచురించటం జరిగింది. ఆ వైనాన్ని చదివి ఈ పాటను వింటే ఆ రోజులలో సమీక్షలు, విమర్శలు పాఠకులకు అందించే ప్రయత్నంలో ఫిలింక్రిటిక్స్ ఎంత లోతుగా ఆలోచించేవారో తెలుస్తుంది. ఆ విషయాన్ని ఓ పక్కనపెట్టి పాటను పాటగా చూస్తే హృదయాన్ని నేరుగా స్పృశించే ఆర్ద్రతతో రసభావాల్ని ఆరుద్ర ఆవిష్కరించిన శైలి, ఆ స్పందనను తన స్వరరచనా నైపుణ్యంతో అందించిన పెండ్యాల, తన గళ మాధుర్యంతో వీరివురి సామర్థ్యాలను అందించిన సుశీల ముగ్గురు సమాన ప్రాతినిధ్యాన్ని అందుకుంటారు. హరికాంభోజి రాగం ఆధారంగా ఈ పాట స్వరపరచబడింది.

**నీ దయరాదా యీ దాసిపైనా**
**నెనరుంచి పాలించు యేనాటికైనా ॥నీ దయ॥**
**ఏ కొర నోములు నోచుట వలనో**
**శోకానికే బ్రతుకంకితమైనది**
**చేరువలోనే ఎడబాటులేలా**
**గారవించి నను కాపాడ లేవా ॥నీ దయ॥**
**చెలి నిండు పరువాన చెంతను నిలిచినా... ॥2॥**
**ఉలకవు పలకవు ఒకసారి చూడవు**
**మురిపాల సరదాలు కరువైన నను చూసి**
**కరుణించి యిసుమంత కరుగదా మనసు ॥నీ దయ॥**



ఈ పాటను పి.సుశీల పాడగా ప్రమీల (దేవిక), రమణమూర్తి అభినయించారు. సుశీల పాడిన పాటల్లో చాలా మంచిపాటగా పేరుతెచ్చుకోవలసిన పాట యిది. ఎందుకు మరుగున పడిపోయిందో ఇవాళ్టికీ అర్థం కాదు. హెచ్.ఎం.వి. వారు పుణ్యం కట్టుకొంటే బావుండననిపించే గొప్ప పాట యిది. ఫిమేల్ సోలోలు కరువయిపోతున్న ఈనాటి ఔత్సాహిక గాయనీమణులకు సాధన చేసుకోడానికి పనికి వచ్చే పాట యిది. అందుకు తగ్గ అలాపనలు, గమకాలు హృద్యంగా ఉన్నాయి ఆ పాటలో. ఈ పాటకు జయజయావంతి రాగం ఆధారం. జయజయావంతి రాగంలో పెండ్యాల స్వరపరచిన ఏమి రామ కథ శబరీ శబరీ ఎంతగా ఆకట్టుకుంటుందో అంతగానూ ఆకట్టుకోగల సత్తావుందీ పాటలో. వీలైతే సంపాదించి వినండి.... ఇంత మంచి పాటని ఇన్నాళ పాటు ఎలా మిస్సయ్యాం, మిస్సయి ఎలా వుండగలిగాం అని అనిపించి తీరుతుంది.

నటీనటులకు కొన్ని కొన్ని విషయాలలో ప్రావీణ్యం... ప్రవేశం లేకపోయినా కనీసం గమనించే సామర్థ్యం ఉండి తీరాలి. ఈ పాటలో రమణమూర్తి వయొలిన్ వాయిస్తూ వేళ్ళు కదిపిన తీరు ఈ మాటను సమర్థిస్తుంది. ఇలాంటి చిన్న చిన్న విషయాలను ఎవరు పట్టించుకుంటారులే అనే ధోరణిని ఇవాళ వస్తున్న చాలా సినిమాలలోని పాత్రధారులు వాద్య పరికరాలను ఉపయోగించే తీరుతెన్నులను బట్టి అర్థం చేసుకోవచ్చు.

**అ: నాలో కలిగినది - అది ఏమో ఏమో**
**మధుర భావం నాలో కలిగినది**
**ఆ: పెదవి దాటి మాటలు రావు బెదిరిపోతాయి ॥2॥**
**అ: హృదయములో విరితేనెలు సోలిన ॥2॥**
**ఊహలు రేగాయి ॥నాలో॥**
**అ: కనులముందు కమ్మని ఆశలు కలకల మన్నాయి ॥2॥**
**ఆ: మనసు పడి మన ప్రేమ లతాళి పూవులు పూసింది ॥నాలో॥**
**ఆ: కలువరించే కలలు పండే - శుభదినముదయించే ॥2॥**
**ఆ: కల నిజమై ఒడి నిండుగ తీయని కోరిక ఫలియించే ॥నాలో॥**



ఈ పాటను ఘంటసాల, సుశీల పాడగా జగ్గయ్య, గిరిజ అభినయించారు. తెలుగు సినీ యుగళగీతాల లిస్ట్‌లో అతి చక్కటి స్థానాన్ని పొందవలసిన ఈ పాట కూడా ఎంతమంది రసజ్ఞ శ్రోతలకు వినమరుగై పోవటం నిజంగా దురదృష్టం. ఘంటసాల అభిమానులు.... ఇంకా చెప్పాలంటే మంచి పాటలకు చెవియొగ్గే ప్రతి శ్రోతా దాచుకోదగ్గ పాటయిది. ఈ పాటను కూడా తిరిగి సినీ సంగీతాభిమానులకు చేరవేసే బాధ్యతను స్వీకరించమని హెచ్.ఎం.వి. వారిని ఈ శీర్షికను వేదికగా చేసుకుని పత్రికా ముఖంగా ఈ సమీక్షకుడు అభ్యర్థిస్తున్నాడు.

ఈ పాటను భాగీశ్వరి రాగం ఆధారం. ఈ రాగంలో పెండ్యాల వారు ఎన్ని మంచిపాటలందించారో అందరికీ తెలుసు. అయినా రసస్పందనకోసం అలిగితివా సఖీ ప్రియా, రారా కనరారా పాటలను గుర్తుచేసుకోవడం అప్పుడప్పుడు అవసరం. అలా జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఈ 'నాలో కలిగినది' పాటను వింటుంటే మనసులో నిండిపోయే తృప్తిని మాటలలోకి అనువదించలేం.

శాంతారాం నిర్మించిన 'ఝనక్ ఝనక్ పాయల్ బాజే' చిత్రంలో వసంత్ దేశాయ్ స్వరపరచగా హేమంత్‌కుమార్, లత పాడిన 'నైన్ సే నైన్ నాహి మిలావో' పాటను ప్రేరణగా తీసుకుని ఈ పాటను పెండ్యాల ట్యూన్ చేశారని ఈ చిత్ర దర్శకనిర్మాత శ్రీ కె.బి.తిలక్ ఓసారి అన్నారు. ఆ హిందీ పాటకు మాల్‌గుంజ్ రాగం ఆధారం. మాల్‌గుంజ్ రాగాన్ని భాగీశ్వరి రాగం అనుకుని పొరబడే అవకాశాలు ఎలావుంటాయో 'హాసం' 14 సంచికలోని(16-30 ఏప్రిల్ 2002) అర్థం చేసుకుందాం - ఆస్వాదిద్దాం శీర్షికలో వివరించటం జరిగింది. ఈ 'నాలో కలిగినది' పాటను పెండ్యాలగారు భాగీశ్వరి రాగంలోనే స్వరపరిచారు కనుక ఈ పాటను, ఆ హిందీపాటను సంపాదించి వినగలిస్తే భాగీశ్వరి- మాల్‌గుంజ్ రాగాలకు గల తేడాలు పోలికలు తెలిసే అవకాశం వుంది.

జోడు గుళ్ళ పిస్తోలు రా - నేను
ఆడీ తప్పని వాణ్ణీ - జీహో ॥నేను॥
హద్దు మీరు వారు శిక్షింప బడుదురు
బుద్ధిమంతులెపుడు రక్షింపబడుదురు ॥జోడు॥
ఆఫీసరు భార్యననే అహం కూడదు
అధికారం చెలాయిస్తే యింక చెల్లదు
తొండ ముదిరితే ఊసరవెల్లి
అత్తా... హజం ముదిరితే హళ్ళికి హళ్ళి ॥జోడు॥
కాకి పిల్ల కాకికి కదు ముద్దు - అది అందుచేత
కాకూడదు మొద్దు-
ఎవరి గొప్ప వాళ్ళ వద్ద- ఆగకున్నచో ॥ఎవరి॥
దేహశుద్ధి కొండొకచో జరుగుట కద్దు ॥జోడు॥
నోరు మంచిదైతే వూరు మంచిది
పోరు నష్టమూ - ఎపుడూ పొందు లాభము
ఇది కోర్టు కెక్కితే అంతా అభాసు - అత్తా
నీ జోరు తగ్గకుంటేనూ కొంప కళాసు ॥జోడు॥



ఈ పాట ఘంటసాల పాడగా జగ్గయ్య అభినయించారు. సూర్యకాంతం, గిరిజ సన్నివేశప్రాధాన్యంగా పాల్గొంటారు. పాట విన్న తర్వాత ఘంటసాల పెర్ఫార్మెన్స్ తప్ప ఇంకేదీ మనసులో నిలవదు. ఆ గళానికి ఉన్న ఆకర్షణ, సామర్థ్యం అదీ....! శోకరసానికి ఎప్పుడూ ఉపయోగించే శివరంజని రాగాన్ని ఈ పాటకు ఉపయోగించడంలో పెండ్యాల వారి ప్రతిభను గమనించినకొద్దీ ఆయన మీద గౌరవం మరింత పెరిగిపోతుంది. ఇక ఈ పాటలో- రచయితగా ఆరుద్ర చేసిన చమత్కారాలు కొన్ని వున్నాయి. రెగ్యులర్‌గా మనకు వినిపించే జోడుగుళ్ళ పిస్తోలు రా, ట్రెస్ పాసర్స్ ఆర్ ప్రాసిక్యూటెడ్ (హద్దుమీరిన వారు శిక్షింప బడుదురు) హళ్ళికి హళ్ళి, కొంప కళాస్ వంటి వాక్యాలు; అహంకూడదు, తొండ ముదిరితే ఊసరవెల్లి, కాకి పిల్ల కాకికి ముద్దు, నోరు మంచిదైతే ఊరుమంచిది, పోరునష్టం - పొందు లాభం వంటి సుద్దుల్ని, సామెతల్ని చాలా తెలివిగా వాడుకున్నాడాయన. పాటను త్వరగా జనం నోటికి పట్టుబడేట్టు చేసేవి ఇలాంటి చమత్కృతులే...!

పైనుదహరించిన 6 పాటలు మాత్రమే కాక మరో మూడు పాటలు కూడా ఉన్నాయిచిత్రంలో. వాటిలో తడికో తడికా పాట ఒకటి.

**ఈ చిత్రం ప్రింట్ దొరకటం ఇంచుమించు దుర్లభం. ఛానల్‌వారైనా పూనుకుంటే ఈ చిత్రాన్ని పాటలతో సహా ప్రేక్షకులకు అందించగలరు. కేవలం పాటల వరకు హెచ్.ఎం.వి. వారు తలచుకుంటే వీలయినంత త్వరగా శ్రోతలకు చేరుతుంది. కాకపోతే సంకల్పం ముఖ్యం.** ■

## బాలూ సంగీత దర్శకత్వంలో పాడిన ఎమ్.ఎస్.విశ్వనాథన్, ఇళయరాజా







ఒకప్పుడు ఎమ్మెస్ విశ్వనాథన్ కారుని చూస్తే చాలు జన్మ ధన్యమైపోతుందనుకొని ఆయన కారు వెళ్ళే దారిలో కాపుకాచి ఎదురు చూసిన ఇళయరాజా ఆయనతో కలిసి పాడడం.... ఇదీ మన బాలూ సంగీత దర్శకత్వంలో....

కొన్ని కొన్ని నిజాల్ని ఓపట్టాన నమ్మలేం.... కానీ ఇది నిఖ్ఖంగా నిజం...

అసలేం జరిగిందంటే...

బాలుగారబ్బాయి యస్.పి.చరణ్ తండ్రిలా పాటలు పాడడం, నటించడమే కాకుండా ఇటీవల ఓ తమిళ చిత్రాన్ని నిర్మించాడు. ఆ సినిమా పేరు 'ఉన్నై శరణడైన్దేన్'. బాలచందర్ శిష్యుడు 'కని' ఈ చిత్రానికి దర్శకత్వం వహించారు. ఇళయరాజా సోదరుడు గంగై అమరన్ పాటలు రాయగా బాలూ వాటిని స్వరపరిచారు.

ఈ విషయాన్ని 'హాసం' కి చెబుతూ "తను (చరణ్) పాటలు పడటంలో నా ప్రమేయం ఏమీలేదు. నేనెవ్వరికీ రికమెండ్ చెయ్యలేదు. తనకు తానుగా అవకాశాల కోసం ప్రయత్నించాడు. దొరికిన అవకాశాలను సద్వినియోగం చేసుకున్నాడు. ఇవాళ సినిమా తియ్యటానిక్కూడా అన్ని వనరులూ తను స్వంతంగా సమకూర్చుకున్నవే. కాకపోతే... మ్యూజిక్ చేసినందుకు మీ డబ్బులు ఇప్పుడియ్యను నాన్నా... సినిమా రిలీజయ్యాక ఇస్తాను... అని అన్నాడు. అయితే నా మనసుకు నచ్చిన ట్యూన్‌లు నేను చేసుకుని, నాకు నచ్చినవాళ్ళతో పాడించుకుంటా అని తిరిగి కండిషన్ పెట్టాను. ఓకే అన్నాడు" అని వివరించారు బాలూ.

ఈ సినిమాలో యస్.పి.చరణ్ నెగిటివ్ రోల్ పోషించాడు కూడా! అతని స్నేహితుడుగా ప్రధాన పాత్రలో వెంకట్‌ప్రభు కనిపిస్తాడు. ఇతను గంగై అమరన్ కుమారుడు. మీరా అనే అమ్మాయి హీరోయిన్.

ఇంతకీ ఎమ్మెస్ విశ్వనాథన్, ఇళయరాజా కలిసి పాడిన పాట గురించి చెప్పలేదు కదూ... 'పానుక్కు నిలమూడు' అనే పల్లవితో మొదలవుతుందీ పాట.

మొత్తం 5 పాటలు గల ఈ చిత్రం షూటింగ్, ఎడిటింగ్, డబ్బింగ్, రీరికార్డింగ్ అన్నీ అయిపోయాయి. ప్రస్తుతం మిక్సింగ్ జరుగుతోంది. జులై నెలాఖర్లో గాని ఆగస్టు మొదటి వారంలోగాని తమిళనాట విడుదలవుతుంది.

**అప్పుడే ఈ సినిమా గురించి తెలుగు సినీ** పరిశ్రమలో చర్యలు మొదలయ్యాయి కనుక డబ్బింగ్ రూపంలో గాని, స్ట్రెయిట్ సినిమాగా గాని తెలుగువారు అతి త్వరలో చూడొచ్చు. ■





విడుదలై 50 సంవత్సరాలు పూర్తయినా
నేటికీ సజీవంగా ఉన్న సంగీత సాహిత్యాలను
కలిగిన పాటలతో అలరారిన వినోదా వారి
'దేవదాసు' చిత్రంలోని కొన్ని దృశ్యాలు పాఠకుల
మధుర స్మృతి కోసం...

హాసం






అందమైన కళ్లే కాదు
వారసత్వంగా వచ్చేది.....
అపాయకరమైన వ్యాధులు కూడా...
హెపటైటిస్-బి వ్యాధి సోకిన తల్లి తనకు తెలియకుండానే గర్భస్థ శిశువుకు కూడా సంక్రమింపచేస్తుంది - ఆ కాలేయపు వ్యాధిని. మీ డాక్టర్‌ను సంప్రదించండి. సకాలంలో టీకా వేయించుకోండి. ధర అందుబాటులో ఉండే అంతర్జాతీయ శ్రేణి వ్యాక్సిన్ గురించి తెలుసుకోండి.
ప్రజాహితం కోరి విడుదల చేసినది
ప్రాణాంతక హెపటైటిస్-బి వ్యాధి నిరోధక టీకా
శాన్‌వాక్-బి తయారీదారులు:
శాంతా
బయో టెక్నిక్స్ (ప్రై)లి.
3వ ఫ్లోరు, శిరీన్ ఛాంబర్స్, బంజారాహిల్స్, హైదరాబాద్
ఫోన్స్ : 040-23548507, 23608843, ఫ్యాక్స్: 040-23548476
హెపటైటిస్-బి
పసుపు వలయం
ప్రమాద సూచకం
Help. Stop HBV
Shanvac™ - B
r-DNA Hepatitis-B vaccine